# చతుర

అక్టోబరు 2016
రూ. 15/-



రాధికా ఆప్టే
సౌందర్య రహస్యం ..122



వారెవ్వా!

# హరిత సందేశం!

ఆ యువతి చేతిలో నెమలి ఎంత అందంగా ఒదిగిపోయిందో! ఇలాంటి మరెన్నో అద్భుతాలు కెనడాలోని క్విబెక్ నగరం మాంట్రియల్ బొటానికల్ గార్డెన్‌లో దర్శనమిస్తాయి! గడ్డి, పూల మొక్కలతో పలు ఆకృతులను ఆకర్షణీయంగా రూపుదిద్దారు. ఇరవయ్యో శతాబ్దం ప్రారంభంలో ఆర్థిక మాంద్యం కారణంగా అంతరించిపోతున్న జంతుజాలాన్ని సంరక్షించాలనే చైతన్యం ప్రజల్లో కలిగించడానికి దీన్ని ఏర్పాటు చేశారు. నూట ఎనభై ఐదు ఎకరాల విస్తీర్ణమున్న ఈ ఉద్యానవనంలో ఇరవై ఆరువేల రకాల వృక్షజాతులున్నాయి!

# ముఖచిత్రంగా మీ ముఖారవిందం!




క్యూట్ క్యూట్ బేబీస్, యూత్‌ఫుల్ లేడీస్‌కు ప్రాధాన్యం
అందం, ఆకర్షణ, తగిన డ్రస్‌సెన్స్ ఉంటే చాలు...
మీ అభిమాన చతుర / విపులకు మీరే ముఖచిత్రం అవుతారు
చేయాల్సిందల్లా - పోస్ట్‌కార్డ్ సైజ్ క్లోజప్పులు రెండు,
అదేసైజ్ 3/4 ఫొటో ఒకటి వెంటనే మాకు పంపండి.
ఫొటోలు మెయిల్ కూడా చేయొచ్చు

**నోట్ : ఫొటోల ఎంపికలో తుది నిర్ణయం సంపాదకులదే. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు, వాదవివాదాలకు చోటేలేదు.**

★ ఫొటోలు పంపేవారు విధిగా తమ ఫోన్‌నెంబర్లుసహా తమ తల్లిదండ్రుల అంగీకార పత్రాలు పంపాలి.

★ ప్రచురణ తర్వాత ఫొటోలు తిరిగి కావాలనుకునేవారు తగిన పోస్టేజిస్టాంప్‌లంటించిన స్వంత చిరునామాగల కవరును జతపరచాలి.

**చిరునామా :** సంపాదకులు, చతుర / విపుల, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్ - 500082 ఈ మెయిల్ : vipula.chatura@eenadu.net
vipula.chatura@gmail.com









# మనసున ఉన్నదీ...

★ 'చిలుకలు వాలిన చెట్టు' నవల శీర్షికకు తగినట్లుగా ఉంది. అపురూపలాంటి అమ్మాయిలకు అవగాహన లోపించడం వల్ల జీవితం ఎన్ని మలుపులు తిరుగుతుందో రచయిత్రి బాగా చిత్రించారు. భార్య తప్పును మన్నించి స్వీకరించడంలో రాజారామమోహనరావు వ్యక్తిత్వం ఎంత ఉన్నతమో తెలుస్తుంది. మిసిమి, రాహుల్‌ను సహజంగా కలపడం రచయిత్రి చతురతకు నిదర్శనం. వైవాహిక జీవితంలో తప్పటడుగు వేసినా రాఘవ చివరికి రాధను పెళ్లిచేసుకోవాలని నిర్ణయించడం సరైనదే. నేటి యువతరం చదవాల్సిన నవల ఇది. 'అక్షరం', 'కొత్తగాలి' జీవిత సత్యాలను విశదపరుస్తున్నాయి. 'మతిమరుపుకు మందులేదా' కథనం, 'చతుర ప్ర.జ.', 'నవలావలోకనం' బాగున్నాయి. 'అనుక్షణం గిరిజన పక్షం' మహాశ్వేతాదేవిగారి గురించి రాయడం మరీ నచ్చింది.

– *ఎస్. లీలాప్రసూనాదేవి,*
*వెస్ట్ వెంకటాపురం, సికింద్రాబాద్*

★ వాలి హిరణ్మయీదేవి కలం నుంచి జాలువారిన 'చిలుకలు వాలిన చెట్టు' నవల ఆసక్తికరంగా, తెలుగుదనం ఉట్టిపడుతూ, నిజ జీవితంలో సంఘటనలు గుర్తుచేస్తూ ఆనందాన్నిచ్చింది. విదేశీ బతుకుల బండారం, పల్లెటూరి జీవనయానం, ఇంట్లో పెద్దలు ఒన గూర్చే సౌఖ్యం.. ఇలా అనేక విషయాలు అన్ని వయసులవారినీ ఆనందింపజేస్తాయి. ఒకటికి రెండుసార్లు చదివింపజేస్తుంది.

– *పక్కి శ్రీదేవి,*
*గంట్యాడ, విజయనగరం జిల్లా*

★ 'చిలుకలు వాలిన చెట్టు' నవల విభిన్న వ్యక్తిత్వాలను స్పృశించింది. ఇష్టంలేని పెళ్లి చేసుకున్న అపురూప సినిమా మోజులో ఇల్లు విడిచి వెళ్లి మోస పోయి రాబర్ట్‌తో సహజీవనం చేయడం.. వంటి సంఘటనలతో ఆసాంతం చదివించింది. విశాల్, రాధ, రాజారామమోహన రావు, స్వీటీ తదితర పాత్రల మధ్య కథ ఆసక్తిగా సాగింది. 'నవలావలోకనం'లో పరిచయం చేసిన 'రేవు' నవల రజకుల జీవితాలను చక్కగా ప్రతిబింబించింది. 'చతుర కత' అలరించింది.

– *గానుగపెంట నరసింహులు,*
*బద్వేలు, కడప జిల్లా*

★ 'చతుర' నా ప్రాణనేస్తం! సెప్టెంబరు సంచిక కూడా ఎప్పటిలాగానే అందంగా ముస్తాబైంది. ముఖ్యంగా చమత్‌'కారం' శీర్షిక మదిని దోచేస్తోంది. శీర్షికలన్నీ బాగున్నాయి. సంపాదకవర్గం కృషి అభినందనీయం.

– *సముద్రాల సంతోష్‌కుమార్,*
*కొడిమ్యాల, కరీంనగర్ జిల్లా*

★ 'చిలుకలు వాలిన చెట్టు' ఆసక్తికరంగా సాగింది. విశాల్ కష్టాల్ని భరిస్తూ గ్రామీణాభివృద్ధికి పాటుపడటమే కాక తనతోపాటు పది మందిని భాగస్వాముల్ని చేశాడు. ఆదర్శంగా నిలిచాడు. మంచి నవల ఇది.

– *ధవ్వూరి శ్రీధరాచార్యులు,*
*సీతారాంబాగ్, హైదరాబాద్*

★ 'చిలుకలు వాలిన చెట్టు' నవల చక్కటి తెలుగు చలనచిత్రం చూసిన అనుభూతి కలిగించింది. ప్రతి పాత్ర తమ పరిధిలో వ్యవహరిస్తూ, మన చుట్టూ జరిగే సంఘటనల్లా అనిపిస్తూ తృప్తి కలిగించింది.

– *జి. శోభ, తిరుపతి*

★ నవల ఆద్యంతం ఆసక్తిగా చదివించింది. కథనంలో వివిధ రకాల మలుపులను పలు కోణాల్లో చూపించాలనే ప్రయత్నంలో రచయిత్రి కృతకృత్యులయ్యారు. పెద్దకథ 'జేన్' ఆసక్తిగా ఉంది. జి.యస్. చలం నవల 'రేవు'పై సమీక్ష బాగుంది.

– *ముక్కెర రమేశ్‌చంద్ర,*
*గుర్రంపేట, వరంగల్ జిల్లా*

★ నవల ఆసాంతం చక్కని మలుపులతో సాగిన కథాంశం. 'కొత్తగాలి' కవితలు భావపరిణతికి తార్కాణంగా ఉన్నాయి. 'నవలావలోకనం'లో 'రేవు'పై సమీక్ష బాగుంది.

– *అక్కింతల సంజీవశర్మ,* అనంతపురం

సంపుటి -39
సంచిక - 9
465వ సంచిక
పేజీలు : 132
అక్టోబరు 2016

# చతుర



**చి**న్నప్పటి నుంచి ఒకరికొకరు తోడుగా పెరిగారు అతను.. ఆమె! ఓ రోజు అతను హఠాత్తుగా ఊరొదిలి వెళ్తున్నాడని తెలిసిందా మెకి. అంతే.. జీవితం శూన్యమనిపించింది. చెప్పాపెట్టకుండా అలా ఎలా వెళ్తాడో నిలదీద్దామని ఆవేశంగా అతని గదికి వెళ్లింది.

ఆ తర్వాతేం జరిగింది? అసలు అతను ఎందుకు వెళ్లిపోవాలనుకున్నాడు? ఇంతకీ ఆమె అతన్ని ఆపిందా? ఆ తర్వాత ఆమె జీవితం ఏ మలుపు తిరిగింది?

ఆద్యంతం ఆసక్తిగా సాగే **మణి వడ్లమాని** నవల
**జీవితం ఓ ప్రవాహం** పేజీ నెం. *6*



**ప్ర**పంచంలోని ఏ అందమైనా తన సొంతం కావాలనుకుంటాడా చక్రవర్తి. అందుకు ఎంత ఖర్చు పెట్టడానికైనా వెనుకాడడు.. అలాంటి వ్యక్తికి ఓ గ్రామీణ యువతి ఎలా బుద్ధి చెప్పిందో తెలియాలంటే కె. శివసుబ్రమణ్యాం తమిళ కథ **నాగలమ్మ** చదవండి. పేజీ నెం. *80*

**తో**టపని గిట్టని మాచెల్ ఆ రోజు భర్త పోరు తట్టుకోలేక తోటలోకెళ్లింది. అక్కడ క్షణాల్లో ఆమెకో ఆలోచన తట్టింది. వెంటనే ఆచరణలో పెట్టింది. ఇంతకీ ఏంటా ఆలోచన? దాని పరిణామాలేంటి?

ఉత్కంఠగా సాగే **రేమండ్ మాసన్** అమెరికా కథ **అభిమాని** పేజీ నెం. *98*

★ ముఖచిత్రం: దేవర్ష్ కార్తీక్ ★ రెండో కవరు : వారెవ్వా! ★ పుస్తకాలంకరణ : రాజు యాట

e-mail: vipula.chatura@eenadu.net /
vipula.chatura@gmail.com
Toll Free No: 18004258888 (Hyd)

వృత్తి లాయర్! ప్రవృత్తి రంగస్థల నటన!

సమయమంతా న్యాయస్థానంలోనో, నాటకాల పేరుతోనో ఊళ్లు తిరగడంలోనో గడిపేసే ఆయనకి ఓ ముద్దుల కూతురు! అపరంజి బొమ్మ!!

ఆమె పెళ్లి గురించి పట్టించుకోడు సదరు తండ్రిగారు. భార్య ఎంత పోరినా ఖాతరు చేయడు. పైగా చిన్నప్పుడెప్పుడో ఇంట్లో తెచ్చి పెట్టుకున్న బంధువుల కుర్రాడితో తన కూతురు చనువుగా ఉన్నా, లక్ష్యపెట్టడు..

ఈ పరిస్థితుల్లో వారి కథ ఏ కంచికి చేరింది?

అక్షరాక్షరం ఉత్కంఠ రేపే నవల **జీవితం ఓ ప్రవాహం**

చతుర దసరా కానుక!



జీవితమనే పుస్తకంలో ప్రతి పేజీకి ఒక్కో కథ.. ఒక్కో అనుభవం ఉంటాయి! అది ప్రేమకి సంబంధించింది కూడా కావచ్చు! ఆ అనుభవాల్ని గొప్పగా, గాఢంగా తీసుకోవడంలోనే నిజాయితీ ఉంటుంది.

'ప్రేమ' అనే రెండక్షరాల గురించి బోలెడు నిర్వచనాలు ఎంతో మంది చెప్పారు, చెబుతున్నారు కూడా. ప్రేమ ఫలానప్పుడే కలగాలని ఒక నిర్దిష్ట సమయ నియమమేమీ లేదు.

ఇందులో ఫలించిన ప్రేమలు ఎన్ని ఉన్నాయో, ఫలించనివి కూడా అదే నిష్పత్తిలో ఉన్నాయి. ప్రేమించడం ఒక ఎత్తు. ఆ ప్రేమను ప్రకటించడం మరో ఎత్తు.

కారణాలు ఏవైనా కావచ్చు! కొన్ని ప్రేమలు గుండెలో ఉండిపోతాయి. కొన్ని ప్రేమలు అన్నింటికంటే అతీతంగా ఉంటాయి. వాళ్ళు ఎప్పటికీ కలుసుకోకపోవచ్చు! కానీ వాళ్ళ మధ్య ఉన్న ప్రేమ మటుకు కాలాలతో, రుతువులతో ప్రమేయం లేని జీవనదిలా సాగిపోతూనే ఉంటుంది.

## శ్రీరామ్

సుమారు ఇరవయ్యేళ్ళ తరువాత రాజమండ్రిలో కాలుపెడుతున్నాను. ఆనందంతో నా గుండె వేగంగా కొట్టుకుంటోంది!

ఈ ఊరిమీద ఇంత మమకారం పెంచుకోవడానికి కారణం.. ఊరుతో పాటు ఓ మనిషి మీద పెంచుకున్న అభిమానం, ఆత్మీయత, అనుబంధం! ఆ బంధాలే నన్ను ఇక్కడకు వచ్చేలా చేశాయి.

ఆ ఆత్మీయత వెనక నా జీవితం ఉంది!

అస్సలు ఎప్పటికీ ఈ ఊరు రాలేనేమో అనుకున్నాను. అందుకు కారణం లేకపోలేదు. నేను అప్పట్లో తీసుకున్న నిర్ణయం అటువంటిది.

కానీ కాలం చిత్రమైంది! కొన్నిసార్లు పరిస్థితుల ప్రభావం వల్ల తీసుకున్న కఠోర నిర్ణయాల్ని సైతం మార్చేసే శక్తి దానికి ఉంది. అందుకే నా ఈ ప్రయాణం.

ఈ ఊరిని తలచుకుంటేనే నాలో ఏదో ఓ వైబ్రేషన్. అసలు ఆ ఫీలింగ్ కొవ్వూరు నుంచే మొదలయింది.

తల్లులు తమ పిల్లలను మాత్రమే పెంచుతారు. కానీ ఈ నదీమతల్లి మాత్రం భేదభావం లేకుండా తాను ప్రవహిస్తూ అక్కడున్న జీవజాలాన్ని అంతటినీ రక్షిస్తూ ఉంటుంది.

అందుకే అందరూ 'తల్లి గోదావరి' అంటూ అమ్మతో పోల్చి చెబుతారు. అలాంటి ఆ అమ్మకి ఇక్కడి నుండే నమస్కారం చేసుకున్నాను.

ఈ జీవనదీ ప్రవాహం అన్నిటినీ తనలో కలుపుకుంటూ, సుడిగుండాలు, ఆటుపోట్లను తట్టుకుంటూ, తరంగిణిలా సాగిపోయినట్టే, జీవితం కూడా అంతేకదా! ఎన్నో మలుపులు తిరుగుతూ, ఒడిదొడుకులను అధిగమిస్తూ సాగిపోవడం దాని లక్షణం!

ట్రైన్ బ్రిడ్జి మీదకి రాగానే ధనాధనా శబ్దం వినడం అదో వింత అనుభూతి.

ఇంకా చీకటి తెరలు తొలగలేదేమో విద్యుత్ దీపకాంతులతో గోదారమ్మ మెరిసిపోతోంది.

వెంటనే 'రమ్య గౌతమీ జలాల్లో /కొన్ని వేల విద్యుద్దీపాల కాంతుల ప్రతిబింబాలతో /ఎంత అందంగా ఉంది..' తిలక్ కవిత గుర్తుకొచ్చింది.

ట్రైన్ రాజమండ్రి మెయిన్ స్టేషన్‌లో ఆగింది. నెమ్మదిగా దిగి పరిసరాలను చూస్తున్నాను. నా కోసం కృష్ణ స్టేషన్‌కి వస్తానని అన్నాడు.

డిసెంబరు నెల.. మార్గశిర మాసం.. చలి మొదలయింది.

పొద్దున్నే సూర్యుడు బద్ధకంగా మంచు దుప్పటి తీద్దామా! వద్దా! అనే మీమాంసతో తొంగి చూస్తున్నాడు. ఆ చిరు చలిని

ఆస్వాదిస్తూ నించున్నాను.

ఊరు కొత్త ముస్తాబుతో అందంగా ఉంది. స్టేషన్‌కి మెట్రో లుక్ వచ్చింది. మార్పు కొట్టొచ్చినట్లు కనిపిస్తోంది.

'మా ఊరు' అన్న గర్వంతో నా ఛాతీ ఉప్పొంగింది.

ఇంతలో ఒక పిల్ల తెమ్మెర సంపెంగ సౌరభాన్ని మోసుకొచ్చింది.

ఎవరో పక్కనుంచి నడుచుకుంటూ వెళు తున్నారు. ఆమె జడలో సంపెంగలు.

ఒక్క క్షణం ఆ పరిమళాన్ని ఆస్వాదిస్తూ మైమర్చిపోయాను. ఎన్నేళ్ళ తరువాత, సంపెంగ పూల పరిమళం నన్ను చుట్టడం, అదీ ఈ నేల మీద కాలుపెట్టగానే రియల్లీ వెరీ నోస్టాల్జిక్!

కృష్ణ కోసం అటూ ఇటూ చూస్తు న్నాను. కృష్ణ, బలరాం, నేను ఇరవయ్యేళ్ళ క్రితం ముగ్గురం ఒక జట్టు. అందరూ మమ్మల్ని త్రిమూర్తులు అని పిలిచేవారు.

కొన్నిపరిస్థితుల వల్ల నేను ఈ ఊరుని విడిచి వెళ్ళాల్సి వచ్చింది. ఇరవయ్యేళ్ళ ఎడ బాటు మా స్నేహంలో ఏ మార్పూ తేలే దని, కృష్ణ ఫోన్చేసినప్పుడు అర్థమయింది.

అసలు అన్నేళ్ళుగా మనసుని ఈ ఊరి వైపు మళ్ళకుండా కట్టడి చేసుకున్న నాకు, ఆ రోజున ఎందుకో వాళ్ళని కలవాలి.. మాట్లాడాలి.. అని పదే పదే అనిపించడం, అదే సమయంలో కృష్ణ, బలరాం నేను అమెరికాలో ఉంటున్నానని తెలుసుకొని ఫోన్ చేయడం నిజంగా అద్భుతం. అది అనుకోకుండా జరిగిన సంఘటన కావచ్చు.

కానీ ఆ దశలో నాకది అద్భుతంగా అని పించింది. మనసుకు ఏదో దివ్య శక్తి ఉందనే అనిపించింది. దాన్నే 'టెలీపతి' అంటారేమో!

ఆ రోజు నుంచి ఈ క్షణం వరకు, ఈ ఇరవయ్యేళ్ల సంగతులన్నీ చిన్నపిల్లల్లా మాట్లాడుకుంటూ, మేం కలిసే రోజు ఎప్పు డొస్తుందా? అని కౌంట్‌డౌన్ చేయసా గాను. ప్రతి క్షణం అదే ఆలోచన.

అంతకంటే ముఖ్యమైంది నేను ఎవరి కోసం ఈ ఊరు నుంచి వెళ్ళిపోయానో, తనకు కూడా నన్ను కలవాలని ఉందని వాళ్ళు ఇద్దరూ చెప్పడం నాకు మరీ ఆనం దంగా ఉంది.

కాకపోతే నా రాకను సర్‌ప్రైజ్‌గా ఉం చుదామని అనుకున్నాం. ఇన్నేళ్ళ తరు వాత నన్ను చూసినప్పుడు తన కళ్ళలో కనిపించే ఆనందానికి సాక్షినవ్వాలన్న స్వా ర్థం! అందుకే తహతహలాడుతున్నాను.

ఊరికి, ఊరి మనుషులకి దూరంగా వెళ్ళిపోయినా, వీళ్లంతా నా ఆలోచనల్లో, జ్ఞాపకాల్లో ఎప్పుడూ నాతోనే, నా దగ్గరే ఉండేవారు.

ఆనాడు గడిపిన రోజులు తలచుకుంటే ఆనందం లాంటి విచారం. అవి ఇప్పటికీ మరపురాని బంగారు క్షణాలు.

అన్నిటికంటే ముందు నేను ఆమెని కల వాలి. ఆమె ఇచ్చిన స్ఫూర్తి నా జీవితాన్ని ఎలా మార్చిందో చెప్పాలి.

తను వెలిగించిన దీపపు వెలుగుల కాంతిని ఆమె కళ్ళలో నేను చూడాలి.

ఇక్కడికి వచ్చేముందు ఒక కల వచ్చింది. కొండలూ, కోనలు, నదులూ దాటి ఎక్కడికో వెళ్తున్నాను, దృశ్యాదృ శ్యంగా ఉన్న ఆమెని చూసే లోపలే మాయమయిపోయింది. బహుశా ఆమె గురించిన ఆలోచనలతో నా మనసు నిండి పోవడంతో ఆ కల వచ్చిందో? ఏమో? తెలియదు.

★ ★ ★

"హలో శ్రీరామ్! నించొనే కలలు కంటు న్నావా?" అన్న పిలుపుతో వెనక్కి తిరి గాను. కృష్ణ! ఎవరో పెద్దవాడిలా క న్పిస్తున్నాడు. బాగా ఒళ్ళు వచ్చింది.

"ఒరేయ్ శ్రీరామ్! అబ్బ ఇరవయ్యేళ్ళు గడిచిపోయాయి. కానీ నాకు అలా అని పించటం లేదు. నిన్నో, మొన్నో కలిసిన

ట్లుంది. నువ్వు పెద్దగా మారలేదు. అలాగే ఉన్నావు. చూశావా నా సైజు ఎలా మారిపోయిందో" అని తన మీద తనే జోకేసుకున్నాడు.

వాడి ఫొటో గనక చూడకుండా ఉంటే గుర్తుపట్టడం కష్టం అయ్యి ఉండేది. వయసు తెచ్చిన మార్పు కనిపిస్తోంది.

"కృష్ణా! ఎలా ఉన్నావు? " అంటూ చెయ్యి కలపబోతే-

"ఏరా! బార్ ఎన్నాళ్ళయిందిరా" అంటూ దగ్గరగా వచ్చి గట్టిగా కౌగిలించుకున్నాడు.

అప్పట్లో బావగారుని షార్ట్ చేసి 'బార్' అని సరదాగా పిలుస్తుండేవాళ్లం!

నేనేదో గొప్పగా షేక్‌హ్యాండ్ ఇవ్వబోతే వాడు ఆత్మీయంగా కౌగిలించుకోవడంతో మా స్నేహబంధం మళ్ళీ దగ్గరయినట్లుగా అనిపించింది నాకు.

"అవునూ! బలరాం ఏడి? " అని చుట్టూ చూస్తూ అన్నాను.

"అయ్యో! నిన్ను చూసిన ఆనందంలో మర్చిపోయాను. అనుకోకుండా వాడు, ఉష బెంగళూరులో మెడికల్ కాన్ఫరెన్స్‌కి వెళ్ళాల్సి వచ్చింది"

ఇద్దరం కుశల ప్రశ్నలు వేసుకున్నాక, స్టేషన్‌లోనే నీళ్ళలాంటి ఆ కాఫీని తాగి బయటకు వచ్చాం. షార్లెట్‌లో అలా ఫ్లైట్ టేకాఫ్ అయిందగ్గర్నించీ ఈ ట్రిప్ మొత్తం మా ఊరి ఫ్లేవర్‌ని ఎంజాయ్ చెయ్యాలని అనుకున్నాను. సో మొదట స్టేషన్‌లో దొరికే ఆ నీళ్ళ కాఫీతో మొదలు పెట్టాను. తెచ్చుకున్నవి ట్రాలీ బాగ్‌లే కాబట్టి లాక్కుంటూ బయటకు వచ్చాం.

వాడిని వచ్చేదారిలో చాలామంది పలకరిస్తున్నారు. ఫోన్ల సంగతి చెప్పక్కరలేదు.

నా ఆశ్చర్యం గమనించి కృష్ణ "ఏం లేదురా! ఇప్పుడు మొత్తం బిజినెస్ నేనే చూస్తున్నా కదా! అలా ఎవరో ఒకరు తెల్లవారింది మొదలు చేస్తూనే ఉంటారు" అంటూ కారు దగ్గరకి తీసుకొని వెళ్ళాడు.

కారుని చూస్తూ "చాలా బావుందిరా నీ కారు" అని అన్నాను.

"కొత్తదే! నెలయింది కొని.. అయినా నీ కార్లకంటేనా? " అంటూ "పద పద కూర్చో! నువ్వు ఇంటికి వెళ్ళి ఫ్రెష్ అవుదువుగాని" అని అన్నాడు.

స్టేషన్ నుంచి బయటకు వచ్చి కొంచెం ముందుకు వెళ్ళాక "అవున్రా మర్చిపోయాను బలరాం ఈ గ్రీటింగ్ కార్డు నీకిమ్మన్నాడు" అన్నాడు.

కార్డ్ ఓపెన్ చేసి చూశాను. అందులో 'వెల్‌కమ్! బడ్డీ ఇట్ ప్లీజెస్ మి సో మచ్ టు సీ యు! లైఫ్ ఈజ్ లైక్ ఎ సాంగ్, నౌ దట్ యు ఆర్ బ్యాక్ వేర్ యు బిలాంగ్' అని రాశాడు.

"నువ్వు వచ్చావు నా కోసం.. బలరాం చక్కటి మెసేజ్ ఇచ్చాడు. మనసంతా సంతోషంతో నిండిపోయింది. ఇన్నిరోజుల తరువాత కూడా మీరు, మీ స్నేహం ఏం మారలేదురా! అన్నాను" కొంచెం ఎమోషనల్ అవుతూ.

వాడు దానికి ఏం సమాధానం చెప్పలేదు కానీ మ్యూజిక్ ప్లేయర్ ఆన్ చేశాడు. అందులోంచి 'ఎగరేసిన గాలిపటాలు.. చిన్ననాటి ఆనవాళ్ళు.. స్నేహంలో మైలురాళ్ళు' పీబీఎస్ గొంతులో ఎంతో మధురంగా వినిపించింది. అది వింటూ ఇద్దరం కూడా ఎమోషనల్ అయ్యాం.

కొద్దిసేపయ్యాక వాడు కళ్ళు తుడుచుకుంటూ "ఒరేయ్! నేను మాటలలో చెప్పలేకపోయానురా. అందుకే ఈ పాటని నీ కోసం ప్లే చేశాను" అన్నాడు.

ఆ మాటలకి ఆప్యాయంగా వాడి భుజం తట్టి "బలరాం ప్రాక్టీస్ ఎలా ఉందిరా? తన వైఫ్ ఉష కూడా డాక్టరే కదా? " అడిగాను.

"ఆఁ! అవును. బావుందిరా, వాడి హస్తవాసి అంటే ఈ చుట్టుపక్కల అందరికీ

చాలా నమ్మకం రా! ఉషకి కూడా మంచి పేరు. పెద్ద నర్సింగ్ హోం కట్టాడురా శ్యామలానగర్‌లో. అంతేకాదు వాళ్ళు పేద వాళ్ళకి నెలలో రెండుసార్లు ఉచిత హెల్త్ క్యాంప్స్ పెడుతూంటారు చుట్టుపక్కల ఊళ్ళలో. గోదావరిలో ఉన్న లంక గ్రామాలకి కూడా వెళుతుంటారు. నిజంగా వాడు చేసే పని గురించి యెంత చెప్పినా తక్కువే" అన్నాడు కృష్ణ.

"నిజంగానే అలాంటి వాడు మన స్నేహితుడైనందుకు గర్వించాలి. కష్టపడి పైకొచ్చాడు" అంటూ "అరేయ్ కృష్ణా! ఇక్కడ ఇదివరకు మూడు సినిమా హాల్స్ ఉండేవి కదా" అన్నాను.

"అవునురా! అక్కడ అంతా ఘాట్స్ కట్టారు. నీకు గుర్తుంది కదా రైలు కమ్ రోడ్ బ్రిడ్జి మొదలయే చోట అంతా పిచ్చి మొక్కలతో వేస్ట్ ల్యాండ్‌లా ఉండేది. ఇప్పుడు దాన్నంతా టూరిస్ట్ అట్రాక్షన్ చేశారు. ఇస్కాన్ టెంపుల్, ఇంకా కొన్ని గుళ్ళు వచ్చాయి. గోదావరి బండ్ మీద కూడా పార్కులు వచ్చాయి" అన్నాడు.

"అరె కృష్ణా! నీకు గుర్తుందా? మనం కార్తీకమాసంలో గార్డెన్ పార్టీ చేసుకునే వాళ్ళం. అప్పుడు ఓసారి ధవళేశ్వరం బ్యారేజి చూడటానికి వెళ్ళినప్పుడు ఇసుక మేటలు వేసింది. ఫర్వాలేదని గోదావరి మధ్యలోకి వెళ్ళి స్నానాలు చేస్తుంటే అక్కడ చేపలు పట్టుకునేవాళ్ళు వచ్చి- 'మధ్యలో ఊబిలు ఉంటాయి తెలీకుండా లాగేస్తాయి. ఇక్కడ నుంచి వెళ్ళిపోండి' అని గట్టిగా కేకలేస్తే మనం పరుగో పరుగు! ఆ హడావుడిలో నీ షర్ట్ మర్చిపోయావు. మళ్ళీ వెళ్ళి తెచ్చుకోడం.. ఇప్పటికీ అదంతా కళ్ళకి కట్టినట్లుగా ఉందిరా"

"నీకు భలే గుర్తుందిరా ఆ విషయం. కానీ ఇప్పుడు అవన్నీ తక్కువయ్యాయి రా! నిజం చెప్పాలంటే అప్పుడు మనం స్వేచ్ఛా విహంగాల్లా ఉండే వాళ్ళం. కానీ, ఇప్పటి పిల్లలకి చదువు.. చదువు.. అంటూ

> ## కొత్తగాలి...
>
> **ముళ్ళున్నా గులాబీని ప్రేమిస్తున్నాం!**
> **చేదున్నా ఔషధాన్ని సేవిస్తున్నాం!**
> **మరి కష్టాలున్నాయని**
> **జీవితాన్ని ఎందుకు త్యజించాలి?**
>
> – ముదిగొండ అరుణరేఖ,
> ఎల్. బి. నగర్, హైదరాబాద్

రెక్కలు కత్తిరించి బంధించి ఉంచుతున్నాం. ఫిజికల్ ఏక్టివిటీ లేదు. ఎంత సేపు వీడియోగేమ్స్ లేదా కంప్యూటర్, మొబైల్ ఫోన్.. వీటితోనే వాళ్ళకి ఎంటర్‌టెయిన్‌మెంట్. అందుకే వాళ్ళలో డిప్రెషన్, అసహనం పెరిగిపోతున్నాయి"

"అవునురా! నిజం!"

"అయినా, ఇప్పుడు మన ఊరు అంతా మారిపోయింది. రా నువ్వే చూస్తావుగా తినబోతూ రుచెందుకు"

మనస్సులో ఎక్కడో కలుక్కుమంది. అవును మార్పు సహజం. అది కాలధర్మం! కానదడానికి నేనెవరిని? అయినా మనస్సు ఒప్పుకోలేకపోతోంది. ఈ ఆలోచనల్లో పడి కారు ఏ పక్క నుండి వెళుతోందో అర్థం కావటం లేదు. కారు ఎక్కినప్పటి నుండి కూడా వాడికి ఫోన్ల మీద ఫోన్లు! బ్లూటూత్‌లో వరుసగా మాట్లాడుతూనే ఉన్నాడు. నా మనసు తొందరపడుతోంది, వచ్చి ఇంత సేపయింది తన గురించి అడగాలని. కానీ వాడికా ధ్యాసే లేనట్లుంది.

ఫోన్ మాట్లాడటం అయింది.

అప్పటికీ వచ్చే ముందే చెప్పాను నేనొస్తున్న కారణమేంటో? అయినా అది తప్ప అన్నీ మాట్లాడుతున్నాడు.

"ఏంటిరా కృష్ణా! ఇంతసేపయినా తన గురించి ఒక్కమాట కూడా చెప్పడం లేదు.

తన గురించి వినాలని ఉంది. ఏంటి పిచ్చిగా అనిపిస్తోందా నీకు? లేకపోతే అమెరికాలో ఉంటున్నావు.. ఈ సెంటి మెంట్లు, ఎమోషన్లు ఏంటా అనుకుంటు న్నావా? నీకు ఓ సంగతి తెలుసా? వాళ్ళు మనకంటే ఎమోషనల్‌గా ఉంటారు. సెంటిమెంట్లు కూడా బాగానే ఉంటాయి. వాళ్ళ జీవితాల్ని దగ్గర్నుంచి గమనించేవా ళ్ళకు తెలుస్తాయి. అందరూ హృదయ మున్న మనుషులేరా"

"అరేయ్ శ్రీరామ్! నీ ఆత్రుత నాకు బాగా తెలుసు. అది అర్థం చేసుకోగలను. కానీ మనం సర్‌ప్రైజ్ చేద్దామనుకున్నాం కదా! తను బానే ఉందిరా" నెమ్మదిగా అన్నాడు కృష్ణ.

"నీకు తెలుసు కదా! ఇన్ని రోజుల తరు వాత తనని చూడబోతున్నానని, ఇన్నేళ్ళ యినా తనను మరచిపోలేదని. అదికాక ఇంతవరకు నేను గడిపిన నా జీవనప్ర యాణం తాలూకు అనుభవాల్ని తనతో పంచుకోవాలని తపించిపోతున్నానురా? మీ ఇంటికి దగ్గరేనా తన ఇల్లు? వెంటనే వెళ్ళి చూసొద్దాం, ఓకేనా!"

"అంత వెంటనే అయితే బాగోదు. ఇల్లు, సంసారం తాపత్రయాలు ఉంటాయి కదరా! పెళ్ళయిన ఆడవాళ్ళకి"

"అంటే మామూలు హౌస్‌వైఫ్‌లా మారి పోయిందా? గౌతమి హస్బెండ్ ఎలాంటి వాడు? సరదాగా ఉంటాడా? మనతో మాట్లాడ్నిస్తాడా గౌతమిని? తను అలానే వుందా? మారిందా? "

"అయ్యబాబోయ్! నీ ప్రశ్నల పరంపర తట్టుకోలేకపోతున్నాను. ముందు మా ఇంటికి వెళ్దాం. అప్పుడు అన్నీ తీరికగా మాట్లాడుకుందాం సరేనా" అని నవ్వుతూ అన్నాడు.

చేసేదేంలేక "ఊ" అన్నాను.

మౌనంగా ఉండిపోయాం.

ఒక్కటి మాత్రం కనిపెట్టాను. వాడు పెద్ద ఇంటరెస్టింగ్‌గా లేడు, గౌతమి గురించి మాట్లాడటానికి. లేదా వాడు రెగ్యులర్‌గా టచ్‌లో ఉంటాడు కాబట్టి నాకున్న ఉత్సాహం వాడికి లేకపోవచ్చు ఎస్ అదే కారణమయి ఉంటుంది.

ఊరు మారింది కానీ రోడ్లు మటుకు పెద్దగా మారలేదు. గతుకులు, ఎగుడు దిగుళ్ళు అలానే ఉన్నాయి. అదేమాట అన్నాను వాడితో.

"అవును! స్టేషన్ నుంచి బయటకు వ చ్చాక ఓ బ్రిడ్జ్ వస్తుంది గుర్తుంది కదా!"

"ఆc! గుర్తుంది. రైలు కమ్ రోడ్ బ్రిడ్జి"

"ఆc! అదే! అక్కడ నాలుగు చినుకులు పడినా సరే నీళ్ళు నిలిచిపోతాయి. కింద టి వారమంతా కుండపోత వానలు, తుఫా ను మూలంగా ఓ పెద్ద చెరువే అక్కడ"

మళ్ళీ తిలక్ టప్‌మని బయటకు వచ్చి 'ఎగుడు, దిగుడు.. పెళ్ళాం, మొగుడు, వాళ్ళకి ప్రణయం.. మనకే ప్రళయం' అన్నాడు.

"ఏంటో ఈ నేల మహత్యం కాబోలు! నన్ను పక్కకి నెట్టి లోపల ఉన్న చలం, తిలక్ టప్, టప్‌మని బయటకు వచ్చేస్తు న్నారు" అన్నాను.

"ఏంటిరోయ్! ఇంకా కవిత్వం మీద మోజు తగ్గలేదా? ఇంకా పుస్తకాలు చదు వుతున్నావా? " అన్నాడు.

"నువ్వు బిజినెస్ చేస్తూ బాగా రాటుతేలి పోయావురా! కొంచెం కూడా భావుకత్వం లేకపోతే ఎలా? "

"అరె బార్! ఏదో మామూలు వాళ్ళం! మాది అంతా లోకల్ భాష బాబూ! ఏదో కట్టే కొట్టే అన్నట్లు మాట్లాడతాం. మేం మీలా భావుకులం కాదమ్మా!" అని ధర్మవ రపు స్టైల్లో అన్నాడు.

వాడి మాటలకు నవ్వుకుంటూ "శాంతి ఎలా ఉంది? " అన్నాను.

"అప్పుడు బయట సైకిల్ తొక్కితే, ఇప్పుడు ఇంట్లో తొక్కుతోంది" అన్నాడు.

## విడాకులు..!

చతుర సమగతుల

ప్రతీ సమాజంలో పెళ్ళికి ప్రాధాన్యత ఉంది. పెళ్ళి ఉన్నచోట విడాకులు ఉంటాయి. విడాకులకి సంబంధించిన విశేషాలు.

★ ప్రపంచంలో ప్రతీ పది నుండి పదమూడు క్షణాలకి ఒకరు విడాకులు తీసుకుంటున్నారు. అమెరికాలో ప్రతి 36 క్షణాలకి ఓ జంట విడాకులు తీసుకుంటోంది.



★ విడాకులు తీసుకున్నాక యాభై శాతం స్త్రీలు, ముప్పైమూడు శాతం పురుషులు మాజీ భాగస్వామి మీద సగటున పదేళ్ళపాటు కోపంగా ఉంటారు.

★ విడాకులు తీసుకున్న పురుషులకంటే స్త్రీలకి కొత్త సంబంధం ఏర్పరచుకోవడం కష్టమవుతోంది.

★ వివాహేతర సంబంధాలు సగటున మూడేళ్ళు కొనసాగుతాయి. ఇరవైమూడు శాతం విడాకులకి కారణం ఈ సంబంధాలే.

★ అక్రమ సంబంధం వల్ల విడాకులు తీసుకున్న వారిలో ఎనభై శాతం మంది తర్వాత అందుకు చింతిస్తారు.

★ వివాహేతర సంబంధం పెట్టుకున్న వారిని విడాకుల అనంతరం పెళ్ళి చేసుకుంటే, అమెరికాలో వాటిలో డెబ్బై ఐదు శాతం విఫలమౌతున్నాయి.

★ భర్త కంటే భార్య వయసు ఎక్కువైతే విడాకుల అవకాశాలెక్కువ.

★ అమెరికాలో విడాకులు అధికంగా తీసుకునే మొదటి మూడు రాష్ట్రాలు నెవెడా, మెయిన్, ఓక్లహామా.

★ అమెరికాలో నలభైఒక్క శాతం పెళ్ళిళ్ళు విడాకులతో అంతమవుతున్నాయి.

★ మొదటి పెళ్ళిళ్ళు డెబ్బైమూడు శాతం, పునర్వివాహాల్లో అరవై శాతం విడాకులతో అంతమవుతున్నాయి.

★ బీద దేశాల్లో కంటే అభివృద్ధి చెందిన దేశాల్లో విడాకుల శాతం ఎక్కువ!

"ఉండు ఇప్పుడే ఫోన్ చేసి చెబుతాను! శాంతి మీద సెటైర్లు వేస్తున్నావని! అప్పుడింక నిన్ను ఇంట్లోకి రానీవ్వదు చూసుకో!"

ఆ మాటలకి పెద్దగా నవ్వాడు కృష్ణ.

"అయినా నువ్వే పెద్ద సేర్‌లా ఉన్నావు. పైగా తనని కామెంట్ చేస్తున్నావా? " అని ఉడికించాను బయటకు చూస్తూ.

"మనం ఇప్పుడు ఏ ఏరియాలోంచి వెళుతున్నాం? " అని అడిగాను.

"ఒరేయ్! మనం ప్రకాష్‌నగర్ పార్కు దాటి ముందుకు వచ్చాం" అన్నాడు.

"అయితే ఇప్పుడు మీ ఇల్లు దానవాయిపేటలో లేదా? " అని అడిగా ఆశ్చర్యంగా.

"లేదు లేదు! మేం ఇప్పుడు.. ఎ.వి. రోడ్ గుర్తుంది కదా! దానికి పేరలల్‌గా ఉన్న రోడ్.. అక్కడ పెద్ద సాయిబాబా గుడి ఉంది. అది దాటాక అక్కడ కొత్త కాలనీలు వచ్చాయి. మేం విద్యుత్ కాలనీలో ఉంటున్నాం. నీకు ఓసారి ఊరు చూపించుదామని ఈ రూట్‌లో తీసుకొచ్చాను" అన్నాడు.

కారు ఇంటి ముందు ఆగింది. దిగి చుట్టూ చూశాను. కొత్తగా ఉన్నాయి ఇళ్ళు. అన్నీ ఒక క్రమపద్ధతిలో కట్టినట్లుగా ఉన్నాయి. వీళ్ళది రెండంతస్తుల మేడ. ఇంటిముందు మొక్కలు, ఒక పక్క లాన్. అందులో ఉయ్యాల చాలా బావుంది.

అదే అన్నాను వాడితో.

లోపలికి వెళ్ళాక కృష్ణ తన భార్య శాంతిని పిలిచాడు. లోపల నుంచి వచ్చిన

శాంతిని చూస్తూనే చిన్నప్పుడు చూసిన మొహం! కొంచెం పొట్టిగా, బొద్దుగా ఉన్నా, ఎప్పుడూ నవ్వుతూ కళకళలాడుతూ ఉండేది. ఆమెలో అదే స్నేహం కనిపించింది. తను కూడా పెద్దగా మారలేదు.

"గుర్తుపట్టావా ఎవరో? " అని నన్ను చూపిస్తూ అడిగాడు కృష్ణ.

తను నవ్వుతూ "బాగున్నారా? శ్రీరామ్!" అని నన్ను పలకరించి, "తనేమి నీలా మారిపోలేదు. అప్పుడెలా ఉన్నాడో ఇప్పుడు కూడా అలానే ఉన్నాడు" ఓ సెటైర్ విసిరింది.

"హతవిధీ! నా మీదకు మళ్ళిందా నీ దృష్టి? తల్లీ! నీకో నమస్కారం! నాకు, వాడికి మంచి కాఫీ తెచ్చిపెట్టు" అన్నాడు.

లోపలికి వెళ్ళి పొగలు కక్కుతున్న కాఫీ కప్ నా చేతికి ఇస్తూ "శ్రీరామ్! పది రోజులనుంచి కృష్ణ, మీ గురించి తెగ కలవరిస్తున్నాడు" అంది.

"అంటే? ఓ పది రోజులనుంచి మనోడు మిమ్మల్ని ఇబ్బంది పెడుతున్నాడు నామూలంగా కదా!" అన్నాను.

"అబ్బే! అదేం లేదు. మాకు కూడా సరదాగా ఉంది. అయినా మీరు మాకు కొత్తేమీకాదు. మనం చిన్నప్పుడు చాలాసార్లు కలుసుకున్నాం కదా!"

"సరేలే ఇప్పుడే వచ్చాడు, వాణ్ణి ప్రశ్నలు వేసి భయపెట్టేయకు. ఇంకా పదిరోజులు ఉండాలి. పాపం! వాడు అసలే ప్రయాణం చేసి వచ్చాడు కూడాను" అని శాంతి వైపు తీక్షణంగా చూశాడు.

పాపం శాంతి మొహం చిన్నబోయింది ఆ మాటలకి.

"రేయ్! నేనేం అలసిపోలేదు. చూడమ్మా! నీ కమ్మటి తెలుగు మాటలు వింటుంటే హాయిగా ఉంది. వాడి మాటలేం పట్టించుకోకు"

"అలాగే శ్రీరాం! అయిందా మీ పని? " అని విప్పారిన మొహంతో నవ్వుకుంటూ వెళ్ళిపోయింది.

"సరిపోయింది! మీరిద్దరూ ఒకటైపోయారా! కానీండి! ఏం చేస్తాం? " అంటూ, నన్ను కాసేపు విశ్రాంతి తీసుకోమని, వాడు అక్కడనుండి వెళ్ళిపోయాడు. నిజం చెప్పద్దూ! నాక్కూడా కొంచెంసేపు ఒంటరిగా ఉండాలని ఉంది. ఇరవై ఏళ్ళక్రితం ఈ ఊరిని, మనుషులను అందరినీ వదిలి వెళ్ళిపోతున్నప్పుడు మనసులో ఎంత ఏడ్చానో ఆ దేవుడికి తెలుసు. నా కన్నీరును తనలో కలుపుకున్న గోదారికి తెలుసు. ఇండియాలో అన్నిచోట్లా లైఫ్‌స్టయిల్ మారిపోయిందని అక్కడివాళ్ళు అనుకుంటున్నారు.

ఏవిటో అనుకున్నాను. కానీ నిజమే అనిపిస్తోంది ఇక్కడకు వచ్చాక. ఏదో పెద్ద పెద్ద సిటీల్లోనే అనుకున్నా, కానీ ఇక్కడ కూడా ఇంత మార్పు ఉంటుందని అనుకోలేదు. వాడిల్లు అచ్చం అమెరికాలో ఉన్నట్లే ఉంది. అక్కడి ఇళ్లకి దీనికి ఏ మాత్రం తేడా లేదు.

బిజినెస్ బాగానే ఉందని చెప్పారు. అదిగాక శాంతి తరపున ఆస్తి కూడా వీడికే వచ్చింది. పిల్లల్ని చక్కటి స్కూళ్లలో వేశాడట. కృష్ణ అదృష్టవంతుడు. అనుకూలవతి అయిన భార్య, పిల్లలు ఉండటం కూడా ఒక వరమే!

కాసేపు నేను బెడ్ మీద వాలాను. సుమకి ఫోన్ చేశాను. డ్రైవ్‌లో ఉందేమో తీయలేదు.

అంతలోనే కిటికీలో నుండి కనిపించిన దృశ్యం నన్ను కట్టి పడేసింది.

కిటికీకి కొంచెం అవతలగా గుబురుగా పెరిగిన ఆకు సంపెంగ చెట్టు. అది చూడగానే నా మనసు ఆప్యాయంగా గతం తాలుకు జ్ఞాపకాలని తడుముకుంటోంది.

'నడిచే సాలభంజికవైన నీ పాదాల మీద ఆ సంపెంగపూల వర్ణం నన్ను ఎప్పుడూ పారవశ్యంలో ముంచుతుంది'

ఆ జ్ఞాపకాల అలల్లో మునిగిపోయిన

నేను, అవతల నుండి 'హలో హలో' అన్న పిలుపుతో స్పృహలోకి వచ్చాను.

"నేను అనుకుంటూనే ఉన్నాను. రాజ మండ్రి వెళితే మీరు అన్నీ మర్చిపోతారు" అవతల సుమ గొంతు.

"అబ్బే అదేమీ లేదు. నిద్ర.." అబద్ధం ఆడాను.

"అన్ని విషయాలూ ఎప్పటికప్పుడు చెప్పాలి సరేనా!"

"సరే సరే" అని అన్నిటికీ ఊ కొట్టి ఫోన్ పెట్టేశాను.

అంతవరకు మనసు పొరలలో దాచి ఉంచిన జ్ఞాపకాల పేటికను తెరిచాను. కొన్ని భావాలు ఎంత అందంగా ఉన్నా చూపించడానికి, చెప్పుకోవడానికి కుదరదు. అవి మనసుతోనే అనుభవించాలి.

గౌతమి ఎలా ఉందో? నాతో ఇదివర కటి చనువు చూపిస్తుందో? లేదో? ఛ! అన్ని డౌట్స్ ఇప్పుడే రావాలా? అని తల విదిలించుకున్నాను.

గౌతమి రూపాన్ని తలచుకుంటున్న నా పెదవుల మీద చిరునవ్వు మెరిసింది. గత స్మృతులతో హృదయం ఆనందంతో నిండి పోయింది.




**గౌ**తమి గురించిన ఆలోచనల్లో కొట్టు కుపోతున్న నేను "శ్రీరామ్, కాఫీ" అంటున్న శాంతి మాటలతో ఈ లోకం లోకి వచ్చాను.

"థాంక్స్ శాంతి! ఇప్పుడే అనుకుంటు న్నాను ఇంకో కప్పు తాగాలని" అన్నాను కాఫీ కప్ అందుకుంటూ.

ఆ వెనకాలే కృష్ణ కూడా వచ్చాడు. "లంచ్ ఇంట్లో తిందామా? బయటకు వె ళ్దామా? " అని అడిగాడు.

"ఏదైనా ఫర్వాలేదు" అన్నాను.

శాంతి మధ్యలో కల్పించుకుంటూ "హా యిగా ఇంట్లోనే భోజనం చేసి కాసేపు రెస్ట్ తీసుకుంటారులే కృష్ణా" అంది.

"సరేలే! నీ మాట కాదని అంటామా? మీరజాల గలనా నీ మాట" అని రాగయు క్తంగా అన్నాడు కృష్ణ.

"పెద్ద అన్నీ వినేటట్లు ఎంత బిల్డప్ ఇస్తున్నాడో చూడు శ్రీరామ్" అని కిను కగా అంది శాంతి.

వాళ్ళిద్దరి మాటలు చిన్నప్పటిలానే సర దాగా ఉన్నాయి. వాళ్ళది మేనరికం కావ డంతో ఇద్దరూ నువ్వంటే నువ్వు అని మాట్లాడుకుంటారు.

పైకి నవ్వుతూ ఉన్నాను గానీ లోపల మట్టుకు 'ఏంటి వీడు గౌతమి గురించి ఏమీ చెప్పడేంటి? ' అని అసహనంగా అనుకున్నాను.

ఆ తరువాత కృష్ణతో పాటు అతని ఆఫీ సుకి వెళ్ళాను. మధ్యాహ్నం వరకు ఉండి లంచ్‌టైంకి ఇంటికి వచ్చాం. ముగ్గురం కలిసి తిన్నాక, మా ఇద్దర్నీ ఒంటరిగా వ దిలేసి శాంతి వెళ్ళిపోయింది.

అంతవరకు ఎలాగో బిగపట్టుకొని ఉన్న నేను, "కృష్ణా! వచ్చినప్పటి నుండి గౌతమి గురించి తెలుసుకోవాలని తహతహలాడు తున్నాను. నువ్వు ఒక్కమాట కూడా మాట్లాడటం లేదు" అని ఆర్తిగా అన్నాను.

తను నోరు తెరిచి ఏదో చెప్పబోయే లోపల ఎక్కడ్నుంచో ఫోన్ వచ్చింది.

"సారీ రా! నేను అర్జెంట్‌గా మళ్ళీ ఆఫీ స్‌కి వెళ్ళాలి. పెద్ద ప్రాబ్లం వచ్చింది" అని హడావుడిగా వెళ్ళిపోయాడు.

## కొత్తగాలి...

**పట్నం**
**సముద్రం లాంటిది!**
**పల్లెటూరు**
**చెరువు లాంటిది!**

– అమ్మిన వెంకట అమ్మిరాజు,
పేరూరు, ఖమ్మం జిల్లా

ఇన్నేళ్ళ తరువాత వచ్చిన నాకు గౌతమి గురించి తెలుసుకోవాలని, ఆమెని వెంటనే చూడాలని.. తను ఇప్పుడు ఎలా ఉంటుందో? శాంతిలాగ మారి ఉంటుం దా? లేక అప్పటిలాగే ఉంటుందా? ఎందుకంటే మనసు ఆనాటి గౌతమినే గుర్తు పెట్టుకుంది.

పెళ్ళయి పిల్లలు ఉన్న ఆమె కచ్చితంగా మారే ఉంటుంది. కానీ గౌతమిని మధ్యవయస్కురాలిగా ఊహించుకోవా లంటే మనసు ఒప్పుకోవటం లేదు.

శాంతిలాగ ఒళ్ళు చేసి ఉంటుందా? లేక అప్పటిలాగే నాజూకుగానే ఉంటుందా? ఇప్పుడు అందరికీ బ్యూటీ కాన్షస్, హెల్త్‌కా న్షస్ ఎక్కువ అయ్యాయి కదా! అందులో ఇప్పుడు పెద్ద ప్లీడరుగారి భార్యాయె!

చిన్న పల్లెటూళ్లలో కూడా బ్యూటీపార్లర్లు, యోగాసెంటర్లు ఉన్నా యని ఆ మధ్య ఇండియాకి వచ్చిన పల్లవి శ్రీకాంత్‌లు చెప్పారు. ఇంకా చాలామంది చెప్పారు.

ఇలా కొద్దిసేపట్లో చూడబోయే గౌతమి చుట్టూ తిరుగుతున్నాయి ఆలోచనలు.

అదేమిటో విచిత్రంగా ఇదే ఊరిలో ఉంటున్న కృష్ణ అసలు తనకేమి తెలి యదు అంటున్నాడు. ఏదో పొడి పొడిగా గౌతమి బానే ఉందని, ప్లీడరుగారు పోయారని మాత్రమే చెప్పాడు.

నేను ఎంతగా ఆరాటపడుతున్నానో ఒక్కసారి గౌతమిని చూడాలని. వీడి వా లకం చూస్తుంటే ఇష్టం లేనట్లుగా ఉంది. ఎన్నిసార్లు గౌతమి గురించి అడిగినా ఏదోలా దాటేస్తున్నాడు.

పైగా ఆ ఏముంది సంసారంలో పడిపో యాక.. ఇల్లు, భర్త, పిల్లలు ఇవే మా ప్రపంచం! పెద్ద ఏవుంటుంది మాట్లాడటా నికి అందట!

ఇరవయ్యేళ్ళ తరువాత తన చిన్ననాటి స్నేహితుడు వస్తున్నాడని చెబితే గౌత మిలో స్పందన లేకపోగా ఆ విధంగా మాట్లాడుతుందా? అంతేనా? మా మధ్య ఉంది? ఇంకేమీ లేదా? నిజంగా అంతలా మారిపోయిందా గౌతమి! వీడు చెప్పేవన్నీ నిజాలేనా?

లేకపోతే వీడే చెబుతున్నాడా? ఏమో వీడో పెద్ద బిజినెస్ మేగ్నెట్! డబ్బు, హోదా వచ్చేసరికి అన్నీ మారిపోతాయి. ఎటువంటి వాడినయినా మార్చేసే శక్తి డబ్బుకి ఉంది. పోనీ శాంతిని అడిగితే? ప్చ్! బాగోదు! ఏమైనా అనుకుంటుంది. ఛ! ఇదేమిటి ఇన్నిరోజులు ఎక్కడో ఉండి తల చుకునే మనిషిని, కళ్ళెదుట చూసే అవ కాశం వచ్చినా వెళ్ళలేకపోతున్నాను. అన వసరంగా సర్‌ప్రైజ్ చేద్దాం అన్నా. లేక పోతే ఈపాటికి వాళ్ళింటికి వెళ్ళి తనతో కబుర్లు చెబుతూ ఉండేవాడిని అని మథ నపడుతున్న నా మనసులో ఓ అద్భుత మైన ఆలోచన వచ్చింది. 'అయినా వీడి మీద ఎందుకు ఆధారపడటం? తెలియని ఊరా? ఏంటి? నేనే వెళ్ళి కనుక్కుంటాను' అనుకున్నాను.

టైం మూడుగంటలు అయింది. అంత వరకూ బద్ధకంగా ఉన్నవాణ్ణి లేచి ఫ్రెష్ అయి "అలా బయటకు వెళ్లొస్తాను" అని శాంతికి చెప్పి బయటకు వచ్చేశాను.

అక్కడ జంక్షన్లో ఉన్న ఆటోని పిలిచి "చూడు! నీకు కావాల్సిన డబ్బులు

ఇస్తాను. నాకు ఈ ఊరు మొత్తం చూపించు" అన్నాను.

ఆటోలో అటూ ఇటూ చూస్తూ, అతన్ని అడుగుతున్నాను. దానికి అతను సమాధానాలు చెబుతూ ఉన్నాడు.

'ఊరంతా ఎంత మారిపోయింది' స్వగతంగా అనుకున్నాను.

"బాబూ! మీరు అమెరికా నుండి వచ్చారా? " ఆటో అతను అడిగాడు

"అవును! నీకు ఎలా తెలిసింది? " ఆశ్చర్యంగా అన్నాను.

"ఎందుకో అనిపించింది. మిమ్మల్ని ఇక్కడ ఎప్పుడూ చూడలేదు. పైగా మీ బట్టలూ అలాగే ఉన్నాయండి" అన్నాడు.

అతని అబ్జర్వేషన్‌కి ముచ్చట వేసింది.

"చాలా రోజుల క్రితం మనూరు వదిలి, మళ్ళీ ఇప్పుడే వచ్చాను" అని చెప్పగానే..

"ఆయ్! అలా చెప్పండి బాబు! తవరెక్కడికంటే అక్కడికే తీసుకెళ్ళిపోతా. డబ్బుదేముంది బాబు! మీకు తోచింది ఇవ్వండి, చాలు" అని హుషారుగా అన్నాడు.

ఆటో నడుపుతూ అలా ఊరి గురించి, కరెంట్ పాలిటిక్స్ గురించి మాట్లాడుతూనే ఉన్నాడు. నా దృష్టి మట్టుకు మారిపోయిన ఊరు మీద ఉంది. అసలు గుర్తుపట్టలేకపోతున్నాను. అన్నీ కొత్తకొత్త కాలనీలు.. హాస్పిటళ్ళు, గుళ్ళు, హోటళ్లు.. ఒకటేమిటి రాజమండ్రి ముఖచిత్రమే మారిపోయింది. ఒకప్పుడు కార్తీక వనభోజనాలకి ఏవీ రోడ్ నుండి మోరంపూడి జీడిమావిడి తోటలకి వెళ్ళే వాళ్ళం. కానీ ఇప్పుడు మచ్చుకి ఒక్కటి కూడా కనిపించలేదు. అన్నీ పెద్దపెద్ద బిల్డింగ్‌లు వచ్చేశాయి.

"బాబూ! మీరు చెప్పినట్లే ఓ పాలి చుట్టు తిప్పి ప్రకాష్‌నగర్ రౌండ్ పార్కు దగ్గరికి తీసుకొచ్చాను" అన్నాడు.

అక్కడ ఒక్కసారి ఆపమన్నాను. దిగి చుట్టూ చూశాను.

'ఆ! ఈ హాస్పిటల్.. అప్పటి హాస్పిటల్! ఇంకా ఉంది అక్కడే! అది ఒక్కటి నాకు తెలిసున్న గుర్తు. ఏవో అక్కడ రెండు బ్యాంకులు ఉన్నాయి. అవి కొత్తవే' అనుకున్నాను.

"సరే! ముందు దానవాయిపేటలో ఉన్న చిన్న ఆంజనేయస్వామి గుడి దగ్గరకు తీసుకొని వెళ్ళు" అన్నాను.

చాలా ఏళ్ళ తరువాత రావడంతో ఊరు గుర్తుపట్టలేనంతగా మారిపోయింది.

మొత్తానికి చిన్న ఆంజనేయస్వామి గుడి దగ్గర ఆటో ఆపి "ఇదేనండి మీరు చెప్పిన గుడి" అన్నాడు.

'ఓహ్ వచ్చేశామా! ఇదేనా!' అనుకుంటూ దిగాను. మెల్లగా ప్యాంటు జేబులోకి చేతులు పోనిచ్చి ఆ వీధిలోకి నడవసాగాను. ఎవరైనా తెలిసిన వాళ్ళు కనిపిస్తారేమో అని చిన్న ఆశ! అయినా నా పిచ్చిగాని ఇన్నేళ్ళ తరువాత వచ్చిన నన్ను ఎవరు గుర్తుపట్టగలరు.

'యూజ్ యువర్ బ్రెయిన్ మై డియర్' అనుకుని సంపెంగ చెట్టు వుండే ప్లీడరు గారి ఇంటి కోసం వెతుకుతూ ముందుకి నడుస్తున్నాను. ఆ చివర నుంచి ఈ చివర వరకు వీధి అంతా వెతికాను.

ఇంకా ముందుకి వెళ్ళి తిరిగితే ఉమెన్స్ కాలేజీ వచ్చేస్తుంది. ఎక్కడా నాకు సంపెంగ చెట్టు ఇల్లు కనిపించలేదు.

'అరె! ఇల్లే మాయమైంది, ఒక వేళ డెవలప్మెంట్‌కి ఇచ్చేశారేమో? ' అనుకుంటూ, నేను వెతుకుతున్న ఇంటివాళ్ళ పేరు చెప్పి అడుగుదామని ప్రయత్నం చేశాను.

'ఇక్కడ మేం కొత్తగా వచ్చామ'ని కొందరు, 'మాకు తెలియదండీ' అని మరి కొందరు చెప్పారు.

ఏం చెయ్యాలో తోచలేదు. అంతలోనే ఒక ఐడియా వచ్చింది. ఆంజనేయస్వామి గుడిలో అడిగితే, వాళ్ళకి తెలిసే ఛాన్స్ ఉంది అనుకుని గుడివైపు అడుగులు వేశాను.

ఆ రోజు శనివారం కావటంతో భక్తులు అప్పటికే ఉన్నారు. ప్రతి మంగళ, శనివారాల్లో భజన చేస్తారు. భజన బృందంవాళ్ళు అన్నీ రెడీ చేసుకుంటున్నారు. ఇంకా ఆ సంప్రదాయం కొనసాగుతోంది కాబోలు! పూజారి దగ్గరకు వెళ్ళి, నన్ను పరిచయం చేసుకొని, ప్లీడరుగారి ఇంటి గురించి అడిగాను.



అతను నన్ను ఆపాదమస్తకం చూసి "ముందు మీరు దేవుడికి దండం పెట్టుకోండి" అన్నాడు.

ఆయన చెప్పినట్టే చేసి మనసులో ఒక్కటే కోరుకున్నాను 'ఒక్కసారి గౌతమిని చూపించు' అని.

పూజారి తీర్థప్రసాదాలు ఇస్తూ "ఇందాక మీరు ఏదో అడుగుతున్నారు" అన్నాడు.

నేను చెబుదామని నోరు తెరిచే లోపల నా ఫోన్ మోగింది. చూస్తే అది కృష్ణ దగ్గర నుండి. "అదేంటిరా చెప్పకుండా ఎక్కడికి వెళ్ళిపోయావు? ఇంటికి ఫోన్‌చేస్తే శాంతి చెప్పింది. సరే ఎక్కడున్నావు? " అనడిగాడు.

"దానవాయిపేట చిన్న ఆంజనేయస్వామి గుడి దగ్గర.."

"అదేంటి అక్కడకు ఎందుకు వెళ్లావు? " అని అన్నాడు. ఆ గొంతులో కంగారు ధ్వనించింది.

"నువ్వు లేవు. ఏం తోచలేదు. అయినా మనకి తెలియని



ఊరా ఏంటి? అదేంటిరా ప్లీడరుగారి పేరు ఇక్కడ ఎవరికీ తెలియదంటూన్నారు" అని ఆశ్చర్యంగా అన్నాను.

"అవునా! సర్లే నువ్వు అక్కడే ఉండు! నేను వచ్చి పికప్ చేసుకుంటాను" అని ఫోన్ పెట్టేశాడు.

చెప్పద్దూ! వాడి కంగారు, నాకు కాస్త వింతగా అనిపించింది. రెండడుగులు వేసి ఆటో దగ్గరకు వెళ్ళి అతనితో "థాంక్స్! నాకు చాలా హ్యాపీగా ఉంది. ఓపిగ్గా అన్నీ చూపించావు" అన్నాను.

దానికి అతను సిగ్గుపడిపోయాడు.

"నీ పేరేంటి? " అన్నాను డబ్బులిస్తూ.

"నా పేరు లోవరాజు అండి! విద్యుత్‌న గర్ జంక్షన్లోనే ఉంటామండి" అని డీటె యిల్స్ చెప్పాడు.

"కాసేపు ఉండమంటారా? "

"లేదులే! మా ఫ్రెండ్ వస్తున్నాడు"

"సరే బాబు! ఎప్పుడయినా అవసరం పడితే నన్ను పిలవండి" అని ఆటో అతను వెళ్ళిపోయాడు. ఎదురుగా కనిపిస్తున్న సెంటర్ దగ్గరకు వెళదామనుకొని అడు గులు ముందుకు వేశాను.

ఒకప్పుడు దాన్ని 'ప్రీతం సెంటర్' అనే వారు. ఆ తరువాత అక్కడ ఒక ఫేమస్ సైక్రియాటిక్ హాస్పిటల్ కూడా ఉండేది.

ఈ పక్కన కనిపిస్తున్న పెద్ద కాలేజీ బిల్డింగ్ ప్లేసులో ఒకప్పుడు పెద్ద ఇల్లు ఉండేది. ఇంకా ఆ ఎదురుగా ఉన్న బిల్డింగ్ కూడా అప్పుడు ఇల్లే! ఇప్పుడు అవన్నీ ఆఫీస్ బిల్డింగ్‌లుగా, కాలేజీ బిల్డిం గ్‌లుగా రూపాంతరం చెందాయి. ఇంకా ఆ పక్కన కొన్ని ఇళ్ళు ఉండేవి. ఇప్పుడు ఈ ఏరియా చూస్తే పెద్ద బిజినెస్ సెంటర్‌లా ఉంది. హాస్పిటల్ బోర్డులు అయితే ఎన్నో చెప్పలేను. ఇంకొంచెం ముందుకు నడిస్తే ప్రకాష్‌నగర్ వస్తుంది. ప్యాంటు జేబులో చేతులు పెట్టుకొని నడుస్తూ, ఆలోచిస్తు న్నాను, అసలు ఇక్కడ నా జీవితప్రస్థానం ఎలా మొదలయిందో గుర్తుకొచ్చింది. పాత జ్ఞాపకాలు కళ్ళముందు తిరుగుతున్నాయి. కృష్ణా, నేను, బలరాం ఈ వీధులన్నీ తిరి గేవాళ్లం. కుడిపక్కకు వెళితే పెద్ద పార్కు.

ఎడంపక్కకి తిరిగితే అక్కడ హాస్పి టల్. ఎదురుకుండా చిన్న పార్కు. దాన్నే 'రౌండ్ పార్క్' అంటారు. ఇప్పుడు అటు నుండే వచ్చింది ఆటో. ఆ పార్కుకి సాయంత్రం అయ్యేసరికి పెద్దవాళ్లందరూ

వాకింగ్‌కి వచ్చేవారు. వాళ్ళు ఎప్పుడూ ఓ రెండు బెంచ్‌ల మీద కూర్చొనేవారు. దానికి 'ఓల్డ్ మెన్ కాన్ఫరెన్స్ ప్లేస్' అని పేరు పెట్టాం. బాధ్యతలు తెలియని వయసు. ప్రతిదాన్ని తేలికగా తీసుకో వడం.. పగలబడి నవ్వుకోవడం.

ఇంతలో ఎవరో నన్ను దాటుకుంటూ వెళ్లి, ఒకసారి వెనక్కి తిరిగి చూశాడు. మళ్ళీ ముందుకు అడుగులు వేసి, ఏదో గుర్తొచ్చిన వాడిలా వెనక్కి తిరిగి నా వైపుకి రాసాగాడు.

దగ్గరగా వచ్చి తడబాటుగా "నువ్వు.. మీరు శ్రీరామ్ కదా! అన్నాడు"

అది విన్న నాకు అమితాశ్చర్యం కలి గింది. ఇన్నేళ్ళ తరువాత కూడా నన్ను ఇక్కడ ఒకరు గుర్తుపట్టి పలకరించడం.

"అవును! శ్రీరామ్‌నే! మీరు..?" ఈమాటు తడబాటు నావంతయింది.

"నేనేనండి, రమేశ్‌ని! కాలేజీలో మీ జూనియర్‌ని! ఫుట్‌బాల్ జట్టులో ఉండే వాడిని. మన కాలేజీ తరపున ఇంటర్ స్టేట్ పోటీల్లో ఆడి కప్పు పట్టుకొచ్చాం గుర్తుకొచ్చిందా? ఎలా ఉన్నారు? ఎక్క డుంటున్నారు?" గబగబా చెప్పి నా గురించి అడిగాడు.

నిజం చెప్పొద్దూ అతని మొహం గుర్తుకి రావటంలేదు ఎంత ప్రయత్నించినా!

అతనేమో అంత కాన్ఫిడెంట్‌గా చెబు తుంటే గుర్తురాక లోలోపల సిగ్గుపడ్డాను. పైకి మటుకు "ఆc! ఆc! అవును! గుర్తుప ట్టాను ఎలా ఉన్నారు?" అన్నాను.

అవును! ఒకప్పుడు నేను ఫుట్‌బాల్ ఆటగాణ్ణి. మా కాలేజీ జట్టుకి నాయకత్వం వహించినవాణ్ణి. అందుకు కారణం గౌత మి! తను ఎంతో ప్రోత్సాహం ఇచ్చింది. తనకి ఎందుకో క్రికెట్ అంటే ఇష్టం ఉండేది కాదు. పైగా అనేది నాతో 'ఎందుకు అందరూ క్రికెట్ అంటారు?'



అలా నా ధ్యాసను క్రికెట్ మీద నుండి ఫుట్‌బాల్ మీదకి మళ్లించింది. బాగా ఆడే వాడిని. జిల్లాస్థాయి పోటీల్లో ఎప్పుడు ఆడినా మా జట్టే గెలిచేది. ఎప్పుడూ వ్యాయామం చేస్తూ శరీరాన్ని అదుపులో ఉంచుకునేవాణ్ణి. ఎన్నో కలలు కన్నాను.. పెద్ద ఆటగాడినయిపోవాలని! ఫుట్‌బాల్ అంటే మన వాళ్ళందరికీ ఆసక్తి పెంచా లని! ప్చ్! అన్నీ నిరర్ధకం అయిపోయాయి. అమ్మ పోవడం పెద్ద షాక్. గౌతమి తోడుగా ఉంటుందని ఆశపడిన నాకు నిరాశే మిగిలింది. ఇంక ఆ తరువాత ఆ ఆట మీద ఆసక్తి పోయింది. జీవితంలో ఒక్కోసారి ఇష్టపడినవి, కోరుకున్నవి మనకు అందకుండా పోతాయి. కాకపోతే ఇంకో విధంగా కలకత్తాలో బాబాయి వాళ్ళింట్లో ఉన్నప్పుడు, వాళ్ళ రైల్వే లీగ్ పోటీలు చూడటం, అప్పుడప్పుడు సరదాగా వాళ్లు ఆడుతూ ఉంటే నేను కూడా ఆడే వాణ్ణి. ప్రపంచంలో చాలా దేశాల్లో ఫుట్ బాల్ ఆడేవారు వున్నారు. ఆ తరువాత అమెరికా వెళ్ళాక ఈ ఆటకున్న ప్రాముఖ్యం గురించి మరింత తెలుసుకునే అవకాశం వచ్చింది. కోట్లమంది జనం, తమకు ఇష్టమైన జట్లను చూడడానికి స్టేడి యాలకి తరచూ వెళ్తుంటారు. కోట్లమంది ఆటను టీవీలో చూస్తుంటారు. చాలా మంది ఫుట్‌బాల్‌ను ఇష్టంగా ఆడతారు. ఇప్పుడు రమేశ్ వచ్చి నాలోని ఆనాటి ఆట గాణ్ణి ఓసారి గుర్తుకు తెచ్చాడు.

అతని భుజం మీద ఆప్యాయంగా చెయ్యివేసి, "పద! పద! చాల ఏళ్ళ తరు వాత కలిశాం! నేను ఉండటం అమెరి కాలో..! రాజమండ్రిలో మనోళ్ళ అందరినీ కలుద్దామని వచ్చాను. అదే మా ఫ్రెండ్ కృష్ణ గుర్తున్నాడు కదా! వాళ్ళింట్లో ఉన్నాను. రా, నాతో పాటు, అక్కడ కూర్చొని కబుర్లు చెప్పుకుందాం" అన్నాను.

"అయ్యో! లేదండీ నేను అర్జెంటుగా ఈ మందులు, ఇంజెక్షన్లు హాస్పిటల్‌కి తీసు

కుని వెళ్ళాలి. మా మిసెస్‌కి బాగాలేదు. ఆమెకి కాన్సర్. మొన్న మరీ బాగాలేక పోతే హాస్పిటల్‌లో చేర్చాను.. డాక్టర్ బల రాంగారు.. అదే మీ ఫ్రెండ్! ఆయనే చూసేది. ఉంటానండి! మళ్ళీ కలుస్తా" గబగబా మాట్లాడేస్తున్నాడు.

ఇంతలో మా పక్కనుంచి ఒక వ్యాన్ పెద్దగా హారన్ మోగిస్తూ వెళుతోంది. అతనేదో గౌతమీ అన్నట్లుగా వినిపించింది. నేను అడగబోయే లోపల అతను ముందుకు వెళ్ళిపోయాడు.

ఇంతలో కృష్ణ కారు వచ్చి ఆగింది.

"రారా! కారు ఎక్కు!" అని డోర్ ఓపెన్ చేశాడు. "ఏంటి రోడ్లన్నీ పచార్లు చేస్తున్నావు! ఇంటి నుండి బయలుదేరి మూడు గంటలపైనే అయిందని శాంతి ఫోన్ చేసింది" అంటూ కారు స్టార్ట్ చేశాడు.

అంతలో వాడి దృష్టి హడావుడిగా వెళ్ళిపోతున్న రమేశ్ మీద పడింది. కొంత ఆదుర్దాగా, కొంత క్యూరియస్‌గా "అతను రమేశ్ కదా! ఏం మాట్లాడాడు నీతో? నిన్నెలా గుర్తుపట్టాడు? " అనడిగాడు.

"ఏం లేదురా విసుగ్గా అనిపించింది. అదీగాక తెలిసున్న ఊరే కదా! ఓసారి చూడాలనిపించి బయటకు వచ్చాను. అన్నట్టు రమేశ్ భార్యకు కాన్సర్ అట! అతని మాటల్లో గౌతమీ అని ఏదో వినిపించింది రా"

"వింతగా ఉందే! నువ్వు గౌతమి ధ్యాసలో ఉన్నావు.. అందుకే అలా అనిపించి ఉంటుంది. జస్ట్ ఇప్పుడే కలిశావు. అప్పుడే అన్ని విషయాలు చెప్పేశాడా? " గమ్మత్తుగా అన్నాడు.

ఆ మాట తీరులో ఏదో తెలియని తేడా కనిపించింది. అంతలో గుర్తుకొచ్చింది.

"ఒరేయ్! ఒకసారి మనం పుష్కర ఘాట్ కెళ్ళాలి" అన్నాను.

"ఎందుకు? చూద్దామనా? " అని అన్నాడు.

"చూడాలని ఉంది! కానీ అందుకు కాదు. కిందటి వారం అక్కడి స్నేహితుడు శేఖర్ కలిసి ఒక చిన్న పాకెట్టు ఇచ్చి నువ్వు రాజమండ్రి ఎలాగు వెళతావు కాబట్టి ఇది గోదావరిలో కలిపేయి" అని అభ్యర్థించాడు.

"అది వాళ్ళ నాన్నగారికి సంబంధించిన కొన్ని వస్తువులు. అవి ఆ పెట్టెతో సహా కలపమన్నాడు" అని చెప్పాను.

"అలాగా! సరే!"

పుష్కరఘాట్‌లో గోదావరి మాత విగ్రహానికి పక్కగా కొంచెం కిందకి మెట్ల మీద ఇద్దరం కూర్చొని అఖండ గోదావరిని చూస్తున్నాను. ఇద్దరు సాధువులు స్నానాలు చేస్తున్నారు. మరో నలుగురు పిల్లలు చేప పిల్లల్లా ఈదుతూ నీళ్ళలో పెళ్ళు పెళ్ళు మంటూ శబ్దం చేస్తున్నారు.

"వాళ్ళని చూస్తుంటే నీకు ఏమనిపిస్తోంది? " అనడిగా.

వాడు పెద్దగా రెస్పాండ్ అవలేదు.

తెచ్చిన పెట్టెని గోదావరిలో కలిపేసి మెట్ల మీద కూర్చొని చూస్తున్నాను. నా కుడిపక్క పాతబ్రిడ్జి, ఆ పక్కన ఇంకో రైలు బ్రిడ్జి, ఈ పక్కన రైలు కమ్ రోడ్డు బ్రిడ్జి. నా కంటి చూపు అఖండ గౌతమి మీద.. మనసు మాత్రం నా ప్రియ నెచ్చెలి గౌతమి మీద..

"నీ దర్శనం అయింది తల్లీ. ఇంక మా

## కొత్తగాలి...

**నరికే ప్రతి చెట్టూ**
**పర్యావరణానికి ముప్పు!**
**నాటే ప్రతి మొక్కా**
**ప్రగతికి పై మెట్టు!**

– బి.వి. నరసింహారావు,
పేరాల, ప్రకాశం జిల్లా

గౌతమిని కూడా చూపించు" అన్నాను సరదాగా పైకి.

దానికి వాడు కూడా ఏదో సరదా జోకేస్తాడని అనుకుంటే, "అయిపోయిందా ఇక్కడ పని! మనం బయల్దేరదాం!" అంటూ లేచాడు. వాడి మొహంలో ఏదో అశాంతి కనిపిస్తోంది.

'ఏంటి వీడిలా మాట్లాడుతున్నాడు? ఆఫీస్‌లో ఏదో ప్రాబ్లం అన్నాడు కదా! అందువల్ల మూడ్ పాడయి ఉంటుంది' అనుకొని.. "సరే పద!" అన్నాను.

గేటు దగ్గరకు వచ్చాం.

ఎదురుగా నిలువెత్తు శివలింగం! చుట్టూరా నీటి ధారలు పడుతూ అభిషేకిస్తున్నట్లుగా ఉంది. దాన్ని విభ్రాంతిగా చూస్తున్నాను. 'ఎదురుగా కోటగుమ్మం వైపు వెళ్ళే దారి. ఎడంపక్కకు వెళితే జిల్లా కోర్టు, కుడిపక్కకు తిరిగి, కొంచెం ముందుకు వెళితే గౌతమీ జీవకారుణ్యసంఘం, గోదావరి బండ్ వస్తాయి' అని అక్కడ నుంచొని మనసులో అనుకుంటున్నాను.

ఈ లోపల వాడు కారు స్టార్ట్ చేశాడు.

ఎక్కి కూర్చుంటూ "ఊఁ! ఇప్పుడు చెప్పు! ఏమైంది? దేనికి అంత అర్జెంట్‌గా పరిగెత్తావు? " అన్నాను.

"అదా! పెద్ద గోల అనుకో! మా ఆఫీస్‌లో ఉండే కాషియర్, మేనేజర్‌కి, అతని సంతకం తీసుకోకుండానే డబ్బులు ఇస్తోంది. ఇలా నాలుగైదు సార్లు జరిగింది. అది చూసి మిగతావాళ్ళు చెప్పారుట, అతను ఎంత మేనేజరయినా సంతకం తప్పకుండా తీసుకోవాలండీ అని. ఈవిడ భయంతోనో, పెద్దవాడనో అడగలేకపోయింది.

అది నిన్న ఆడిట్ జరుగుతున్నప్పుడు వాళ్ళు క్వశ్చన్ చేసేసరికి బయటపడింది. రెండురోజులుగా రావటం లేదతడు. తీరా చూస్తే లక్ష రూపాయలు లెక్క తేలటం లేదు. ఆ మేనేజర్‌గాడు కాస్తా ఉడాయించాడు. అది ఈమె మీదకి వచ్చింది.

"ఏవిటమ్మా ఇలా చేశావేంటి? " అని అడిగితే, బెదిరిపోయి ఏడవడం మొదలు పెట్టింది.

"నీకేం ఫర్వాలేదు! నేను చూసుకుంటాను! మన ఎండీగారికి నేను చెప్పుకుంటాను అన్నాడండీ" అని ఒకటే ఏడుపు. కంపెనీ డబ్బు కట్టేయ్యాలి కదా! ఎక్కడి నుండి తెస్తుంది? ఇది అసలు పోలీస్ కేసు అయ్యేదే. కాకపోతే ఆ అమ్మాయిసంగతి అందరికీ తెలుసు. ఆ నమ్మకంతో ఎవరూ అనుమానించలేదు. అమ్మాయి బాగా మంచి కుటుంబం నుంచే వచ్చింది. కాకపోతే డబ్బు విషయంలో ఎవరినీ నమ్మరాదు. ఒకవేళ నేను తీసుకున్నా కూడా ప్రొసీజరు ప్రకారమే తీసుకుంటాను. అక్కడే ఆ అమ్మాయి తప్పు చేసింది"

"మీ మేనేజర్ ఎటువంటివాడు? "

"స్వతహాగా మంచివాడే! కానీ ఈరోజే అతని గురించి కొన్ని విషయాలు తెలిశాయి. అతనికి కొత్తగా కొన్ని బలహీనతలు వచ్చాయని, వాటికి బాగా బానిస అయ్యాడని, డబ్బులు బాగా తగలేస్తున్నాడని చెప్పారు. సంపాదించింది సరిపోకపోతే ఇదిగో! ఇలా చెయ్యకూడని పనులు చేస్తారు. ఆ బలహీనతే వాళ్ళచేత తప్పుడు పనులు చేయిస్తుంది. అదే ఆస్తులున్న వాళ్ళయితే వాళ్ళ ఆస్తులన్నీ తగలపెట్టుకుంటారు. చివరకు అప్పులపాలయి పూలమ్మినచోట కట్టెలమ్మలేక, వాళ్ళు కష్టాల్లో పడటమే కాక వాళ్ళ మీద ఆధారపడ్డ వాళ్ళ బతుకులు కూడా దుర్భరం చేస్తారు. మన ప్లీడరుగారు, గౌతమి భర్త కూడా ఇలాగే వాళ్ళ జీవితాల్ని నాశనం చేసుకున్నారు. అందుకే ఆమె జీవితం అలా అర్థాంతరంగా ముగిసిపోయింది" అని అని ఆవేశంగా అనేశాడు.

వాడి చివరి మాటలు విని ఉలిక్కిపడ్డాను. "ఏమైంది గౌతమికి? " అంటూ





అ
క్ష
రం

మానవాళికి సేవ చేయడం ద్వారా
భగవంతుని చూడదలిచాను

– మహాత్మాగాంధీ



షాక్‌కి గురై ముందుకు తూలాను. బెల్ట్ ఉండటం చేత దెబ్బలు తగలలేదు

వాడివైపుకి తిరిగి "అసలు ఏం జరిగిందో చెప్పు!" అన్నాను ఉద్వేగంగా.

వాడు గబుక్కున మాట మార్చి, "రేయి శ్రీరామ్! మన క్లాసులో సన్నగా రివటలా ఉండేవాడు, అదే రెండు జెళ్ళ సీత సినిమాలో సుధాకర్‌లా కంగారు పడిపోతూ గుర్తున్నాడా? "అన్నాడు.

"లేదు. కానీ నువ్వు ప్లీడరుగారు, గౌతమీ.. అని ఏదో అన్నావు..? "

"వాడు ఇప్పుడు పెద్ద డాక్టర్ అయ్యాడురా! భలే హుందాగా ఉన్నాడు. బలరాం నర్సింగ్ హోంలోనే చేస్తున్నాడు"

సంబంధంలేని విషయాలన్నీ మాట్లాడుతున్నాడు.

"కృష్ణా! ఇంక నావల్ల కాదు, నువ్వు ఏదో దాస్తున్నావు! చెప్పు ఏం జరిగిందో? " అన్నాను.

అంతవరకు గలగలా మాట్లాడ్తున్నవాడు సమాధానం చెప్పకుండా కారుని పోనిచ్చాడు. కోటిపల్లి బస్టాండ్ దాటిపోయాడు. అదొక్కటే గుర్తుపట్టాను. తరువాత కారు ఎటు వెళుతోందో తెలియలేదు.

వాడు మౌనంగా కారుని పోనిస్తున్నాడు. 'గౌతమీ ఘాట్‌కెళ్ళే దారి' అని రాసిన చోట నుంచి తీసికెళ్ళి, 'కైలాస భూమి' అని పేరు రాసిన చోట ఆపాడు.

ముందు అదో పెద్ద పార్క్ కాబోలు అనుకున్నాను. కారు ఆపి అందులోకి తీసుకొనివెళ్ళాడు. పచ్చని తోట, బోలెడు ఫౌంటెయిన్లు, పార్కులో శివుడి బొమ్మ.. సత్య హరిశ్చంద్ర కాటిసీను, గంగావతరణ దృశ్యాలు పెద్ద శివుని విగ్రహం.. అభావంగా చూస్తూ వాడి వెనకే నడిచాను.

అక్కడ ఒక పెద్దగోపురంతో కట్టిన హాలు ఉంది. వరుసగా అయిదారు పొడుగాటి బల్లలు ఉన్నాయి. కానీ అవి కచ్చితంగా కూర్చోడానికి కాదు.

ఒక్కసారి ఫ్లాష్‌లా మెరిసింది అది.. అదే! అంతే! ఇక అంతకు మించి ఊహించడానికి భయమేసింది.

అక్కడున్న ఒక బల్ల చుట్టూ తిరుగుదాం రమ్మని పిలిచాడు. వాడి వెనకాలే యాంత్రికంగా తిరిగాను. అప్పటికే నా ఆలోచనా శక్తి నశించింది.

అక్కడ నుండి బయటకు వచ్చాక మరింత ముందుకు తీసుకెళ్ళాడు. అక్కడ 'గౌతమీఘాట్' అని రాసి ఉంది.

"రారా! వెళదాం!" అంటూ చెయ్యి పట్టుకుని కింద మెట్ల దగ్గరికి తీసుకెళ్లాడు.

"నీకు ఎలా చెప్పాలో? ఎక్కడ మొదలు పెట్టాలో? అర్థం కావటం లేదురా!" అన్నాడు మాటలు పేర్చుకుంటూ.

"..గౌతమికి ఏదైనా ప్రమాదం జరిగిందా? లేక ఆమె..? " అన్నాను. ఆపైన నా నోట్లోంచి మాట పెగల్లేదు.

అప్పుడు వాడు నా చేతులు పట్టుకొని "అవునురా! తిరిగిరాని లోకాలకి వెళ్ళిపోయిందిరా గౌతమి! దురదృష్టవశాత్తూ తనకు వచ్చిన జబ్బు అలాంటిది!" అంటూ కళ్లు తుడుచుకున్నాడు.

ఆ తరువాత నా చెవులకి ఏదీ వినిపించటం లేదు. ఇది నిజమా? ఇది వినడం

కోసమే వచ్చానా? మెదడు మొద్దుబారింది.

ఎదురుగుండా గంభీరంగా గోదావరి! నిశ్చలంగా శూన్యంలోకి చూస్తూ ఉండిపోయాను. మనసంతా విషాదం!

ఎవరిని కలవాలని వచ్చానో, ఆమె అసలు ఈ లోకంలోనే లేదని అంటున్నాడు కృష్ణ. ఇంక ఎందుకు? ఏముంది? అంతా అయిపోయింది. మెట్లు దిగుతూ కింది మెట్టు వరకు వచ్చాను. వెనకాలే కంగారుపడుతూ కృష్ణ వచ్చేశాడు.

నీళ్ళని చేతిలోకి తీసుకున్నాను.

"గౌతమీ! ఇక్కడే ఈ గోదావరిలోనే కలిసిపోయావా? " అంటుండగా అప్పుడు లోపలి నుండి పెల్లుబికింది దుఃఖం. ఎంత ఆపుకుందామన్నా ఆగటం లేదు. పక్కనే కృష్ణ వచ్చి కూర్చుని, భుజం మీద చేయి వేసి అదిమాడు.

గాలి తెలియని విషాదగీతం ఆలపిస్తున్నట్లుంది. ఏదో అనీజీనెస్. గుండెంతా బరువెక్కిపోయింది. అప్పటికే చీకట్లు ముసురుకుంటున్నాయి. అవతలి ఒడ్డున లైట్లు నక్షత్రాల్లా మెరుస్తున్నాయి. అంతలో బ్రిడ్జి మీద లైట్లు కూడా వెలిగాయి. కొత్త బ్రిడ్జి మీద నుంచి రైలు వెళుతోంది. ఘాట్ కూడా లైట్లతో వెలుతురుగా మారింది. దూరాన చేపలు పట్టేవాళ్ళ పడవలు కనిపిస్తున్నాయి.

'ఈ లోకమంతా బానే ఉంది. ఒక్క గౌతమే లేదు' అని గోదావరికేసి చూస్తూ.. 'అన్ని విషయాలు తల్లిలా కడుపులో దాచుకుంటావని తెలుసు. ఈ సంగతి కూడా నీ కడుపులోనే దాచుకున్నావా? ఒక్కమాట అయినా ఎవరూ నాకు చెప్పలేదేం? ఆమె ఇక్కడ ఇంత బాధ పడుతుంటే నాకు కొంచెం కూడా తెలియలేదేంటీ? అయ్యో! గౌతమీ! ఇక నువ్వు కనపడవు. అమ్మ పోయిన తరువాత అనాథగా మిగిలిన నాకు శక్తినిచ్చి బతుకు మీద ఆశను కల్పించి నా ఉన్నతిని కోరుకున్న నువ్వు.. నిస్సహాయ స్థితిలో.. మరణం అంచున నిలబడి కూడా నా గురించి ఆలోచించావంటే.. దానర్థం.. నువ్వున్నావనే కదా నాకు ప్రపంచం ఇంత అందంగా అనిపించింది! మరి ఇప్పుడు నువ్వులేవు, అంటారేమిటి? ' మనసులో రకరకాల ఆలోచనలు.

అంతవరకు కృష్ణ నా చెయ్యి పట్టుకునే ఉన్నాడు. కొంతసేపు అయ్యాక తేరుకుని "ఒరేయి శ్రీరామ్! నువ్వు వెళ్ళిపోయాక, ఇక్కడ చాలా సంగతులు జరిగిపోయాయి. అసలు ఎప్పటికీ తనను గురించిన సమాచారం నీకు ఇవ్వొద్దని గట్టిగా ఒట్టు వేయించుకుంది గౌతమి. ఇప్పుడు తనే జీవించి లేనప్పుడు దాచాల్సినదేముంది? తను అనుభవించిన కష్టం, ఆవేదన.. గౌతమి ఎలాంటి జీవితం గడిపిందో నీకు తెలియాలి. గౌతమి పెళ్లి చేస్తారు అన్నది మాత్రమే తెలుసు నీకు. దాని వెనక కారణాలు.. అసలు ప్లీడరుగారి ఆర్థికపరిస్థితి, ఆయన బలహీనతలు, దాని మూలంగా వాళ్ళ సంసారం ఎలా చితికిపోయిందన్నది, గౌతమిపెళ్లి ఏ పరిస్థితిలో జరిగిందన్నది బలరాం నాన్నగారు మాధవయ్యగారి ద్వారా మాకు తెలిశాయి" అంటూ కృష్ణ చెప్పడం మొదలుపెట్టాడు.

## కృష్ణ మాటల్లో

అందరినీ గుడ్డిగా నమ్మడం వల్ల కట్టుబట్టలతో నడిరోడ్డుమీదకి వచ్చింది ప్లీడరుగారి కుటుంబం. చూస్తుండగానే అంతా తల్లకిందులు అయింది. ఓ రకంగా చెప్పాలంటే ఆయనకున్న నాటకాల వ్యసనమే పెద్ద దెబ్బతీసింది. అదే కాకుండా ఆయన ఇంకో తప్పు చేశారు. భజనపరుల మాటలు నమ్మి ఓ పత్రికని పెట్టారు అదీ అప్పు చేసి! ఒక పత్రిక పెట్టడం అంటే మాటలా? న్యూస్‌ప్రింట్, మార్కెటింగ్, మెషినరీ ఎన్ని కావాలి? పత్రిక పేరు

మీద అడ్వాన్సు తీసుకొని కొంతమంది తప్పుకున్నారు. డబ్బులు గట్టిగా అడగడం ఈయనకి చేతకాలేదు. స్వయంగా ప్లీడరై ఉండి కూడా ఆయన ఎవరి మీదా కేసు పెట్టలేకపోయారు. ఇంట్లో చెప్పకుండా అలా అప్పులతో రెండేళ్లు నెట్టుకొచ్చారు.

ఆయనకి ఆ ఇల్లు ఒక్కటి తప్ప ఆస్తులు అంటూ పెద్దగా ఏమీ లేవని తెలిసింది. పైగా కూతురి పెళ్లికి చేసిన అప్పు, డబ్బు ఇబ్బందులతో ఆగిపోయిన పత్రిక, అన్నిటి కన్నా పెద్ద బాధ అల్లుడు భాస్కర్ గురించి! చుట్టాలబ్బాయి 'లా' చదివాడు. తన పేరుని నిలబెడతాడని కలలు కన్నారు. ఏదో ఉద్ధరిస్తాడని భావించారు. కానీ అతను పని బద్ధకస్తుడే కాదు పేకాట వ్యసనపరుడు. తాగుడికి అలవాటు పడ్డవాడు. మన బలరాం కాకినాడలో ఉండటం వల్ల, వాడికి అంతగా తెలియదు కానీ నేను, ఉమా గౌతమిపెళ్లిలోనే చూశాం పెళ్లికొడుకు వాలకం.

గీతయితే అప్పుడే "ఏంటన్నయ్యా! నాకు అస్సలు నచ్చలేదు. ఆ కళ్ళు ఏంటో తాగినవాడిలా ఉన్నాయి" అనేసింది కూడా.

"ఉష్! గౌతమి వింటుంది. మనం ఇలా అనుకున్నామని తెలిస్తే పాపం బాధపడుతుంది" అన్నాను మెల్లగా.

పెళ్లయ్యాక కొన్నిరోజులు కాకినాడలోనే ఉన్నారు గౌతమి, భాస్కర్‌లు. తర్వాత ఇక్కడికొచ్చేసి గౌతమి నాన్నగారి దగ్గర జూనియర్‌గా చేరాడు.

కొన్నిరోజులు బాగానే గడిచాయి. ఈ మధ్యలో మా గీత పెళ్లయింది. అప్పుడు కాబోలు రెండురోజులు సరదాగా గడిపింది గౌతమి. అప్పుడే నీ గురించి అడిగింది 'ఏమైనా వివరాలు తెలిశాయా శ్రీరామ్ గురించి? ' అని.

ఆ సమయంలో భాస్కర్‌కి మమ్మల్ని పరిచయం చేస్తే ఓ పిచ్చి జోకేశాడు

"ఏంటి నీకు మగపిల్లలే స్నేహితులా? " అని వెటకారంగా.

## సెప్టెంబరు - 2016
## చతుర ప్రవేశిక విజేతలు వీరే!

డ్రాలో ఎంపికైన ఈ అయిదుగురికీ త్వరలో బహుమతులు అందుతాయి.



1. **సత్రసాల రామకృష్ణ**
   - అనంతపురం
2. **కె. నాగభూషణం**
   - మౌలాలి, హైదరాబాద్
3. **పి. సునీల్**
   - నారాయణపేట, నెల్లూరు జిల్లా
4. **యు.వి.ఎస్. శివకుమార్**
   - నేరేడ్‌మెట్, సికింద్రాబాద్
5. **ఎన్. విజయ**
   - కాకినాడ

## సరైన జవాబులు

| | |
|---|---|
| 1. అపురూప | 6. రాధ |
| 2. విశాల్ | 7. ఛాయాదేవి |
| 3. స్వీటీ | 8. ధాత్రి |
| 4. రాహుల్ | 9. సోమర్‌సెట్ మామ్ |
| 5. రాజారామ్మోహన్‌రావు | 10. జి.ఎస్. చలం |

దానికి మేం చేష్టలుడిగి నించుండిపోతే ఉమే అంది "ఏంటండీ? నేను కనిపించటం లేదా మీకు? " అని.

అతని పరిస్థితి అర్థమయ్యాక అప్పటి నుంచి గౌతమి పలకరిస్తేనే పలికేవాణ్ణి. ఇలా రోజులు గడుస్తున్నాయి. ఎప్పుడో గానీ కనిపించేది కాదు. అందులో ఉమ కూడా పెళ్లి చేసుకొని వెళ్లిపోవడంతో అసలు తన విషయాలు తెలియడం తగ్గిపోయింది. ఈ లోపల నా పెళ్లి శాంతితో

జరిగింది. అదే చిన్నప్పుడు నువ్వు చూశావు కదా తనని. మా చిన్న మావయ్యవాళ్లు వస్తుండేవాళ్లు. నా పెళ్లికే అక్కడ ఇల్లు అమ్మేసి ఇక్కడ కొనుక్కున్నాం. ఇక తను ఒక్కతే కూతురు. అందుకే ఆయన కూడా ఇక్కడికే వచ్చేశాడు. కడియంలో నర్సరీలు ఉన్నాయి. అవి కాకుండా నాన్న బిజినెస్.. ఈ రెండూ నేనే చూసుకుంటున్నాను.

ఒకే ఊళ్లో ఉన్నా పెద్దగా గౌతమివాళ్ళ గురించి మాకు తెలిసేది కాదు. భాస్కర్ కోర్టుకి తాగేసి వెళ్లి అక్కడే పడిపోయేవాడట! అది చూస్తే కూతురి మనస్సు ఎంత క్షోభిస్తుందో ప్లీడరు గారికి అర్థమయింది. తెలివితక్కువ వాడిలా, కళ్ళముందు కనిపిస్తున్నది కాదనుకొని, దూరపు కొండలు నున్నగా ఉంటాయని భ్రమించి, ఉజ్జ్వలంగా, దేదీప్యమానంగా వెలగాల్సిన ఆమె జీవనదీపం కొడిగట్టటానికి తనే కారణమని మథనపడుతూ కుంగిపోయేవారు.

ఆ మానసికవేదన, అనారోగ్యం రెంటివల్ల కూడా ఆయన ప్రాక్టీసు తగ్గిపోయింది. కొన్నిరోజులకే ప్లీడరుగారు హార్ట్ ఎటాక్‌తో పోయారు.

ఇవన్నీ తట్టుకొని నిలబడ్డ గౌతమికి దేవుడు కూడా అన్యాయం చేశాడు. గౌతమి భర్త ఎక్కడికో వెళ్లిపోయాడు. అసలు ఉన్నాడో? లేడో? కూడా తెలియదు. అత్త తరుపువాళ్ళు తప్పంతా గౌతమి మీద వేసేశారు. ఆ తరువాత గౌతమి అది తట్టుకోలేక, ఎవరికీ చెప్పకుండా ఊరు విడిచి వెళ్లిపోయింది. ఏడెనిమిదేళ్లు గడిచాయి.

ఓ రోజున బలరాం నుండి ఫోన్ వచ్చింది హాస్పిటల్‌కి అర్జెంట్‌గా రమ్మనమని.

మీటింగ్‌లో ఉన్నవాడిని హుటాహుటిన బలరాం దగ్గరకెళ్లాను. వాడు "గౌతమి వచ్చింది, తనకి కాన్సర్ అడ్వాన్సు స్టేజిలో ఉంది. బహుశా ఒక్క నెల బతకొచ్చు! ఈ స్థితిలో ఏమీ చెయ్యలేం" అని చెప్పాడు.

వాడు డాక్టర్ కాబట్టి పైకి ఏమీ తేల లేదు. నాకు మటుకు దుఃఖం ఆగలేదు.

"మరి ఇంతకాలం మనకి తెలియకుండా ఎలా ఉంది? " అడిగాను వాడిని.

"కావాలనే జాగ్రత్తపడింది. కావాలనే మనకి దూరంగా వెళ్లిపోయింది. ఆరోగ్యాన్ని నిర్లక్ష్యం చేసుకుంది. ఎవరికీ చెప్పకుండా దాచేసుకుంది. అందులో డబ్బు ఇబ్బందుల్లోనో ఉంది. కొంచెమయినా తన ఆరోగ్యపరిస్థితి తెలుసుంటే ఏదో ఒకటి చేసేవాణ్ని. ఇప్పుడు పూర్తిగా చేయి దాటిపోయింది" అని బాధగా అన్నాడు వాడు.

గౌతమి అమ్మగారిని చూస్తే ఎంతో బాధేసింది. అల్లుడు పారిపోయాడు. కూతురి పరిస్థితి రేపో? మాపో? అన్నట్లు ఉంది. ఎలా ఉండేవాళ్లు ఎలా అయిపోయారు. ఒక్కసారి ఆ రోజులన్నీ కళ్లముందు గిర్రున తిరిగాయి.

ఆవిడకి అప్పుడే చెప్పలేదు. కానీ చెప్పాలి కదా! ఇక వాళ్లకి ఎవరూ లేరు అక్కడ.

"ఒరేయ్! ఇప్పుడన్నా శ్రీరామ్‌గాడు ఎక్కడున్నాడో కనుక్కొని గౌతమి గురించి చెప్పేద్దాంరా" అన్నాను.

వాడు "అవును అదే బెటర్" అన్నాడు.

ఇంతలో వాడికి ఏదో అర్జెంటు కేసు వస్తే వెళ్ళిపోయాడు.

ఆ మరునాడు వెళ్ళాను చూడటానికి. మంచం మీద నిస్త్రాణగా పడుకుని ఉంది.

నెమ్మదిగా గది బయటకు వచ్చాను.

"ఏంట్రా పరిస్థితి? " అన్నాను బలరాంతో.

"క్రిటికలే! ఎప్పుడైనా" బాధగా అన్నాడు.

"ఏ మాత్రం ఛాన్స్ లేదా? " అన్నాను.

"లేదు. ఒక డాక్టర్‌గా చేతనైనంత చేస్తున్నాను. పెద్దగా రెస్పాండ్ అవటం లేదు. పోరాటం చేస్తోంది" అంటూ నా చేతికి ఒక డైరీ ఇచ్చాడు. అది గౌతమిది. ఒక చిన్న స్లిప్ మీద వంకరటింకరగా 'ఎప్పటికైనా దీన్ని శ్రీరామ్‌కి అందజేయండి' అని

## కొత్తగాలి...

**అమ్మాయిల్ని**
**అందరూ కడుపులోనే చిదిమేస్తే**
**నేడు దేశానికి**
**పతకాలు వచ్చేవి కావు!**

– ఆర్.ఎస్. హైమవతి,
చెన్నై

రాసి ఉంది.

నీకు చెప్పక పోవడం అన్యాయం అని నేను, బలరాం, ఉష, శాంతి నలుగురం ఆలోచించి నీ గురించి వివరాలు అమెరికా లోని మిత్రులకి ఇచ్చాం. నేను, బలరామైతే నీకోసం అమెరికా అంతా జల్లెడపట్టాం అక్కడున్న స్నేహితుల ద్వారా.

అప్పుడు అనుకోకుండా మా చుట్టాల బ్బాయి వాళ్ళ ఫ్రెండ్ మీ కంపెనీలో పని చేస్తాడట! నీ పాత ఫొటోని గుర్తుపట్టి నీ అడ్రస్, ఫోన్ నెంబరు అదీ ఇచ్చాడు.

మొదట భయపడ్డాం ఈ ఊరికి సంబంధించిన ఏ జ్ఞాపకాలూ నీకిష్టం ఉండవని! కానీ ఆలోచించాం. ఇది ఇష్టాయిష్టాలకు సంబంధించింది కాదు. ఒక మరణించే వ్యక్తి చివరి కోరిక. అందుకు దేన్నయినా సహించడానికి సిద్ధంగా ఉన్నాం.

అందుకు అక్కడున్న స్నేహితుల సహాయం మర్చిపోలేనిది. మాట్లాడదామనుకుంటే అప్పుడే నువ్వు, ఏదో ప్రాజెక్ట్ పని మీద చైనా వెళ్ళావని, రావడానికి ఇరవైరోజులు పడుతుందని తెలిసింది.

అప్పటికీ ఆల్మోస్ట్ రోజూ వెళ్లి గౌతమిని పలకరించేవాడిని. బలరాం, ఉషా ఇద్దరూ కూడా తనని జాగ్రత్తగా చూసుకుంటూ ఉండేవారు. ఎంత చూసినా తను అన్నట్లు 'ప్రయాణం' మటుకు ఖాయం అయింది. ఎముకలగూడు అయిపోయింది.. కళ్ళలోనే ఉంది ప్రాణం అంతా.

ఆ రోజు అర్ధరాత్రి వరకు నర్సుతో ఏదేదో మాట్లాడుతూనే ఉందిట. అందులో నీ పేరు చాలసార్లు వచ్చిందట.

జోక్స్ వేసి వాళ్ళని నవ్వించిందట.

పొద్దున్నే బలరాం దగ్గర్నుంచి ఫోన్ వచ్చింది. అర్జెంటుగా రమ్మని. వెంటనే నేను, శాంతి హాస్పిటల్‌కి వెళ్లాం.

అప్పటికే ఏదో అయిపోతోందట. ఉష అక్కడే ఉంది. గౌతమి కళ్ళు మూసుకునే ఉంది. నేనే దగ్గరకు వెళ్లి చెయ్యి పట్టుకొని 'నీ కోరికలు తెలుసు. తప్పకుండా తీరుస్తాను..' అని అంటూనే ఉన్నా.

బలరాం ఏదో ఇంజెక్షన్ ఇవ్వబోయాడు. మేం చూస్తుండగానే "అయిపోయింది.." అన్నాడు ఆమె చేతిని వదిలి.

పక్కనే సంపెంగ పూలు.

అవి చూడగానే అంతకు కొన్నిరోజుల ముందు జరిగిన విషయం గుర్తుకొచ్చింది.

ఆ రోజు మామూలుగా తనని చూడాలని వెళ్ళాను.

అప్పుడు అంది. "ఏంటి కృష్ణా! నా కోసం మీ పనులు మానుకొని ఇలా రావడం నచ్చలేదు. ఎవరి గురించీ జీవితం ఆగదు. ఒక నిజం తెలుసా మీకు? మన చిన్నప్పటి జ్ఞాపకాలే నా మందులు. అవి తలచుకుంటూ నేను సంతోషంగా ఉన్నాను. నువ్వు, బలరాం నాకెంత మానసిక బలం ఇస్తున్నారో! నాకు తెలుసు నా ప్రయాణం ఫిక్స్ అయిందని. అది ఎవరూ ఆపలేరు. వెళ్ళడానికి నేను సిద్ధంగా ఉన్నాను. ఇక పైవాళ్ళు పిలవడమే ఆలస్యం" అని నవ్వింది.

"నీకు నవ్వెలా వస్తోంది?" అన్నాను కోపంగా!

"చూడు కృష్ణా! అసలు కాన్సర్ ఎందుకు వస్తుందో తెలుసా? కొన్ని సమస్యలకు పరిష్కారం ఉండదు. అందుకు ఒకేసారి జీవితబంధం నుండి విముక్తం చేసేస్తే ఇక

ఏ సమస్యా ఉండదు. పరిష్కారం వెతకా ల్సిన పని ఉండదు" మళ్ళీ నవ్వింది.

"నీకు నవ్వులాటగా ఉంది గౌతమీ, నాకుమట్టుకు ఏడుపు వస్తోంది" అన్నాను.

"పోనీలే కృష్ణా! స్నేహితుడివి కదా! కాస్త ఉడికించాలని అనిపించింది. నాకు ఒక్క సాయం చేసిపెడతావా? " అంది ఆయాసపడుతూ..

"తప్పకుండా చెప్పు! ఏం కావాలి? "

"నాకు సంపెంగపూలు తెస్తావా? ఆ పూలు ఉంటే శ్రీరామ్ కూడా ఇక్కడే, నా పక్కనే ఉన్నట్లు ఉంటుంది. తనని చూడ లేకపోతున్నాను కదా" అంది.

ఆ రోజు నుండి తప్పకుండా సంపెంగ పూలు హాస్పిటల్‌కి పంపించేవాడిని.

పెద్దలు చేసిన పాపం పిల్లలని కొడు తుందని అంటారు కదా మనవాళ్లు. అన్యాయం అని తెలిసి కూడా ఆమె తండ్రి కేసులు వాదించి గెలిపించే వారని, వాళ్ళం దరి ఉసురే గౌతమికి తగిలిందని కొంత మంది లోపాయికారిగా అనుకున్నారు.

ఏది ఏమైనా హాయిగా, ఆనందంగా సాగిపోవలసిన గౌతమి జీవితం కష్టాలతో, బాధలతో ఆఖరికి అనారోగ్యం పాలయి నిండు జీవితం మధ్యలోనే ముగిసిపో యింది. ఇదంతా చూస్తూ బాధపడటం తప్ప ఏమీ చేయలేకపోయాం.

బలరాం, ఉషా ఇద్దరూ కూడా తమ శాయశక్తులా ప్రయత్నం చేశారు గౌతమిని బతికించడానికి.

ఎక్కడో సప్తసముద్రాల అవతల ఉన్న నీకు ఈ విషయాలన్నీ చెప్పటానికి సాహ సించలేదు. అందుకు గౌతమి అసలే ఒప్పు కోలేదు. నువ్వు చూడకపోవడమే నయ మైంది. నీ మనసులో ముద్రించుకున్న ఆనాటి గౌతమికి ఎముకల పోగులా ఉన్న ఈ గౌతమికి అస్సలు పోలికే లేదు. ఆ రూపం చూడలేకపోయేవాడివి. ఆ రోగం అలా తినేసింది.

ఏది ఏమైనా నువ్వు గౌతమి పక్కనే ఉన్నావురా శ్రీరామ్! ఎప్పుడూ తన ఆలో చనలలో, తన ఊపిరిలో మొత్తం నువ్వే! అందుకే చివరి క్షణాలలో కూడా ఏదో చెప్పడానికి ప్రయత్నం చేసింది.

"మాట ముద్దగా రావడం మూలాన అర్థం కాలేదు" అని నేను, బలరాం పుల్ల లాంటి తన చేతులు పట్టుకున్నాం.

ఒక్కసారి ఆ కళ్ళు మెరిసాయి. అంతే వెంటనే చేయి వేలాడిపోయింది. మొహం ఒక పక్కకి వాలిపోయింది. గౌతమి ఇక లేదు. నా కళ్ళలో నీళ్ళు కారిపోతున్నాయి. గీత వచ్చింది చూడాలని. చూసి దుఃఖం ఆపుకోలేకపోయింది. శాంతి, గీతని బయ టకు తీసుకుపోయింది.

ఇంకో విషయం! గౌతమి హాస్పిటల్‌లో చేరగానే, వాళ్ళ అమ్మగారిని, తను నడిపి స్తున్న ప్రశాంతివనంలో చేర్పించాడు బలరాం. ఆవిడ ఆల్మోస్ట్ బెడ్ రిడెన్ అయ్యారు. ఆఖరి చూపులు ఆవిడకి దక్కనే లేదు. అదే ఆవిడ గొడవపెట్టారు. ఇదిగో తనని ఇక్కడికే ఈ కైలాస భూమికే తెచ్చాం. ఇందాకా నువ్వు తిరి గావే అక్కడే అన్నీ జరిగాయి. ఇంక తన చివరి కోరిక తీర్చాలి కదా! పైకి చెప్పదు గానీ, తన కళ్ళు మటుకు నీ కోసం వెతు కుతుండేవి! అది గమనించాం నేను, బలరాం. అందుకోసమైనా నిన్ను ఇక్కడకి రప్పించాలనుకున్నాం.

గౌతమి మాకు ఒక పెద్ద బాధ్యత అప్ప జెప్పింది. అప్పుడు ఒక ఆలోచన వచ్చింది నాకు, బలరాంకి. ఓల్డ్ ఫ్రెండ్స్ మీట్ పెట్టుకొని వాడిని కూడా తప్పకుండా రమ్మ నమని చెబుదాం. గౌతమి రమ్మనమందని చెపితే, తప్పకుండా వస్తావు అనుకున్నాం.

అనుకున్నట్లుగా వచ్చావు. బలరాం వచ్చాకా ఇద్దరం కలిపి ఈ విషయం చెప్పాలని అనుకున్నాం. కానీ వాడు రేపటి దాకా రాలేదు. నువ్వేమో, ఎంతో ఆశతో

ఉన్నావు తనను చూడాలని. ఇంక నీకు చెప్పకపోతే మోసం చెయ్యడమే అని, చెప్పేశానురా!

నువ్వు వచ్చినప్పటికీ, నీకు గౌతమి గురించి ఎలా చెప్పాలో అర్థం కాక నా గుండె బద్దలవుతుందేమో అనిపించింది.

ఇన్ని రోజులు ఈ ఊరు రావడానికి ఇష్టపడని వాడివి మరి నీకు ఎందుకు అని పించిందో తెలియదు, లేక గౌతమి ఆత్మే నిన్ను రప్పించుకుందో గానీ, అది పూర్తిగా యాదృచ్ఛికం! ఆ తరువాత సంగతులు నీకు తెలుసున్నవే!" అంటూ చెప్పటం ముగించాడు కృష్ణ.




## శ్రీరామ్

ఒక్కసారిగా నిస్సత్తువ ఆవరించింది నాలో! అడుగు ముందుకు వేయబోయి తూలాను.

"ఆఁ! ఆఁ! జాగ్రత్త" అంటూ కృష్ణ వచ్చి పట్టుకున్నాడు. నెమ్మదిగా చేయి పట్టుకుని కారు వరకు నడిపించాడు. కారులో ఎక్కి కూర్చొని కళ్ళు మూసుకున్నాను.

కళ్ళ ముందు గతం కదలాడింది.

ప్లీడరు బదరీ నారాయణగారు మాకు చాలా దూరపు బంధువులు. అమ్మకి అన్నయ్య వరుసవుతారు. వాళ్ళ కుటుంబం గురించి అందరూ గొప్పగా చెప్పుకుంటారు. 'ప్లీడరుగారు నిగర్వి. నిరంతరం ఎవరో ఒకరికి సాయం చేస్తూనే ఉండేవారు. ఆయన ఆశ్రయం పొంది ఎంతో మంది బతుకుతున్నారు' అని.

దురదృష్టవశాత్తూ మా నాన్న పోవడంతో ఏ ఆధారం లేకుండా ఉన్న మమ్మల్ని ప్లీడరుగారు, వారి భార్య ఆదుకొని ఇంత నీడ నిచ్చారు. నిజంగా మా పట్ల దేవుడే ఆయన. మా సొంతవాళ్ళు ఎక్కడ మా బాధ్యత మోయాల్సి వస్తుందో అని మొహాలు చాటు చేశారు.

ఇప్పటికీ నేను మరచిపోలేను, మొట్టమొదటిసారి ఈ ఊరు వచ్చినప్పుడు చూసిన గౌతమిని.

ప్లీడరుగారి భార్య అన్నపూర్ణమ్మగారు నన్ను పరిచయం చేశారు. "ఇక నుంచి నువ్వు, శ్రీరామ్ జట్టుగా ఉండండి. ఈ అబ్బాయికి ఊరు కొత్త కదా! నీ స్నేహితులను పరిచయం చెయ్యి" అని చెప్పారు.

పెద్దకళ్ళు, గుండ్రటి ముఖం, పొడుగ్గా ఉంది. తనని చూడగానే ఎక్కడో, ఎప్పుడో చూసినట్లు, బాగా పరిచయం ఉన్నట్లు అనిపించింది. ప్రేమ, అభిమానం, ఇష్టం, కోపం అలాగే ద్వేషం ఇవన్నీ కూడా ఒకరి ప్రమేయం లేకుండా తనంతగా ఏర్పడే సహజమైన అనుభూతులు.

అందులో ప్రేమ, ఇష్టం గురించి చెప్పనే అక్కరలేదు. చూసిన వేళావిశేషం ఎలాంటిదో కానీ గౌతమితో విడదీయరాని బంధం ఏర్పడింది.

జీవరాశులకు ప్రాణం పోస్తూ ప్రవహించే నది గౌతమి. ఆ గోదావరిలానే ఒద్దికగా ప్రశాంతంగా, ముగ్ధ మనోహరంగా ఉండేది ఈ గౌతమి.

వాళ్ళది పెద్ద డాబా ఇల్లు. మేం వాళ్ళింటి వెనకాలే అవుట్ హౌస్‌లాంటి ఇంట్లో ఉండే వాళ్ళం.

మాకు, వాళ్ళకి అంతస్తులో చాలా తేడా! మొదటి నుంచి వాళ్ళ కుటుంబం జమిందారు ఫాయిదాలో ఉండేది. ఇంటి నిండా

నౌకర్లు, చుట్టాలు, పూజలు.. ఎప్పుడూ ఏదో ఒక కోలాహలం.

గౌతమి అంటే ప్లీడరుగారికి ప్రాణం. ఎప్పుడు బయట నుంచి వచ్చినా ముందు "అమ్మా గౌతమీ!" అని పిలిచే వారు. అలాగే పొద్దున్నే లేచినప్పుడు కూడా తప్ప కుండా గౌతమే కనిపించాలి. లేకపోతే ఆయనకి ఆ రోజు సరిగ్గా ఉండేది కాదు.

ఎప్పుడైనా కోపం వచ్చినప్పుడు మటుకు ఉగ్రగోదావరిని తలపించేది. అప్పుడు ప్లీడ రుగారు అనేవారు సరదాగా కూతురితో "అమ్మా గౌతమీ! నీ ఉగ్రరూపాన్ని ఉపసం హరించి, శాంత గౌతమి అయిపో తల్లీ"

రాజమండ్రిలో పుట్టకపోయినా గానీ ఇదే నా సొంత ఊరు అన్నంత ఆప్యా యత, అనుబంధం ఏర్పడ్డాయి.

బలరాంగాడు ప్లీడరుగారి గుమస్తా మా ధవయ్యగారి అబ్బాయి. కృష్ణ ఆ వీధిలో ఉండే రామస్వామిగారి అబ్బాయి. గౌతమి వాళ్ళని పరిచయం చేసింది 'ఇక నుంచి శ్రీరామ్ కూడా మన జట్టే' అని.

అప్పటి నుండి ముగ్గురం ప్రాణ స్నేహి తులయ్యాం. ముగ్గురం కలిసే తిరిగే వాళ్ళం. గౌతమికి, కృష్ణ చెల్లెలు గీతకి మేం అంగరక్షకులం! వాళ్ళని ఎవరూ ఏడి పించకుండా ఉండటానికి.

★ ★ ★

రోజూ సాయంత్రం ప్లీడరుగారితో ఆయన ఆఫీస్‌కి వెళ్ళి ఆ పక్కనే ఉన్న గోదారొడ్డుకి షికారు వెళ్లేవాళ్లం.

అక్కడున్న చీడీల మీద కూర్చొనేవాళ్లం. బోలెడన్ని కబుర్లు దొర్లేవి మా మధ్య. వానాకాలం వచ్చిందంటే గోదావరికి కొత్త నీరు వచ్చేది. వరదలు కూడా వచ్చేవి. పల్లపు ప్రాంతాలన్నీ నీటిమయం అయ్యేవి. ఆ ఎర్రటి వరద నీరు చూడటా నికి వెళ్ళేవాళ్ళం. అదో సరదా!

ముగ్గురం ఒక రోజున సైకిళ్ళ మీద గోదారొడ్డుకి వెళ్ళాం చూడ్డానికి. ఘాట్ మెట్లన్నీ మునిగిపోయాయి. అక్కడున్న శివాలయం కూడా మునిగిపోయింది. ఆ నీళ్ళలో పెద్దపాములు, కొండ చిలువలు కొట్టుకొని వచ్చేవి. ఎవడో అన్నాడు వెన కాల నుంచి "అదిగో! అదిగో! పాము" అని. దాన్ని చూడటం కోసం చిన్న తోపు లాట అయింది. ఆ హడావిడిలో మెట్ల మీద నించున్న బలరాం కాలుజారి పట్టు తప్పి దొర్లుకుంటూ కింద నీళ్ళలోకి పడిపో యాడు. వరద నీరు సుళ్ళు తిరుగుతూ ఉరకలేస్తోంది.

మాకు భయం వేసింది. "అయ్యో! నీళ్ళలో పడిపోయాడు" అని కృష్ణ గట్టిగా అరుస్తున్నాడు. మామూలుగా వాడికి నీళ్ళంటే భయం లేదు. కానీ ఆ రోజున వరద నీరు చూసేసరికి ఎందుకో భయం వేసింది. వాడు కొట్టుకుపోతున్నాడు. ఇక నేను ఏమీ ఆలోచించకుండా దూకేశాను.

వాడిని పట్టుకోవడానికి వెనకాలే ఈదు తున్నాను. వరద ప్రవాహం ముంచెత్తు తోంది. ఎవరివో కేకలు గట్టునుండి వినిపి స్తున్నాయి. "సుడిగుండం ఉంది జాగ్రత్త!" అంటున్నారు. ప్రవాహాన్ని ఎదురీదడం చాలా కష్టంగా ఉంది.

ఆ నీటి తాకిడికి ఉక్కిరిబిక్కిరి అవుతు న్నాను. శ్వాస పీల్చుకోవడం కష్టంగా ఉంది. కానీ కళ్ళ ముందు వాడు మునిగి పోతున్నాడు. ఎలా అయినా వాడిని అందుకోవాలి అని గట్టిగా అనుకుంటూ, ఎలాగో షర్ట్ కొసని అందిపుచ్చుకున్నాను.

ఈ వానా కాలంలో సముద్రం నుండి గోదావరి వరదనీటిలోకి ఎదురీదుతూ వచ్చే పులస చేపల వేటకి వచ్చిన చేపలు పట్టే వాళ్ళు మమ్మల్ని చూసి గబగబా నీళ్ళలోకి దూకి మా ఇద్దరినీ పట్టుకొని పడవలోకి ఎక్కించుకొని ఒడ్డు దగ్గర దింపారు.

అక్కడున్న వాళ్ళలో ఎవరో అంటు న్నారు "ముందు నీళ్ళు కక్కించండి!" అని.

ఇంకెవరో వచ్చి బలరాం పొట్టని గట్టిగా నొక్కి నీళ్ళని కక్కించారు.

ఈ గొడవంతా చూసిన మా స్నేహి తుల్లో ఎవరో వెళ్ళి మాధవయ్యగారికి 'మీ అబ్బాయి గోదార్లో పడిపోయాడు' అని చెప్పారు. అది విన్న ఆయన, ఆయనతో పాటు ప్లీడరుగారు కంగారు పడుతూ పరు గెత్తుకుంటూ వచ్చారు.

మాధవయ్యగారు కొడుకును దగ్గరకు తీసుకుని "ఎలా పడిపోయావ్? అసలేం జరిగింది? " అంటూ అడిగారు. వాడు భయంతో వణికిపోతున్నాడు. అప్పుడు కృష్ణ జరిగిందంతా పూసగుచ్చినట్టు చెప్పాడు.

వెంటనే ఆయన నా దగ్గరకు వచ్చి "చిన్నవాడివైనా నీకు దండం పెడుతు న్నాను. నీ మూలంగానే బతికాడు వాడు" అని అన్నారు.

ఆయన పొగుడుతుంటే సిగ్గేసింది.

ప్లీడరుగారు నా భుజం తట్టి "శభాష్! నీకు ఈత వచ్చునా? " అన్నారు.

తలూపి "మా ఊరి చెరువులో అప్పుడ ప్పుడు ఈత కొట్టేవాణ్ణి" అని చెప్పాను.

అప్పటికి పూర్తిగా తెలివిలోకి వచ్చిన బలరాంని పట్టుకొని నేను, కృష్ణ గట్టిగా ఏడ్చాం. అంతవరకు అచేతనంగా ఉన్న వాడు పూర్తి స్పృహలోకి వచ్చి "ఒరేయ్ శ్రీరామ్! ఇవాళ నువ్వు లేకపోతే చచ్చిపో యేవాడిని రా!" వెక్కుతూ అన్నాడు.

ఆ రోజు నుండి మా స్నేహం ఇంకా గట్టిపడి ముప్పేట బంధంలా పెనవేసుకు పోయి మహావృక్షంగా మారింది.

ఈ విషయాలు గౌతమికి చెబుతున్న ప్పుడు, నా ధైర్యం, తెగువ గురించి కృష్ణ, బలరాం పొగుడుతుంటే తన కళ్ళలో ఒక మెరుపును గమనించాను.

ప్లీడర్‌గారింటి పెరటి గోడనానుకొని ఒక ఆకు సంపెంగ చెట్టు ఉండేది. దాని పూలు, ఆకుల మధ్య దోబూచులాడుతుం డేవి. ఆ చెట్టు నుండి పూలు కోయడానికి భలే కష్టపడాల్సివచ్చేది. అయినా నా చేత్తో కోసి ఇవ్వకపోతే తృప్తి ఉండేది కాదు.

ఇచ్చిన వెంటనే అవి జడలో ఉండా ల్సిందే. ఏ ఒక్క రోజైనా కోసి ఇవ్వకపోతే కోపం కూడా వచ్చేసేది. అవి కోసి ఇవ్వక పోతే నాకూ రోజు గడిచేది కాదు.

కొమ్మల అంచుల్లో అందీ అందనట్టు దోబూచులాడుతున్న సంపెంగ మొగ్గలని చూస్తే బంగారు సంపెంగ లాంటి గౌతమి నాకు అందుతుందా అనిపించేది.

ప్రతి ఏడాది కార్తికమాసం నెల్లాళ్ళు గోదావరిలో స్నానం చెయ్యడం మాకు అలవాటయింది. తెల్లారగట్లే లేచి అమ్మ, ప్లీడరుగారి భార్య, ఇంకో ఇద్దరు ఆడ వాళ్ళూ, వాళ్ళకి సాయం నేను, గౌతమీ, కృష్ణ, గీత, బలరాం అందరం కలిసి గోదా వరి స్నానానికి వెళ్ళేవాళ్ళం.

కార్తిక దీపాలు వెలిగించడం కోసం పట్టుకొచ్చిన సరంజామాకి మమ్మల్ని కాప లాగా పెట్టి, వాళ్ళందరూ నదిలో దిగే వారు. వాళ్ళు బయటకు వచ్చాక మేం ముగ్గురం వెళ్ళేవాళ్ళం.

అంతవరకు గోదావరిమాత విగ్రహం దగ్గర కూర్చొని కబుర్లు చెప్పుకునే వాళ్ళం. అమ్మావాళ్ళు తడిబట్టలతోనే దీపాలు పెట్టుకునేవారు.

నీళ్ళంటే చాలు కృష్ణ ఒళ్ళు మర్చిపోయే వాడు. ఎక్కువసేపు నీళ్ళలో ఉండిపోయే వాడు. వెంటనే జలుబు చేసేసేది. ఎప్పు డూ తుమ్ముతూ ఉండేవాడు. వాళ్ళ అమ్మ తిట్టేది, 'అంతసేపు నీళ్ళలో నానకురా అంటే వినవు కదా' అని, అక్కడ స్నానాలు చేయడానికి బోలెడు మంది ఆడపిల్లలు వచ్చేవారు. వాళ్ళను చూస్తూ ఏదో ఒకటి అనేవాడు కృష్ణ. వాళ్ళ ముసిముసినవ్వులు గమనిస్తూ ఇంకా రెచ్చిపోయేవాడు.

అది కృష్ణ చెల్లెలు గీత కనిపెట్టి కసి రేది. అప్పటి నుంచి గీత చూడకుండా

ఏదో ఒకటి వాగుతూ ఉండేవాడు. లేదా వాళ్ళని చూసి పాటలు పాడే వాడు. నిజం చెప్పద్దూ! వాళ్ళు కూడా సరదా పడేవారు వీడి మాటలకి. ఆ చిలిపితనం, ఆ సరదా! భలే బావుండేది.

మేమందరం సాయంత్రం ఒక గంట సూర్యం మాస్టారు ఇంటి దగ్గర ట్యూషన్‌కి వెళ్ళే వాళ్ళం. తిరిగి ప్లీడరుగారి కారులో ఇంటికి వచ్చేవాళ్ళం.

జీవితం ఎప్పుడూ మనం అనుకున్నట్లుగా నడవదు. అలా అని ఆగదు కూడా! అదో స్రవంతి. సాగిపోతూనే ఉంటుంది. నేను గౌతమిని ఇష్టపడుతున్నట్లు ఒక రోజున కృష్ణకి, బలరాంకి చెప్పాను.

అప్పుడు వాళ్ళు "ఈ విషయం గౌతమికి తెలుసా!" అన్నారు.

"లేదు చెప్పలేదు. కానీ తను కూడా ఇష్ట పడుతోందని నాకు తెలుసు. అయినా అమ్మాయిలు డైరెక్ట్‌గా చెప్పరు. మనం అర్థం చేసుకోవాలంతే" అన్నాను.

అయితే సంపెంగ చెట్టు దగ్గర తనే నన్ను ముద్దు పెట్టుకున్న విషయం చెప్ప లేదు. అది నాకు, గౌతమికి మధ్య మాత్రమే ఉండాలని దాచేశాను.

ఊర్లో ఎన్నో సినిమా షూటింగ్‌లు జరి గేవి. స్నేహితులందరం పోలోమంటూ చూడటానికి వెళ్ళేవాళ్ళం. అలా ఓ సారి ధవళేశ్వరం ఆనకట్ట దగ్గర షూటింగ్ చూడటానికి వెళ్ళినప్పుడు ఆ తోపులాటలో అక్కడ నీళ్ళలో పడిపోయాను.

అప్పుడు గౌతమి కంగారు, చూపించిన ఆత్మీయత, అనురాగం నాలో ఏవో తెలి యని తీయని భావనలు కలిగించాయి.

ఒక దేవతని భక్తుడు ఎంత ఆరాధి స్తాడో అంతకంటే ఎక్కువ ఆరాధించాను. నా ఆలోచనలన్నీ కూడా గౌతమి చుట్టూ అల్లుకునేవి.

నాకు పుస్తకాలంటే ఇష్టం, గౌతమికి కూడా అంతే! ఇద్దరం కూడా తిలక్, చలం, అడవి బాపిరాజు, కొమ్మూరి, లత, శరత్, అజంతా, బైరాగి- వీళ్ళందర్నీ ఇష్టపడే వాళ్ళం. పుస్తకాలు చదవడం ఎంత ఇష్టమో వాటిని చర్చించుకోవడం ఇంకా ఇంకా ఇష్టంగా ఉండేది. అప్పుడప్పుడు మంచి మూడ్‌లో ఉన్నప్పుడు ప్లీడరుగారు మాకు ఇంగ్లీష్ రైటర్స్ రాసిన కథల గురించి చెప్పేవారు. అవి వింటూ ఏవో లోకాల్లో తేలిపోతూ, వాటి గురించి తెగ ఊహించుకునే వాళ్లం.

బాలచందర్ సినిమా 'ఇది కథ కాదు' చూసొచ్చి, ఇద్దరం తెగ వాదులాడుకునే వాళ్లం. తనేమో శరత్‌బాబు ప్రేమ గొప్ప దని అనేది. నేను మటుకు కమల్‌హాసన్ ఆరాధన గొప్పదని వాదించేవాణ్ణి.

★ ★ ★

అనుకోకుండా నా జీవితం అనూహ్య మైన మలుపు తిరిగింది.

అమ్మకి ఆస్తమా ముదిరిపోయింది. దగ్గు, ఆయాసం ఎక్కువయ్యాయి. ఓ రోజున ఉన్నట్టుండి ఊపిరి తీసుకోలేకపో తోంది.

ప్లీడరుగారు స్వయంగా వాళ్ళ కారులో ఆసుపత్రికి తీసికెళ్ళారు. లాభం లేకపో యింది. అమ్మ పోయిందని చెప్పేశారు. అన్ని కార్యక్రమాలూ ఆయన దగ్గరుండి జరి పించారు. అమ్మ తప్ప మరే బంధం తెలి యని నాకు అమ్మ లేకపోవడం అనేది

## కొత్తగాలి...

**ఆర్థిక శాస్త్రం**
**ఎంత తెలిసి ఉన్నా**
**సంపాదించే మార్గం**
**తెలియకుంటే సున్నా!**

– పి.వి. రమణకుమార్,
చిలకలూరిపేట, గుంటూరు జిల్లా

ఊహించలేకపోయాను. తిండి సహించేది కాదు. నాన్న పోయిన తరువాత అమ్మ పడ్డ కష్టం తలచుకుంటే దుఃఖం ముంచుకు వస్తోంది.

అమ్మతో అనే వాడిని "అమ్మా! నాకు సిగ్గుగా ఉంది. తొందరగా చదువు పూర్తి చేసి, ఉద్యోగం చేసి నిన్ను నేను జాగ్రత్తగా చూసుకుంటాను" అని.

అమ్మ పోవడం నాకు తీరని లోటు.

అంతవరకు అమ్మచాటున ఉన్న నేను ఒక్కసారిగా ఒడ్డున పడ్డ చేపలా గిలగిల లాడాను. ఎలా ఎదుర్కోవాలో తెలియ లేదు. బలరాం, కృష్ణ ఇద్దరూ కూడా ఆ సమయంలో నా తోడుగా ఉన్నారు. ఇంక గౌతమి నా వెన్నంటే ఉండి, ఆ దుఃఖం నుండి తేరుకునేలా చేసింది. అమ్మలేని లోటు కనిపిస్తున్న జీవితం మటుకు సాగి పోతోంది. నిజమే ఏది ఆగదు.

★ ★ ★

రోజులు త్వరత్వరగా గడిచిపోతు న్నాయి. చదువయ్యాక ఉద్యోగం చూసుకో వాలి. ఇంతవరకు భవిష్యత్ గురించి పెద్దగా ఆలోచన రాలేదు. బలరాం మెడి సిన్ చెయ్యడానికి కాకినాడ వెళ్ళాడు. నేను, కృష్ణ కాలేజీలో జాయిన్ అయ్యాం. గౌతమీ, ఉమా ఉమెన్స్ కాలేజీలో చేరారు.

మనిషి అన్నాక ఏదో ఒక బలహీనత ఉంటుంది. అలాగే ప్లీడరుగారికి నాటకాలు వేయడం ఒక వ్యసనం. సాహిత్యమన్నా కూడా చాలా అభిమానం. ఆయన పద్య నాటకాలలో హరిశ్చంద్ర బాగా పేరు తెచ్చింది. సాంఘిక నాటకాలలో 'కీర్తిశేషు లు'లోని మురారి పాత్రకు కూడా బాగా పేరు వచ్చింది.

కానీ బలహీనతల వల్లే వాళ్ళ జీవితాలు తల్లకిందులయ్యాయని తరువాత అర్థమ యింది నాకు. ఒకసారి ఆయన నాటకం చూడటానికి రమ్మన్నారు. నేను, గౌతమి, కృష్ణ, గీత వెళ్ళి కూర్చొన్నాం. నాటకం మొదలయింది.

అప్పుడే కాటికాపరి సీను మొదల యింది. హరిశ్చంద్రుడు కాటికాపరి వేషంలో స్టేజి మీదకి వచ్చాడు. ప్లీడరు గారు భలే గంభీరంగా వున్నారు. ఆయనకి కాటికాపరి వేషం బాగా నప్పింది. గొంతెత్తి పద్యం పాడుతూవుంటే ఎంత శ్రావ్యంగా వుందో! అందరూ చప్పట్లు కొట్టి 'వన్స్ మోర్' అని అరిచారు. మళ్ళీ పద్యం అందుకున్నారు.

ఈసారి భావం పూర్తిగా అర్థమైంది. కాటికాపరి జీవితం సాగిస్తున్న హరిశ్చం ద్రుడు శ్మశానంతో తిరుగుతూ "ఎంత విచి త్రమైంది ఈ జీవితం, మహారాజు కానీ, బిచ్చగాడు కానీ, చదువుకున్నవాడు కానీ, చదువులేనివాడు గానీ అందరూ రావలి సన చోటు ఇదే కదా!" అని నిత్యం శవాల మధ్య జీవనాన్ని సాగిస్తున్న అంతటి చక్ర వర్తి వైరాగ్యంతో జీవిత సత్యాన్ని చెబుతూ 'మాయామేయ జగంబే' అంటూ పద్యం అందుకున్నాడు.

ఆ పద్యంలోని వేదాంతం ఎంత బాగా వుందో! అది వర్ణనాతీతం! గంభీరమైన స్వరం! భాష మీద పట్టు! పదాలు పలక డంలో స్పష్టత! ఓహ్! వింటుంటే ఒళ్లు పులకరించిపోతోంది.

అందరం ఆ నాటకంలో లీనమయ్యాం. కొంచెంసేపు తరువాత అందరూ చప్పట్లు కొట్టి 'వన్స్‌మోర్' అంటుంటే ఆ అనుభూతి నుండి తేరుకున్నాం.

గౌతమి అయితే 'నాన్న ఎంత బాగా చేశారో' అంటూ తెగ మురిసిపోయింది.

"పద! పద! నాన్నని పలకరిద్దాం!" అంటూ గ్రీన్‌రూమ్ దగ్గరకు తీసుకెళ్ళింది.

ప్లీడరుగారు ఇంకా ఆ వేషంలోనే ఉన్నారు. అక్కడంతా ఎవరెవరో ఉన్నారు. వాళ్లతో మాట్లాడుతున్నారు. అదంతా వేరే ప్రపంచంలా ఉంది.

గౌతమి ఆయన దగ్గరకు వెళ్ళి "నాన్నా!

# నల్లులా? మజాకా?

ఇంట్లో నల్లులుంటే బాబోయ్! ఆ బాధ పరమాత్ముడికే ఎరుక!

మంచాలలో, పక్కబట్టలలో, కుర్చీల సందులలో ఎక్కడబడితే అక్కడ నక్కి రక్తం పీలుస్తూ మనశ్శాంతి లేకుండా చేస్తాయి.

రాత్రివేళ నిద్రకు దూరం చేస్తాయి. పుట్లకొద్దీ గుడ్లుపెట్టి నాలిగింటిని చంపితే నలభై పుట్టుకొస్తూ నరకం చూపుతాయవి.

దేవుళ్లు ఈ నల్లుల బాధ తప్పించుకోడానికి ఏం చేశారో తెలుసా అంటూ ఒక మహానుభావుడు ఎంత చక్కటి పద్యం చెప్పాడో చూడండి!

**శివుడద్రిని నివసించుట**
**రవిచంద్రులు మింట నుంట రాజీవాక్షుం**
**డవిరళముగ శేషునిపై**
**పవళించుట నల్లిబాధ పడలేక సుమీ!**



శివుడు అతి శీతలమైన హిమగిరిపై నివసించడం, సూర్యచంద్రులు అందని ఎత్తులో ఆకాశంలోనే ఉండడం,
కమలాలవంటి కన్నులు గల శ్రీమహావిష్ణువు వేయి తలల ఆదిశేషుడిపై పడుకోవడం ఇదంతా ఎందుకంటారు?
ఇంకెందుకు? నల్లి బాధ పడలేకనే సుమా అంటూ చమత్కరించాడాయన.

సేకరణ: చంద్రప్రతాప్

చాలా బాగా చేశావు" అని అంది.

"థాంక్స్ రా! తల్లీ!" అని "నేను రావడానికి లేట్ అవుతుంది. మీరు ఇంటికి వెళ్ళిపోండి" అన్నారు.

ఒక్కక్షణం గౌతమి మొహం చిన్నబోయింది. కానీ వెంటనే సర్దుకొని "సరే నాన్నా!" అని బయటకు వచ్చేసింది.

మేం అందరం కలిసి ఇంటికి వచ్చేశాం.

ప్లీడరుగారి భార్యకు ఆయన నాటకాలు వేయడం అస్సలు ఇష్టం ఉండేది కాదు. కానీ ఆవిడ మాట ఎప్పుడూ లక్ష్యపెట్టలేదు ఆయన.

అందుకే కాబోలు ప్లీడరుగారి భార్య "వదినా! అసలు ఈ నాటకాల సావాసాల వల్లే ఆయన ఇంటిపట్టున ఉండటం లేదు" అంటూ అమ్మ ఉన్నప్పుడు చెప్పుకొని బాధపడటం నేను చూశాను చాలాసార్లు.

ప్లీడరుగా ఆయన రెండు చేతులా బాగా సంపాదించినా, దాచుకోవడం అనేది తెలియదు. అడిగిన వాళ్ళకి లేదనకుండా ఇచ్చేవారు. ఆయనలో ఉన్న బలహీనతను, వ్యసనాన్ని అవతలి వాళ్ళు చాలా నేర్పుగా ఉపయోగించుకునేవారు. అది ఆయన గుర్తించేవారు కాదు.

కూతురంటే పంచప్రాణాలు. నాటకాల కోసం ఎన్ని ఊళ్ళు తిరిగినా వచ్చిన వెంటనే ఆయనకి కూతురు కనిపించాలి.

"నా తల్లిని విడిచి నేనుండలేను" అనేవారు ఆయన.

అది విన్నప్పుడల్లా అన్నపూర్ణమ్మగారు "రేపు పెళ్లి చేసి అత్తవారింటికి పంపాలి తెలుసా? " అనేవారు.

"ఎందుకే అల్లుడినే మనింటికి రప్పించుకుందాం" అనేవారు సరదాగా.

ఆ మాటలు వింటున్న నాకు 'గౌతమికి పెళ్ళా!' అనిపించి అదేదో అప్రియమైన సంగతి విన్నట్లు, బాధపడిపోయాను.

★ ★ ★

నేను జిల్లాస్థాయి ఫుట్‌బాల్ పోటీల కోసం వైజాగ్ వెళ్ళాను. అక్కడ మా టీం ఫైనల్స్‌కి వచ్చింది. ఆ మరునాడు ఫైనల్స్. మాకు, వైజాగ్ జట్టుకి పోటీ హోరాహోరీగా నడిచింది.

ఆఖరిక్షణం వరకు టెన్షన్ ఎవరు గెలుస్తారని? చివరిలో నేనే కొట్టాను గోల్. మా జట్టే గెలిచింది. మా జట్టుకే బహుమతి వచ్చింది. మా కోచ్‌తో సహా అందరూ నన్ను అభినందనలతో ముంచెత్తారు. అప్పటికప్పుడు పరిగెత్తుకొని వెళ్లి గౌతమికి ఈ విషయం చెప్పేయాలనిపించింది. కానీ అది వీలుకాదు. అప్పటికే అందరం అరకు, భీమ్లీ ప్రోగ్రాం వేసుకున్నాం. నేను వెళ్ళిపోతానంటే 'వీల్లేదు, జట్టు అందరం కలిసి వచ్చాం. అందరం కలిసే వెళ్ళాలి. లేకపోతే నా ఉద్యోగం పోతుంది' అని మా కోచ్ స్ట్రిక్ట్‌గా చెప్పాడు. అంటే ఇంకా రెండు రోజులు పడుతుంది. అసలే అందరూ గెలిచిన సంతోషంలో ఉన్నారు. ఇక చేసేదేమీ లేక ఊరుకున్నాను.

అరకులోయ అందాలూ, బొర్రా గుహలు, చాపరాయి జలపాతాలు, అలాగే భీమ్లీ బీచ్, రామకృష్ణా బీచ్ అన్నీ చూసుకొని బయలుదేరాం.

ఎంతో ఆనందంగా ఇంట్లోకి వెళ్ళబోతుండగా ఏవో మాటలు వినిపించాయి. అందులో నా పేరు రావడంతో ఒక్క నిమిషం ఆగాను.

అన్నపూర్ణమ్మగారు నెమ్మదిగా ప్లీడరుగారితో అంటున్నారు. "ఈ రోజైనా నా మాట శ్రద్ధగా వింటారా! నాకెందుకో పెళ్లీడుకొచ్చిన పిల్లని ఎదురుగా పెట్టుకొని, ఆ శ్రీరామ్‌ని ఇంట్లో ఉంచుకోవడం ఇష్టం లేదు. దేనికైనా సమాన ఫాయిదా కావాలి. అదీకాక ఎదిగిన ఆడపిల్లతో అస్తమానూ బయటకి పోవడాలు, సినిమాలు, షికార్లు, అర్ధరాత్రి వరకు కబుర్లు.. పిల్ల నొచ్చుకుంటుందని ఊరుకున్నాను. ఎంతకాలం

అ
క్ష
రం

ఒక మనిషి గొప్పతనం
అతని మెదడులో కాదు
హృదయంలో ఉంటుంది

– మహాత్మాగాంధీ



సహిస్తాం. ఇక చాలు! అయినా పై చదువులు చదివించాలంటే కష్టం కదా! మనకీ వెసులుబాటు అవ్వాలి. ముందు అమ్మాయి పెళ్లి చెయ్యాలి. బోలెడు ఖర్చులూ అవీ ఉంటాయి కాబట్టి, ఆ అబ్బాయిని వాళ్ల నాన్న తరపు బంధువులు ఆ మధ్య మీకు కనిపించారని అన్నారు కదా! వాళ్లింటికి పంపేయండి" అని అన్నారు.

"ఇప్పుడు బావుంటుందా చెబితే? అసలే తల్లి కూడా పోయింది"

"అందుకే అంటున్నాను.. ఆ పిల్లాడు మనింట్లో ఉండటం బాగోదని! మీ కేసులు, నాటకాలు తప్ప ఇంట్లో ఏం జరుగుతోందో మీరసలు పట్టించుకోరు. ఆడదాన్ని ఎన్ని చూసుకుంటాను? మొన్న అర్ధరాత్రి వరకు ఇద్దరూ ఆ సంపెంగ చెట్టు కింద కూర్చొని కబుర్లు! ఆ తరువాత ఏమనుకొని ఏం లాభం? అందుకే మన జాగ్రత్తలో మనం ఉండటం మంచిది"

"అవునే! నువ్వు చెప్పింది నిజమే! మొన్నామధ్య వైజాగ్ వెళ్ళినప్పుడు నరసింహం పినతండ్రి అల్లుడు కనిపించాడు. అతని బావమరిది కలకత్తాలో రైల్వేస్‌లో చేస్తున్నాడట! వాళ్ళు ఎప్పటి నుంచో అక్కడే స్థిరపడ్డారట! అతనోసారి అడిగాడట కూడా. నరసింహం అన్నయ్య కొడుకు ఎక్కడ ఉంటున్నాడని? వాకబు చేశాడట!"

"మరి ఇంకేం! అతనికి ఉత్తరం రాసి శ్రీరామ్‌ని అక్కడకు పంపించండి. పెత్తండ్రి మనవడికేదో ఒక దారి చూపించకపోడు. అయినా, వాళ్ళు ఆ మాత్రం ఆధారం చూపించకపోతే ఎలా? " అని కూడా అన్నారావిడ.

"అలాగేనే! ఆ వైజాగ్ ఆయన ద్వారా నేను కలకత్తా ఆయనకి ఉత్తరం రాయడమో లేదా ఫోన్ చేసి మాట్లాడటమో చేస్తాను. ఓసారి గౌతమికి కూడా చెబుదాం!"

"అయ్యో! దానికి ఎందుకండీ చెప్పడం? చిన్నపిల్ల! అయినా అప్పుడు ఏదో కష్టంలో ఉన్నారని ఇంట్లోకి తెచ్చి పెట్టుకున్నాం. ఎప్పుడూ అంటే ఎలా కుదురుతుంది? మనం కూడా చూసుకోవద్దూ!" అన్న ఆవిడ మాటలతో..

నేను ఆ ఇంట్లో ఎంత పరాయి వాడినో అర్థమయింది. అదీగాక నేను గౌతమిని ఇష్టపడటం ఆవిడకి నచ్చలేదని తెలుస్తోంది. వాళ్లింట్లో ఉండి, వాళ్ళ ఉప్పు తింటూ, వాళ్ళకి ఇష్టం లేని పని చేయటం మంచిది కాదని లోలోపల నుండి మనసు హెచ్చరిస్తోంది.

గెలిచిన సంతోషం కాస్తా ఆవిరయిపోయింది. అందుకే గౌతమికి కనిపించకుండా చేతిలో బాగ్ ఇంట్లో పడేసి ఆవేశంగా నడుచుకుంటూ గోదారొడ్డుకి వెళ్ళిపోయాను. ఆ రోజెందుకో నా మనసు లాగే గోదారి కూడా సుళ్ళు తిరుగుతోంది.

గౌతమిని తలచుకుంటూ నీళ్లలోకి దూకేశాను. ఈత వచ్చుగనక తెలియకుండానే ఈదుతూ పైకి వచ్చేశాను. అలా ఎన్నిసార్లు చేసినా ఆ గోదావరి మాత నన్ను తనలో కలుపుకోను అన్నట్లుగా పైకి తోసేస్తోంది.

అప్పటివరకు గోదావరిలో పడి చచ్చిపో

దామన్న కోరిక ఒక్కసారిగా రివ్వున ఎగిరి పోయింది. ఆవేశం చల్లారి, వివేకం ఆలోచించమంది.

నిజమే కదా! వాళ్ల దృష్టి కోణం నుంచి చూస్తే ఆవిడ ఆ విధంగా మాట్లాడటం సబబే అనిపించింది. పూటకు ఠికాణా లేని వాణ్ణి. పూర్తిగా జీవితంలో స్థిరపడనివాణ్ణి. నాకు గౌతమినిచ్చి ఎలా పెళ్లి చేస్తారు?

ఈ వాస్తవం తెలుసుకోకుండా గౌతమిని కోరుకునే హక్కు లేదనిపించింది. ఒక తల్లిగా ఆవిడ అనుకోవడంలో తప్పులేదు. అందుకే ఆ తెలియని బాబాయి ఇంటికి వెళ్ళడానికి మానసికంగా సిద్ధంకాసాగాను.

ఆయన గురించి అమ్మ ఎప్పుడో ఒకటి రెండుసార్లు చెప్పింది. అప్పుడప్పుడు మా ఊరు వచ్చేవారట! అమ్మ కూడా ఆయన పేరు వినడం తప్ప ఎప్పుడూ చూడలేదట! ఇక నాకు అయితే అస్సలు తెలీదు.

ఎంత దాచుదామన్నా మనసులో భావాలు తెలియకుండానే ముఖంలో ప్రతిబింబిస్తాయి కాబోలు! మరునాడు పొద్దునే గౌతమి అడగనే అడిగింది. "ఏమయింది? ఎందుకలా ఉన్నావు? మీ అమ్మగారు గుర్తుకొచ్చారా? మీ టీం గెలిచిందా? అలా దేవదాసు ఫోజులో ఉన్నావేంటి? " అంటూ ప్రశ్నల వర్షం కురిపించింది.

దేనికీ నేను సమాధానం చెప్పలేదు.

ఆ రోజంతా తనని తప్పించుకొని తిరిగాను. కాకినాడ నుంచి బలరాం వచ్చాడు. ముగ్గురం గోదావరి బండ్ దగ్గర కలుసుకున్నప్పుడు వాళ్ళకి ఈ సంగతి చెప్పాను.

దానికి వాళ్ళిద్దరూ "అదేంటిరా! నువ్వు ఎక్కడికి వెళ్తావు చదువు మానేసి? మేం సాయం చేస్తాం!" అన్నారు.

కృష్ణ అయితే "మా ఇంట్లో ఉందువు గాని, మా నాన్నకు చెబుతాను!" అన్నాడు.

"అయినా ప్లీడరుగారు ఇలా చేశారేంటిరా? " అంటూ బాధపడ్డారు.

అంతేకాదు "గౌతమిని పిలిచి మాట్లాడతాం" అని కూడా అన్నారు.

నేనే వాళ్ళను ఆపాను. "ఏమని మాట్లాడతారు? ఒక్కసారి ప్రాక్టికల్‌గా ఆలోచించండి! నేను ఏ అర్హతతో ఆమెని కోరుకుంటున్నాను? అన్నదానికి సమాధానం లేదు. ఇప్పుడు పిలిచి ఏం మాట్లాడతారు? జరిగేది జరగనివ్వండి" అన్నాను.

"అదే అందరికీ మంచిది. అయితే ఒక్కటి చెబుతున్నాను. ఇంకెప్పటికీ ఈ ఊరు మటుకు రాను!" అని చెప్పేశాను.

"అదేంటిరా? అలా చెయ్యకు!" అన్నారు వాళ్లు.

నేను ససేమిరా ఒప్పుకోలేదు.

ఆ రోజు రాత్రి గౌతమి నా రూమ్ దగ్గరకు వచ్చి "నీతో మాట్లాడాలి రా!" అంటూ నన్ను పిలిచింది.

నేను ఏం మాట్లాడలేదు. అక్కడ నుంచి కదల్లేదు. తను సంపెంగ చెట్టు పక్కన ఉన్న బల్లమీద కూర్చుంది.

రాత్రి కావడంతో ఉండుండి వీచేగాలి, అదీ సంపెంగ పూల పరిమళంతో కలిసి చల్లగా తాకుతూంటే ఏదో తెలియని పరవశం కలిగింది. గదిలోంచి ఎలా వెళ్ళానో తెలియదు. గౌతమి పక్కనే కూర్చుని రెండు చేతులతో దగ్గరగా తీసుకున్నాను.

ఆ క్షణంలో నాలో అంత ధైర్యం ఎలా వచ్చిందో తెలియదు. మొహం మీద పడుతున్న జుట్టుని పక్కకు తోసి ముద్దుపెట్టుకున్నాను. వెంటనే నా చెంప చెళ్లుమంది "ఛీ! నువ్వు కూడా అందరిలాంటివాడివే!" అంటూ వెళ్ళిపోబోయింది.

అప్పటికిగాని నా తప్పు తెలియలేదు.

కానీ తన మొహంలో కనిపించిన ఆ భావం అర్థం చేసుకోలేపోయాను 'నువ్వా! ఇలా చేశావు? అని నమ్మలేనట్లుగా, విస్తుపోతున్నట్లుగా ఉంది ఆ చూపు!

అక్కడ నుంచి వెళ్ళిపోతుంటే చెయ్యిపట్టి ఆపి, "క్షమించు గౌతమీ! తొందరపడ్డాను. ప్లీజ్! వెళ్లిపోకు. ఎలాగూ రెండు రోజుల్లో

ఈ ఊరినించే కాదు.. ఇక్కడ్నుంచి, శాశ్వతంగా నీ నుంచే వెళ్ళిపోతున్నాను" అని ప్రాధేయపడ్డాను.

"అదికాదు శ్రీరామ్! అర్ధరాత్రి ఆడపిల్ల కనిపించగానే.. అందుకే వచ్చినట్లు.. నువ్వు కూడా.. అందరిలాంటివాడివేనని బాధగా ఉంది"

"లేదు గౌతమీ! నన్ను నమ్ము! ఇంక జీవితంలో నిన్ను చూడలేను అన్న బాధ, నిరాశతోపాటు, నువ్వు నా పక్కనే ఉండటంతో ఒక్కక్షణం అన్నీ మర్చిపోయాను. నువ్వు.. నేను.. అంతే తప్ప నాలో ఎటువంటి చెడు ఉద్దేశంలేదు" అన్నాను.

అయినా! వినలేదు వెళ్ళిపోయింది.

★ ★ ★

రెండు రోజుల తరువాత "మీ బాబాయ్ కలకత్తాలో ఉన్నాడు. అతనితో మాట్లాడాను. నాకు పరిచయస్తుడే. రైల్వేస్‌లో పనిచేస్తున్నాడు. అక్కడకి నిన్ను పంపించమన్నారు. చదువు మధ్యలో పోతుందని బాధపడకు! అతను అన్ని ఏర్పాట్లు చేస్తానని చెప్పాడు" అన్నారు ప్లీడరుగారు.

సరే అని తలూపాను.

"ఆయన స్టేషన్‌కి వస్తాడు. అతని పేరు మిత్రానో.. ఏదో! నాకు 'బుజ్జి' అనే తెలుసు. ఇదిగో! ఈ ఫోన్ నెంబరు, అడ్రెస్ పెట్టుకో!" అని కాగితం రాసి ఇచ్చారు.

ఏమైతేనేం? మొత్తానికి ఇక్కడ నుండి నా మజిలీ వేరే చోటుకు మారబోతోంది.

వెళ్ళే ముందు ప్లీడరుగారికి, అన్నపూర్ణమ్మగారికి, కృతజ్ఞతలు చెప్పి వాళ్ళ ఆశీర్వాదం తీసుకున్నాను.

మేం ఎప్పుడూ కబుర్లు చెప్పుకునే సంపెంగ చెట్టు పక్కన ఉన్న సిమెంట్ చప్టా దగ్గర నిలుచున్న గౌతమికి ఎన్నోచెప్పాలని అనుకున్నాను. కానీ ఆ రోజున చేసిన పనికి సిగ్గుతో నోటి నుంచి మాటే పెగల్లేదు. నేను వెళుతుంటే వీడ్కోలు చెప్పడానికి వచ్చింది. అదిచాలు! నా తొందరపాటును అర్థం చేసుకుంది. దానికే సంతోషపడ్డాను.

తనే నా దగ్గరకు వచ్చి "శ్రీరామ్! ఇది

## ఇదే నా తొలి నవల !



మణి వడ్లమాని

చిన్నప్పటి నుంచీ మా నాన్నగారు, అమ్మగారి ద్వారా పుస్తకాలు చదవడం అలవాటైంది. నాన్నగారికి ప్రముఖ సాహితీవేత్తలతో పరిచయం ఉండేది. ఆ విధంగా కథ, నవలా సాహిత్యం పట్ల అభిలాష పెరిగింది. వివాహానంతరం శ్రీవారి వల్ల, అమ్మలాంటి అత్తగారి తోడ్పాటుతో నా సాహిత్యాభిలాష నిర్విఘ్నంగా కొనసాగుతోంది.

ముప్పై ఐదేళ్ల నుండి హైదరాబాద్‌లోనే నివాసం. 2010లో స్వచ్ఛంద పదవీవిరమణ చేసి ఉద్యోగానికి స్వస్తి పలికాను. మూడేళ్లుగా కథలు రాస్తున్నాను. ఇప్పటిదాకా దాదాపు ముప్పై కథలు రాశాను. తొలి కథ 'కౌముది' అంతర్జాల మాసపత్రిలో ప్రచురితమైంది. ఆ తరువాత 'విపుల'తో పాటు అనేక వార, మాస పత్రికల్లో, వెబ్ సైట్లలో కథలు ప్రచురితమయ్యాయి. గో తెలుగు.కామ్, ఫేస్‌బుక్, ఆటా వారు నిర్వహించిన పోటీల్లో నా కథలకు పురస్కారాలు లభించాయి.

నా తొలినవల ప్రచురించినందుకు 'చతుర' సంపాదక వర్గానికి ప్రత్యేక ధన్యవాదాలు!

చిరునామా :
మణి వడ్లమాని
2-2-185/53/3/ఎ
13వ వీధి, సోమసుందర్ నగర్
బాగ్‌అంబర్‌పేట
హైదరాబాదు - 500082

నీ దగ్గర ఉంచు!" అని ఒక పుస్తకం ఇచ్చింది.

ఆ కళ్ళలో ఏదో ఒక గమ్మత్తయిన భావం కనిపించింది. నావైపు చూసిన చూపులో ఏదో అంతరార్థం ఉంది. మాట చెప్పలేనిది మౌనం చెబుతుంది. ఆ కళ్ళలో కనిపించే భావం ఏమిటది? అని ఆలోచనలో పడ్డాను.

రైల్లో కూర్చొని ఆమె ఇచ్చిన పుస్తకం తెరచి చూశాను. ఏదో రాసి ఉంటుంది, మా ఇద్దరి గురించి అనుకున్న నాకు అన్నీ తెల్లకాగితాలే కనిపించడంతో నిరాశపడ్డాను. ఆ ఖాళీ పుస్తకం ఎందుకు ఇచ్చిందో? ఇంక మా మధ్య ఏమీ ఉండదు అన్నదానికి సంకేతమా? లేకపోతే నా మనసు కూడా అలా స్వచ్ఛంగా, తెల్లగా ఉండాలనా? ఏమో? విడిపోవటం ఒక బాధ అయితే, శాశ్వతంగా వెళ్లే ముందు తన మనసులో ఒక దోషిగా నిలబడ్డానని ఇంకో బాధ! ఇలా ఆశలు, నిరాశలు, బాధలు, సంతోషాలు, విడిపోవటాలు, కలవటాలు అన్నీ కలగలపి మోసుకుంటూ రైలు సాగిపోతోంది.

అదే గౌతమిని చివరిసారి చూడడం.

★ ★ ★

"శ్రీరామ్! దిగు.. ఇల్లు వచ్చేసింది" అన్న మాటలతో ఉలిక్కిపడి, గతం నుంచి వాస్తవంలోకి వచ్చాను. ఒక్కసారిగా నా కళ్ళముందు ఆ పాతరోజులు కదలాడేసరికి, నేను కూడా వెనక్కి వెళ్ళిపోయాను.

అదే నిజం అన్నంత భ్రమ కలిగింది కొద్దిసేపు. కారులోంచి దిగి ఇంట్లోకి వెళ్ళాను. సరాసరి నా రూమ్‌లోకి వెళ్ళి అక్కడున్న కుర్చీలో కూర్చున్నాను. చాలారోజుల తర్వాత సిగరెట్టు తాగాలనిపించింది. కృష్ణ నా వెనకాలే పైకి వచ్చాడు. వెంట శాంతి కాఫీ తీసుకొని వచ్చింది. తల భారంగా ఉంది. కాఫీ తాగుతూ అన్నాను "కృష్ణా! గౌతమి డైరీ ఇవ్వు"

"అప్పుడే ఎందుకురా! కాసేపు రెస్టు తీసుకో" అన్నాడు.

"లేదు లేదు ఇప్పటికే ఆలస్యం అయింది. అది ఇప్పుడే చదవాలి. నన్ను కాసేపు ఒంటరిగా వదిలేయి రా! చాలా బాధగా ఉంది" అన్నాను. దుఃఖంతో నా గొంతు వణికింది.

వాడు మారు మాట్లాడకుండా మౌనంగా నా చేతిలో డైరీ పెట్టాడు. శాంతి, వాడు తర్వాత వెళ్ళిపోయారు.

అది పట్టుకోగానే నాలో ఏవో ప్రకంపనలు. అందరూ హాయిగా నిదురించే వేళ.. ఈ ప్రపంచాన్నే విడిచి దూరతీరాలకి వెళ్ళిపోయిన గౌతమి అంతరంగాన్ని ఆవిష్కరించే డైరీ నా చేతిలో.

వణుకుతున్న చేతులతో తెరిచాను. డైరీ మొదట్లో ఒక ఎండిన సంపెంగ పువ్వు తొడిమ ఉంది. అది పట్టుకోగానే పొడి పొడి అయిపోయింది. పేజీలు తిప్పడం మొదలుపెట్టాను.




## గౌతమి డైరీలో ఏముంది..

'జీవితం ఎంత గాఢమైంది! నిగూఢమైంది! విచిత్రమైంది! చిన్నచిన్న ఆనందాలతో పాటు కారణాలు లేని బాధల్ని కలిగిస్తుంది!' చలం ఎంత బాగా చెప్పాడో అని రాసుకుంది.

ఇది డైరీ కాదు. నా మనసు, నా అంత

రంగం, నా జీవితం!

నేను మనసు విప్పి చెప్పలేనివి కూడా ఇందులో రాసుకున్నాను. ఇది చదివి పిరికిదే అనుకుంటావో? పాతకాలపుదాన్ని అనుకుంటావో? తెలియదు! ఆ రోజు ఇప్పటికీ కళ్ళకి కట్టినట్లు ఉంది.

ఆ రోజు మొట్టమొదట శ్రీరామ్‌ని చూశాను. అమ్మచాటు బిడ్డలా! ఆవిడ వెనకాలే నిలుచుని ఉన్నాడు. నాన్న అతనిని దగ్గరకు పిలిచి మాట్లాడుతుంటే, లోలోపలకి ముడుచుకుపోతున్నాడు.

నాన్న నన్ను పరిచయం చేశారు. "చూడమ్మా! వీళ్ళు మన బంధువులే! వెనుకన ఉన్న మన ఇంట్లో ఉంటారు. ఈ అబ్బాయి మొహమాటస్తుడిలా ఉన్నాడు. ఇల్లు చూపించు అతనికి" అని చెప్పి వెళ్ళిపోయారు. ఆ వెంటనే అమ్మ వచ్చింది. కాసేపు ఆవిడతో మాట్లాడి, నాన్న చెప్పిందే చెప్పింది నాకు.

అప్పుడు "శ్రీరామ్! నాతో రా!" అని పిలిచాను. నెమ్మదిగా మాటల్లోకి దించి అతని బెరుకును పోగొట్టాను.

కృష్ణ, బలరాం, నేను, కృష్ణ చెల్లెలు గీత-మేం నలుగురం ఒక జట్టు. ఇప్పుడు అందులోకి శ్రీరామ్ వచ్చి చేరాడు. అందరితో తొందరగానే కలసిపోయాడు.

అప్పుడప్పుడు నన్ను చూస్తుండేవాడు. అతని కళ్ళు భలే ఉండేవి.. కొంచెం వాలుగా! డ్రీం అయిస్! ఆ కళ్ళలో భావం అపురూపమయిన దాన్ని చూసినట్లు ఉండేది. అది ప్రేమా! లేకా ఆరాధనా! ఏమో? తెలియదు నాకయితే అతని మొహమాటం, తడబాటు భలే నచ్చేవి. చూడటానికి స్పోర్ట్స్ మాన్‌లా ఉన్నాడు. క్రికెట్, ఫుట్‌బాల్ రెండూ ఆడేవాడు. కానీ ఆ తరువాత ఫుట్‌బాల్‌లో మంచి ప్రావీణ్యం సంపాదించాడు. అది నావల్లే అని చెప్పాడు. ఏదో తెలియని సంతోషం కలిగింది.. నా మాటకి అంత విలువ ఇచ్చినందుకు.

## కొత్తగాలి...

**నాడు**
**బడిబాట!**
**నేడు**
**రాబడి మాట!**

– యు. చిట్టిబాబు,
న్యూ పాల్వంచ, ఖమ్మం జిల్లా

శ్రీరామ్ వచ్చిన కొత్తలో కొన్నిరోజులు అందరం కలిసి సూర్యం మాస్టారు దగ్గర ట్యూషన్‌కి వెళ్ళేవాళ్ళం. ఆ తరువాత అమ్మ "అబ్బాయిలతో వెళ్లొద్దు! అనడంతో, నేను, గీత కారులో వెళ్ళేవాళ్ళం.

వాళ్లు సైకిళ్ళ మీద వచ్చేవారు. రోజూ కృష్ణగానీ బలరాంగానీ శ్రీరామ్‌ని తీసుకుని వెళ్ళేవాళ్ళు.

ఒకరోజు పొద్దున్నే లేచి పెరట్లో ఉన్న సంపెంగ చెట్టు దగ్గరకు వెళ్లాను, పూలు కోసుకుందామని! ఆకుల్లో కలిసిపోయి కోసుకోడానికి కంటికి కనపడేవి కావు. అవి పండితే బంగారు రంగులో ఉండేవి. అదో అందం. నవ్వనా? వద్దా? అన్నట్లున్నాయి

గీత, శ్యామల, పావని ఎప్పుడూ ఏడిపించేవారు.. "నీకు ఈ ఆకు సంపెంగ పిచ్చి ఏమిటే? అయినా ఆ వాసనకి పాములు వస్తాయట" అని ఒకళ్ళు.

"అబ్బ! ఆ వాసనకి నాకు తలనొప్పి వస్తుంది" అని ఇంకొకళ్ళు అనేవారు.

వాళ్ళకి ఆ వాసన పడకపోవడంతో గొడవ వదిలిపోయింది.

అదే అన్నాను వాళ్ళతో "మీకు గుర్తు లేదా? తెలుగు మాస్టారు సంపెంగ పువ్వు గురించి వసుచరిత్రలోని ఓ పద్యభావం చెప్పారు కదా! అన్ని పువ్వుల వాసనలను చూసే తుమ్మెద తన చెంతకు ఎందుకు

రాదనే కోపంతో సంపెంగ పువ్వు తపస్సు చేసి, ఒక స్త్రీ ముక్కుగా మారినట్లు ఆ కవి రాశాడని! అందుకని నాకు సంపెంగ పువ్వే ఎక్కువ"

దాంతో వాళ్ళు ఇంక మాట్లాడలేదు.

రోజూ కారు డ్రైవర్ సత్యాన్నిగాని, ఇంట్లో పనిచేసే అప్పన్నను గానీ పూలు కోయమనేదాన్ని. అనుకోకుండా ఆ రోజున వాళ్ళిద్దరూ టైంకి రాలేదు. ఎలా అని చెట్టును చూస్తూ నిలబడ్డాను.

ఇంతలో ఆకుల మధ్యలో దాగున్న పెద్ద మొగ్గలు రెండు కనిపించాయి. ఎగురుతూ కొమ్మను అందుకోవడానికి ప్రయత్నం చేస్తున్నా. ఇంతలో నన్ను నడుం పట్టుకొని ఎవరో పైకి లేపారు. అతి సునాయాసంగా ఆ పువ్వులు నా చేతికి వచ్చేశాయి. వెంటనే వెనక్కి తిరిగి చూశాను. శ్రీరామ్ ఇంకా నా నడుం పట్టుకునే ఉన్నాడు. అబ్బ! ఆ కళ్ళ నుండి చూపు తిప్పుకోలేకపోయాను. అతనే గబుక్కున తేరుకొని "నువ్వు ఆ పువ్వులు అందుకోవడానికి కష్టపడుతుంటే చూడలేక.." అని మధ్యలోనే ఆపేశాడు.

ఆ కళ్ళలో నాకు ఏం కనిపించిందో గానీ, గబుక్కున వంగి, ఆ కళ్ళ మీద ముద్దుపెట్టాను. తత్తరపాటుతో నన్ను వదిలేసి తను వెళ్ళిపోయాడు. నేను గబుక్కున కిందకి కూలబడిపోయాను.

ఆలోచిస్తుంటే చాలా భయం వేసింది. ఛీఛీ! ఏమనుకుంటాడు నా గురించి? 'ఇంత సిగ్గులేనిదా? ' అనుకుంటాడేమో!

ఆ సంఘటన జరిగిన తరువాత నాక తను రెండు రోజుల వరకు కనపడలేదు.

'ఎదలోపలి ఎదలో, నెమ్మదిగా, రహస్యపు అరలో అతను కూర్చున్నాడు!' ముందు కంగారు పడ్డాను. తరువాత భయపడ్డాను. కొంతకాలానికి నాకు తెలియకుండానే శ్రీరామ్ గురించి ఆలోచించడం మొదలుపెట్టాను.

నాలో కలుగుతున్న ఈ భావావేశాల సంగతి అతనికి ఏమాత్రం తెలియదు.

అందరం కాలేజీలో చేరాం! ఇంటిదగ్గరగా ఉన్న ఉమెన్స్ కాలేజీలో నాతో పాటు నా ఫ్రెండ్స్ కూడా జాయిన్ అయ్యారు.

శ్రీరామ్, కృష్ణ వాళ్ళు కాస్త దూరంగా ఉన్న గవర్నమెంట్ కాలేజీలో చేరారు.

శ్రీరామ్‌లో ఉండే మొహమాటాన్ని నెమ్మదిగా తగ్గించడంలో విజయం సాధించాను. దాంతో అతను నాతో స్వతంత్రంగా ఉండగలుగుతున్నాడు.

నాన్నకి నాటకాలు వేయడం చాల ఇష్టంగా ఉండేది. ముఖ్యంగా ఆయన సాహిత్యాభిమాని. అప్పుడప్పుడు నాన్న నన్ను కొన్ని సాహితీ సభలకి తీసుకొని వెళ్ళేవారు. అలాగే నాన్న వేసే నాటకాలకి కూడా వెళ్ళేదాన్ని. అందరూ ప్లీడర్‌గారి అమ్మాయి వచ్చిందని నన్ను స్పెషల్‌గా చూసేవారు మధ్యమధ్యలో కూల్‌డ్రింక్స్ ఇచ్చేవారు. అమ్మకి ఎందుకో ఇష్టం ఉండేది కాదు.

ఆవిధంగా నాకు కూడా సాహిత్యం అంటే బాగా ఇంట్రెస్ట్ కలిగింది. ముఖ్యంగా తిలక్, చలం, శరత్, అడవిబాపిరాజు, కవిత్వం కూడా ఇష్టమే. నాన్న షెల్లీ, కీట్స్ ఇంకా కొంతమంది ఆంగ్ల కవులవి కూడా బాగా చదివేవారు.

ఎప్పుడన్నా నాన్నకి సమయం కుదిరినప్పుడు మా ఇద్దరి మధ్య సాహిత్య చర్చలు జరిగేవి.

శ్రీరామ్ కూడా సాహిత్యాభిమాని. ఏదైనా కథగురించి గానీ, నవలగురించి గాని లోతుగా విశ్లేషణ చేసేవాడు.

కృష్ణ మాత్రం "అబ్బ! క్లాసు పుస్తకాలే కష్టం అనుకుంటే, వీళ్ళందరూ ఎందుకురా బార్! అందులో నాకు శ్రీశ్రీ కవిత్వం చదివితే బెత్తం పట్టుకున్న మన నృసింహ మాస్టారు గుర్తుకొస్తారు. నాకొద్దు బాబోయి ఈ సాహిత్యం!" అంటూ ఆమడ దూరం పరిగెత్తేవాడు.

బలరాంకి సైన్సుకి సంబంధించినవే ఇష్టం. గీతావాళ్ళకి ఎంతసేపూ ముగ్గులు, వంటలు, అల్లికలు ఇష్టంగా ఉండేవి.

ఒకరోజున నాన్న అధ్యక్షతన ఒక సాహితీ సభ జరిగింది. ప్రముఖ రచయితలు, రచయిత్రులు చాలామంది ఆ సభలో పాల్గొన్నారు.

నేను, గీత, శ్రీరామ్, కృష్ణ అందరం చూడటానికి వెళ్ళాం. అక్కడ మరికొంత మంది స్నేహితులు కలిశారు. సభలో కొంతమంది చాలా బాగా హృదయాల్లోకి చొచ్చుకొనిపోయేలా మాట్లాడితే, మరికొంత మంది ఏం మాట్లాడుతున్నారో కూడా అర్థం కాలేదు. వీళ్ళేనా అంత బాగా రాసే వాళ్ళు? అనిపించింది.

ఇంటికి తిరిగి వెళ్ళేటప్పుడు ఆలస్యం అయింది. బాగా రాత్రయింది. చాలా మంది ఉండటంతో అందరం సరదాగా నడుచుకుంటూ వస్తున్నాం. జరిగిన సభా విశేషాల గురించి చమత్కరించుకుంటూ మాటలలో పడి నేను, శ్రీరామ్ వెనక పడ్డాం. రోడ్లన్నీ నిశ్శబ్దంగా ఉన్నాయి. మా వాళ్ళ మాటలే గట్టిగా వినిపిస్తున్నాయి. ఉండుండి, ఓ బస్సో, కారో వెళుతున్నాయి. ఆ నిశ్శబ్దంలో శ్రీరామ్ పక్క నడవడం నాలో ఏదో కొత్త అనుభూతిని కలిగిస్తోంది. అతని చేయి తగిలినప్పుడల్లా నేను, మోవి తాకిన వేణువులా పులకిస్తున్నాను.

ఈ జీవితం మొత్తం ఇలాగే, ఇతని పక్కనే నడుస్తూ ఉంటే ఎంత బావుంటుంది! అనిపించింది.

మరి తను ఎలా ఫీలవుతున్నాడోనని అతని వైపు చూశాను. మొద్దబ్బాయి రోడ్ల వైపు చూస్తున్నాడు. నాకు ఉక్రోషం వచ్చి గట్టిగా జబ్బ మీద చరిచాను.

"అబ్బా! ఎందుకు కొట్టావు? " అన్నాడు.

అప్పటికే ముందు వెళ్తున్న వాళ్ళు ఆగి "ఏమైంది? " అన్నారు.

# చతుర ప్రవేశిక

## అక్టోబరు చతుర చదివారా?

ఈ ప్రశ్నలకు ఒక్క మాటలో జవాబు రాసి బహుమతి పొందండి. ఎక్కువమంది సరైన జవాబులు రాస్తే డ్రా తీసి విజేతలను ఎంపికచేస్తాం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

1. గౌతమి ప్రేమించింది?
జ.
2. శ్రీరామ్ చిన్ననాటి మిత్రులు?
జ.
3. కృష్ణ భార్య?
జ.
4. గౌతమికి ఇష్టమైన పూలు?
జ.
5. బదరీనారాయణ వృత్తి?
జ.
6. గౌతమి కూతురు?
జ.
7. శ్రీరామ్ బాబాయి?
జ.
8. 'నాగలమ్మ' మూలరచయిత?
జ.
9. మాచెల్ భర్త?
జ.
10. 'సత్తగుల్లలు' రచయిత?
జ.

పంపినవారి పేరు: ------------------------------------వయసు (   )

చిరునామా: ------------------------------------------------

------------------------పిన్‌కోడ్ :            ఫోన్ నెం :

చిరునామా : సంపాదకులు, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజీగూడ, హైదరాబాద్- 82
ఫోన్ : 04023318181, Ex: 6658, 6532
ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.
గడువు తేదీ 17

దాంతో నాకు ఒళ్ళుమండి "నేను చెప్పేది వినకుండా, అసలు నువ్వు ఏ లోకంలో ఉన్నా"వంటూ దబాయించాను.

అప్పుడు తెలియదు, రాబోయే నా జీవితం అంతా శిశిరమే అని.

★ ★ ★

శ్రీరామ్ వాళ్ళ అమ్మకి ఉన్నట్టుండి ఆస్తమా ఎక్కువయింది. పరిస్థితి సీరియస్ అని నాన్న స్వయంగా ఆసుపత్రికి తీసికెళ్ళారు. లాభం లేకపోయింది. ఆవిడ పోయిందని చెప్పేశారు. అన్ని కార్యక్రమాలూ నాన్నే దగ్గరుండి జరిపించారు.

తల్లిపోయిన దుఃఖంలో ఉన్న తనని ఓదార్చడం నా బాధ్యతగా తీసుకున్నాను. ఆ విధంగా మా ఇద్దరి మధ్య దగ్గరతనం పెరిగింది. ఇంట్లో నాన్న, అమ్మ కూడా బాగా చూసుకునేవారు.

నాన్న నాటకాల కోసం ఎన్ని ఊళ్లు తిరిగినా, వచ్చిన వెంటనే కనిపించాలి. "నా తల్లిని విడిచి నేనుండలేను" అనేవారు.

అది విన్నప్పుడల్లా అమ్మ అనేది "పెళ్లి చేసి అత్తవారింటికి పంపాలి తెలుసా? "

"ఎందుకే అల్లుడినే మనింటికి రప్పించుకుందాం" అనేవారు సరదాగా.

ఆ మాటలు నాలో ఏవో ఆలోచనలు, కొత్త ఆశలను రేపేవి. రాత్రిళ్ళు కమ్మటి కలలు వచ్చేవి.

పౌర్ణమి రోజున వెన్నెట్లో గోదావరిని చూడాలని ఉంది అని చెప్పాను ఓ రోజున శ్రీరామ్‌కి.

అంతే ఏం చేశాడో? ఎలా ఏర్పాటు చేశాడో? తెలియదు. "పద పద! ఈరోజు పౌర్ణమి! మన పడవ ప్రయాణం ఏర్పాటు చేశాను. ఒక గంట తిప్పుతానన్నాడు పడవవాడు" అని చెప్పాడు.

"సరే!" అని ఉత్సాహంగా అన్నాను.

కృష్ణ ఇంట్లో చదువుకోవడానికి వెళుతున్నామని అమ్మకి చెప్పి వెళ్ళాం.

సరాసరి లాంచీల రేవుకి గీత, కృష్ణ, బలరాం, నేను, శ్రీరామ్ సైకిళ్ళ మీద అందరం వెళ్ళాం. పడవ కూడా రెడీగా ఉంది. తీరా అక్కడికి వచ్చిన తరువాత గీత రాను గాక రాను అంది. దాన్ని ఒక్క దాన్ని వదల్లేక కృష్ణ ఉండిపోయాడు.

కృష్ణ, బలరాం కళ్ళతోనే మాట్లాడుకున్నారు.

బలరాం కూడా "నాకేదోలా ఉంది. కడుపులో తిప్పుతోంది. వాంతి వచ్చేలా ఉంది. ఎందుకు రిస్కు తీసుకోవడం? మీరిద్దరూ వెళ్లి రండిరా!" అంటూ బలరాం కూడా ఆగిపోయాడు.

నా మనసుకనిపించింది, కావాలనే మా ఇద్దరికి ఏకాంతం కల్పించడం కోసం తను ఆగిపోయాడని.

ఇద్దరం వెళ్లి ఆగి ఉన్న పడవలో కూర్చున్నాం. వెన్నెల కిరణాలు పడి నీళ్ళు తళతళ మెరుస్తున్నాయి. పడవ నడిపే సరంగు ఏదో పాడుకుంటున్నాడు. చుట్టూరా చూశాను. రాత్రివేళ గోదారమ్మ అందాలు చెప్పనలవి కాదు. ఆ అనుభవం మాటల్లో వర్ణించలేను. వెన్నెల రాత్రి, శ్రీరామ్ పక్కనే ఉన్నాడు! ఈ రాత్రి ఎంత అందంగా ఉంది. ఆ ఏకాంతం, ఆ నిశ్శబ్దం మనోహరంగా అనిపించింది. పడవ నిశ్శబ్దంగా సాగుతోంది. గాలి మృదువుగా నా ముంగురులని తాకుతుంటే, విసుగ్గా వాటిని వెనక్కి తోస్తున్నాను.

శ్రీరామ్ నాచెయ్యి పట్టుకొని ఆపేశాడు "వద్దు వద్దు! చాలా బావుంది! అలా ఉండనీ! మబ్బుల మధ్య చందమామలా వెలిగిపోతోంది నీ మొహం" అన్నాడు.

ఆ మాటకి నా మనసంతా రాగరంజితం అయింది.

పడవ మెల్లగా వెళుతోంది. ఇద్దరం మౌనంగా ఉన్నాం. మాట మాట్లాడితే ఆ క్షణాలు కరిగిపోతాయేమో అన్నట్లుగా ఉంది. కళ్ళముందు ఒక స్వప్నజగత్తు కనిపిస్తోంది. అలల మీద నుంచి తేలి వచ్చే గాలి ఏదో తీయని రాగం పాడుతున్నట్లుగా ఉంది. కాలం ఆగిపోతే బావుండును అనిపించింది. అలా ఒక గంట తిప్పి తీసుకొచ్చాడు. పడవ దిగి మెట్లెక్కి వచ్చాం.

వాళ్ళు ముగ్గురూ అక్కడే కునికిపాట్లు పడుతున్నారు. "ఎలా జరిగింది? ఏంటి? " అని ఏదో అడుగుతున్నారు.

కానీ నా చెవులకి అదేమీ విన్పించటం లేదు. అసలు మాట్లాడాలనిపించటం లేదు. మనసంతా అలౌకిక ఆనందం పొందుతోంది. ఎలా ఇంటికి చేరుకున్నామో తెలియదు.

నేను, శ్రీరామ్ ఇద్దరం పడవలో షికారు వెళ్ళటం.. ఇద్దరమే గోదావరి మధ్యలో ఇసుక మేటల మీద నడవడం.. పదే పదే తలచుకుంటుండగా పడవ నడిపే సరంగు పాట గుర్తుకు వచ్చింది. "ఓ నా రంగి! ఈ ఎన్నెల నన్ను కాల్చేస్తున్నదే! నీ ఎచ్చని ఒళ్ళు నన్నొత్తితే గాని సల్లబడదే! ఏలియాలా! ఏలియాలా! ఏలియాలా! ఐలేసా జోరిసెయ్యి! ఐలేసా బారుసెయ్యి!"

అంటూ భలే పాడాడు అనుకుని, మనసంతా మధుర భావనలతో నిండిపోయింది. అలాగే కళ్ళు మూసుకున్నాను.

జీవితంలో ఒక్కోసారి మనం ఊహించని సంఘటనలు జరుగుతాయి. అనుకోని మలుపులు తిప్పుతాయి. 'లైఫ్ ఇనెవిటబులీ త్రోస్ అజ్ కర్వ్ బాల్స్, అనెక్స్‌పెక్టెడ్ సర్కమ్‌స్టెన్సెస్ దట్ రిమైండ్ అజ్ టు ఎక్స్‌పెక్ట్ ది అనెక్స్‌పెక్టెడ్'

శ్రీరామ్ ఇక్కడ నుండి వాళ్ళ నాన్నగారికి వరసయిన తమ్ముడి ఇంటికి కలకత్తా వెళ్ళిపోతున్నాడని అమ్మ చెప్పింది. అదేంటి ఇంకొక్క ఏడాదిలో చదువు పూర్తవుతుంది కదా! మధ్యలో వదిలేసి వెళ్ళడం ఏమిటి? అసలు ఈ సడన్ ప్రయాణం, ఎప్పుడూ వినని బాబాయ్ ఎవరు? అసలేం జరుగుతోందో తెలియని అయోమ

యంలో పడ్డాను.

అంతకంటే పెద్ద షాక్.. శ్రీరామ్ నాకు చెప్పకపోవడ మేంటి? ఇద్దరం కూర్చొని మాట్లాడు కోవచ్చు కదా! నాతో చెప్పకుండా, ఇంత పెద్ద నిర్ణయం తీసు కున్నాడా? నా కు అసలు నమ్మబుద్ధి కాలేదు. 'ఏదో జరి గింది! అది నాకు తెలియాలి' అనుకొని శ్రీరామ్ గదికి వె ళ్ళాను. అక్కడ లేడు. కృష్ణా వాళ్లిం టికి ఫోన్ చేశాను. అక్కడా లేడు. మరి ఎక్కడికి వెళ్ళుం టాడు? అనుకునే లోపల తనే వచ్చాడు. అక్కడ ఉన్న నన్ను చూడకుండానే సరా సరి తన గదిలోకి వెళ్ళిపోయాడు.

"నీతో మాట్లాడాలి!" అంటూ వెనకాలే నేను వెళ్ళాను.

మౌనం!

"శ్రీరామ్ ఏమైంది నీకు? కలకత్తా వెళ్ళి పోతున్నావా? అమ్మ చెప్పింది నిజ మేనా? " అనడిగాను.

"అవును! నిజమే!" మొహం పక్కకు తిప్పుకొని చెప్పాడు.

వెంటనే దగ్గరకు వెళ్లి చెయ్యిపట్టి "ఇటు తిరుగు! మరి నాకు ఎందుకు చెప్పలేదు" అన్నాను.

"చెబుదామనే అనుకుంటున్నాను"

"ఎప్పుడు? నువ్వు వెళ్ళిపోయాకనా? " అనడిగాను.

"...."

"ఇక మాట్లాడుకోవాల్సింది ఏమీ లేదా? " అన్నాను

మళ్ళీ మౌనం!

నాకు కోపం, ఉక్రోషం వచ్చాయి.

కొంచెంసేపు అయ్యాక పక్కన కూర్చొని నా మనసును అర్థం చేసుకోకుండా నన్ను గట్టిగా ముద్దు పెట్టుకుంటూ కౌగిలించుకో బోయాడు.

ఆ క్షణంలో నాకు అది ప్రేమ అనిపిం చలేదు. కోరికలా కనిపించింది. అది నాకు నచ్చలేదు. నేను ఇంత బాధపడుతుంటే అతను అది గమనించకుండా ఇలా ఛీ! ఛీ! అనుకుంటూ ఉక్రోషంతో ఈడ్చి అతని చెంప మీద కొట్టాను.

దిమ్మరపోయి, క్షమించమని అడిగాడు.

అసలు ఆ మనిషిలో ఈ కొత్తరూపం చూస్తే భయమేసింది. నా చనువుని ఏమ నుకున్నాడు?

అప్పటికే అవమాన భారంతో, దుఃఖం పొంగుకు రాగా శ్రీరామ్ పిలుస్తున్నా విన కుండా ఇంట్లోకి వెళ్ళిపోయాను. రాత్రంతా నిద్రపోలేదు. కొట్టకుండా ఉండాల్సింది. అసలు అప్పటికప్పుడు వెళ్ళి సారీ చెబుదా మనుకున్నాను. కానీ ఆ రోజు ఎందుకో

అమ్మ నా గదిలో పడుకుంది. ధైర్యం చేసి వెళ్ళలేకపోయాను.

శ్రీరామ్ మరునాడు వెళ్ళిపోతున్నాడు. ఉదయం నుంచే దిగులుగా ఉంది. పొద్దునే అన్నీ మరిచిపోయి తన గదికి వెళ్ళాను. అతను ఇక్కడ నుండి వెళ్ళడం అంటే నా జీవితంలోంచీ వెళ్ళిపోవడమే అని అన్యాపదేశంగా చెప్పినట్లనిపించింది.

అప్పటికే కృష్ణ, బలరాం వచ్చి తనతో మాట్లాడుతున్నారు. బ్యాగ్ సర్దుకొని రెడీగా ఉన్నాడు. వాళ్లని చూసి వెనక్కి తిరిగి వెళ్ళిపోయాను. మూడుగంటల తరువాత వాళ్ళు స్టేషన్‌కి వెళ్ళిపోతారు.. అనుకుంటూ ఉన్నాను. ఒక పక్క వీడ్కోలు చెప్పాలని ఉంది. ఇంకో పక్క ఆ బాధను తట్టుకోలేనని లోలోపలే కుమిలిపోతున్నాను.

ఈ లోపల తనే ఇంట్లోకి వచ్చి అమ్మకి, నాన్నకి చెప్పి ఆశీర్వాదం తీసుకున్నాడు. నా దగ్గరకు వచ్చాడు. ఏ క్షణంలోనైనా దుఃఖం కట్టలు తెగేలా ఉంది. విడిపోవటం ఇంత బాధా! ఎలా తట్టుకుంటుంది ఈ చిన్ని గుండె? ఇంతేనా! ఇంక చూడలేనా నిన్ను.

"గౌతమీ! వెళ్తున్నాను" అన్నాడు.

"వెళ్ళొస్తానని చెప్పు! అవును కదా! మళ్ళీ రావు!" సరే అన్నట్లు తలూపాను.

ఇంకేదైనా చెబుతానేమో అని తను చూస్తున్నాడు.

తనేదైనా మాట్లాడుతాడేమో అని నేను చూశాను.

కొన్ని క్షణాలు గడిచిపోయాక నా చేతిలో ఉన్న పుస్తకం ఇచ్చాను.

చలం అన్నట్లు 'నీవున్నావని, నీ నుంచి దూరంగా విడిపడ్డానని, ఎక్కడ దేన్ని ప్రేమించినా నిన్నేనని, ఎప్పుడు ప్రేరణ కలిగినా అది నీ వల్లేనని వీళ్ళకేం తెలుసు' అవును! వీళ్ళకేం తెలుసు.

★ ★ ★

మామూలుగా అందరిళ్ళలోను ఉన్నట్లే మా ఇంట్లోనూ నాన్న మాకు డబ్బు తెచ్చివ్వడం తప్ప, వచ్చే రాబడి, ఖర్చు గురించి ఆయన ఇంట్లో చెప్పేవారు కాదు. అమ్మ ప్లీడర్‌గారి భార్యగా, ఓ మహారాణిలా ఉండటం తప్ప, బతుకుని నడిపించుకునే నేర్పరితనం లేకపోయింది. రాబడి ఎంతో, అంతకు రెట్టింపు ఖర్చులు ఉండేవి.

నాన్న తన కోసం, సంసారం కోసం చూడకుండా, అడిగిన వాడికల్లా జేబులోంచి తీసి ఇచ్చేసేవారు. అప్పుడు ఆయనకి ఏమీ గుర్తుండేది కాదు. నాన్న తన సాహితీ మిత్రులతో కలిసి ఒక చక్కటి మాస పత్రికను ప్రారంభించారు.

రెండు, మూడు నెలలు బాగానే నడిచింది. నాన్న తన కేసుల హడావుడి, నాటకాల కోసం బయటకు వెళ్ళడం వల్ల ప్రెస్ పనిని నమ్మకస్తులైన తన స్నేహితులకి అప్పగించారు. నమ్మిన వాళ్ళ వల్లే మొత్తం అప్పుల పాలై, పత్రికను ఆపేశారు. ప్రెస్ మూతపడింది. దాంతో ఆర్థికంగా చాలా నష్టపోయారు.

ఈ పరిణామ క్రమంలో వత్తిడి తట్టుకోలేక నాన్నకి హార్ట్ ఎటాక్ వచ్చింది.

మొత్తానికి గండం గడచి హాస్పిటల్ నుండి ఇంటికి వచ్చారు.

ఇవన్నీ నాణానికి ఒకవైపు! ఇంకోవైపున చూస్తే నాన్న తీసుకున్న కేసులన్నీ కూడా అన్యాయాన్ని సమర్థించేవని తెలిసింది. అదే ఆయన పతనానికి దారితీసిందని ఊళ్ళో అందరూ అనుకునేవారట.

ఒకరోజున అమ్మ పిలిచి "చూడు గౌతమీ! కాకినాడలో ఉండే మన వెంకట్రావు మావయ్య కొడుకు భాస్కర్, ఏలూరులో లా చదువుతున్నాడు. అతనితోనే నీ పెళ్ళి మాట్లాడటం అయింది. వాళ్ళు రేపోమాపో వస్తారు చూసుకోవడానికి. అర్థమయిందా!" అని అంది తల్లి.

ఆ మాటలకి ఎక్కడో ఊహాలోకాల్లో విహరిస్తున్న నేను వాస్తవంలోకి వచ్చాను.

# ఇసుకరేణువుల కన్నా నక్షత్రాలు అధికం!

చతుర సమాచారం

విశ్వం గురించి మనకి తెలిసింది తక్కువ. తెలియాల్సింది ఎక్కువ. మనకి తెలిసిన కొన్ని విషయాలు.

★ వ్యోమగాముల ప్రకారం అంతరిక్షంలో లోహాన్ని వెల్డింగ్ చేసేప్పుడు వచ్చే వాసన, చంద్రుడి మీద తుపాకీ మందు వాసన ఉంటుంది.



★ శుక్రగ్రహం అతి నెమ్మదిగా తిరిగే గ్రహం. అందువల్ల శుక్రగ్రహం మీద ఒక రోజు మన సంవత్సరం కంటే అధికం.

★ నిత్యం 27 కోట్ల 50లక్షల నక్షత్రాలు పుడుతున్నట్లు ఖగోళశాస్త్రజ్ఞులు కనిపెట్టారు.

★ అంద్రోమిడ గెలాక్సీ రాత్రిళ్ళు మనకు కనిపిస్తే అది చంద్రుడి కంటే ఆరింతలు పెద్దదిగా కనిపిస్తుంది. కానీ కనిపించదు.

★ సూర్యుడు మన గెలాక్సీ చుట్టూ ఓసారి ప్రదక్షిణ చేయడానికి 22కోట్ల 50లక్షల సంవత్సరాలు పడుతుంది.

★ విశ్వంలో 10వేల నుంచి 20వేల కోట్ల గెలాక్సీలు ఉన్నాయి.

★ ప్రపంచంలోని ఇసుక రేణువుల కన్నా పాలపుంతల్లోని నక్షత్రాలు అధికం! వాటి సంఖ్య 10బిలియన్లు. అంటే 10 పక్కన 21 సున్నాలు!

★ నక్షత్రాలని చూడడం అంటే కాలంలో వెనక్కి వెళ్ళడమే. మనం చూసే నక్షత్రం వెలుగు 25 సంవత్సరాల క్రితం ప్రయాణం ఆరంభించింది. కొన్ని నక్షత్రాల వెలుగు ఇంకా అంతకుముందే ప్రారంభమైంది.

★ సజిటేరియస్ బి గ్రహంలో అతిపెద్ద ఆల్కహాల్ మబ్బు ఉంది. దీని పొడవు నాలుగులక్షల అరవైమూడు వేల కోట్ల కిలోమీటర్లు!

★ శాంటారస్ గ్రహంలో ఓ చిన్నపాటి గ్రహమంత వజ్రం ఉంది. పొడవు 25వేల మైళ్ళు.

---

సరే! ముందు దీన్ని ఎలా అయినా తప్పించుకోవాలని "అమ్మా! నేను అప్పుడే పెళ్ళిచేసుకోను. ఇంకా బాగా చదువుకుంటాను" అని అన్నాను.

అమ్మ దానికి "నేను ఎందుకు చెబుతున్నానో విను గౌతమీ! మొండితనం చేయకు! ఇప్పుడు నాన్న పరిస్థితి గురించి నీకు తెలుసు" అని గట్టిగా చెప్పింది.

అంటే అమ్మకి నా గురించి, శ్రీరామ్ గురించి ఏదైనా తెలిసిందా? లేక గ్రహించిందా? ఇదేమిటి ఈ కొత్త మలుపు నా జీవితంలో? అని ఆశ్చర్యంతో దాని గురించి ఆలోచిస్తూనే, వెంటనే అమ్మకి చెప్పాలనుకున్న విషయం చెప్పలేకపోయాను.

ఒక్కొక్కప్పుడు ఎంతో ముఖ్యమైన విషయాలని వెంటనే చెప్పకపోవడంలో వచ్చే నష్టం అప్పుడు తెలియదు.

అందుకు జీవితకాలాన్ని పణంగా పెడుతున్నానని కూడా అప్పుడు తెలియలేదు.

మనసు నిండా నింపుకున్న శ్రీరామ్ రూపాన్ని చెరిపేసి, ఎవరో తెలియని వ్యక్తితో తాళి కట్టించుకోవడం అన్నది నా ఊహకు అందని విషయం. కానీ అమ్మ ఎందుకు అంత పట్టుపడుతోందో తెలియటంలేదు.

నా హృదయమంతా నిండిన అతని చుట్టూ నా జీవితం అల్లుకున్నాను. నా ఆలోచనలు, నా కలలు, నా నిద్రలు, మెల

కువలు అన్నీ అమ్మ మాటతో ఒక్కసారిగా ఛిద్రమయ్యాయి.

శ్రీరామ్ నా జీవితంలోంచి వెళ్ళిపోవడం పెద్ద ట్రాజడీ అయితే, నా పెళ్ళి మరో వ్యక్తితో కుదరడం అంతకన్నా పెద్ద ట్రాజడీ.

★ ★ ★

ఆ రోజున అమ్మతో మాధవయ్యగారు మాట్లాడుతుండగా విన్నాను.

"ఇదేమిటండి! మన దగ్గర డబ్బులేకపోవడం ఏవిటి? ఇల్లు అమ్మడం ఎందుకు? అయ్యో భగవంతుడా! ఇప్పుడేం చెయ్యాలి? " అంటూ అమ్మ కన్నీరుపెట్టింది.

దానికి ఆయన "ఊరుకోండి అన్నపూర్ణమ్మగారు! కష్టాలు చెప్పకుండానే వస్తాయి. మీరు నిభాయించుకోవాలి. ఒకపక్క ఆయన ఆరోగ్యం బాగాలేదు. ఇప్పుడయినా నేను ఎందుకు చెబుతున్నానంటే మీకు వాస్తవం తెలియాలి కదా!" అన్నారు ఓదార్చుతూ.

"అయ్యో! ఆడదాన్ని నాకేం తెలుసండీ? ఆయన తెస్తున్నారు, ఇల్లు గడుస్తోంది అనుకున్నాను. పిల్ల పెళ్ళి కూడా చేయలేని స్థితికి వచ్చామా? ఓరి భగవంతుడా!" అమ్మ బాధపడింది.

అప్పుడు నాకర్థమయిన విషయం నాన్న ఏదో పెద్ద ప్రాబ్లంలో ఉన్నారని. అది ఎలా తెలుస్తుంది? పొద్దున్నే లేచి కనుక్కోవాలి అనుకున్నాను. అందుకే పొద్దున్నే లేచి నాన్న కాఫీ తాగుతుంటే వెళ్ళి పక్కనే కూర్చున్నాను. "నాన్నా! మిమ్మల్ని ఒకటి అడగనా? " అన్నాను.

"చెప్పమ్మా!" అన్నారు.

"నాన్నా! మనకి డబ్బు ఇబ్బందులు ఉన్నాయా? " అనడిగాను

"లేదురా తల్లి!" అని దాటేశారు.

"నా మీద ఒట్టేయండి!" అన్నాను.

అప్పుడు నాన్న బ్రేక్ అయ్యారు. "తల్లీ! మనుషులలో మంచితనం ఉందని నమ్మి మోసపోయాను! అందుకే వెంకట్రావు మావయ్య తెలుసుకదా! ఆయన్ని సహాయం అడిగితే 'దానిదేముంది చేద్దాం. కానీ నువ్వు నాకు ఒక మాట ఇవ్వాలి. మా అబ్బాయి భాస్కర్ తెలుసుకదా! వాడు మీ అమ్మాయి గౌతమిని ఇష్టపడుతున్నాడు. అందులోను అబ్బాయి లా చదువుతున్నాడు. ఇంకో ఏడాదికల్లా డిగ్రీ చేతికివచ్చేస్తుంది. నీ ప్రాక్టీసు అందుకుంటాడు. అదీగాక రేపొద్దున కొడుకయినా, అల్లుడయినా వాడే కదా! నీకు వారసుడు. అందుకని మనం సంబంధం కలుపుకుంటే బావుంటుంద'ని అన్నారు. అందులో నాకు వద్దు అనాల్సిన అవసరం కనిపించలేదు. పైగా దగ్గరవాళ్ళు. చదువుకున్నవాడు. నా కళ్ళముందే ఉంటారు. అంతకన్నా కావల్సిందేముంది? అది నా స్వార్థం అనుకో! మరోటనుకో! ఏమంటావు తల్లీ" అన్నారు.

నా మనసు, మాట రెండూ మౌనపోరాటం చేస్తున్నాయి. కోరుకున్నది దొరకనప్పుడు కన్నవాళ్ళ కోరికను తీర్చడం ధర్మమనుకొని సరే అన్నట్లు తలూపాను.

"నా తల్లి నన్ను అర్థం చేసుకుంది చాలు!" అనుకుంటూ, చిన్నపిల్లాడిలా అమ్మతో చెప్పడానికి వెళ్లారు.

నిశ్చయ తాంబూలాల ఫంక్షన్ జరిగింది. తెలుసున్నవాళ్ళే కాబట్టి మరీ అంత టెన్షన్ పడలేదు. మర్యాదలు బాగా చేశారు. భోజనాలయ్యాక తీరికగా అమ్మా నాన్నలు మావయ్యా వాళ్ళతో పెళ్లి విషయాలు మాట్లాడుతున్నారు.

బోలెడుమంది చుట్టాలు వచ్చారు. ఇల్లంతా సందడిగా ఉంది. అందరూ సరదాగా ఉన్నారు. నేను మాత్రం సంతోషంగా ఉండలేకపోతున్నాను.

వెంకట్రావు మావయ్య, సుభద్ర అత్తయ్యలకి ముగ్గురు పిల్లలు. పెద్దవాడు భాస్కర్, శేఖర్ రెండోవాడు, శ్యామల వదిన పెళ్ళయి అమలాపురంలో ఉంటోం

## రూ.116/- గెలుచుకున్న

# ఉత్తమ సమీక్ష

# ఆత్మీయతానుబంధాల సమాహారం!




సెప్టెంబరు సంచికలో నవల 'చిలుకలు వాలిన చెట్టు' ఆహ్లాదంగా సాగింది! ప్రేమలోని స్వచ్ఛత ఎన్నటికీ వసివాడదని నిరూపించింది. ప్రతి పాత్ర లోనూ అంతర్లీనంగా ఉన్న మమతానురాగాలు మన సును తడిమాయి. విశాల్, నమ్రతల పరస్పర ప్రేమ, అవగాహన, ఒకరి అభిప్రాయాలను మరొకరు గౌర వించి అనుసరించడం, ఆదర్శవంతం, అద్భుతం. నిజ మైన ప్రేమ జంట ఎలా ఉండాలో తెలియజెప్పింది. ఉన్నతస్థాయికి ఎదగడం అంటే డబ్బు సంపాదనే కాదు. విలువలతో కూడిన జీవనవిధానం అలవర్చు కోవడం, తద్వారా పదిమందికీ తలలో నాలుకలా మసలుతూ ఆత్మీయతానుబంధాలతో సంతృప్తికర మైన జీవితం గడపడం.. అన్న విషయం ఈ జంట తెలియజెప్పింది.

సినిమాల మీద మోజుతో, అవగాహనా రాహిత్యంతో గడపదాటిన అపురూప, తొలిభా గంలో అమాయకత్వానికి ప్రతీకలా అన్పించినా తుదకు పరిస్థితులనెదుర్కొని తనను తాను దృఢంగా మలచుకున్న తీరు చూసి స్త్రీ సాధించలేనిదేముంది? అనిపిస్తుంది. భార్య మొండి తనాన్ని భరించడం భర్తగా తన బాధ్యత అని భావించి అతిప్రేమతో ఆమెకు మంచిచెడుల విచక్షణ తెలుపకపోవడం వల్ల రాజారామమోహనరావు భార్యాబిడ్డలకు దూరమయ్యాడు. చివరకు భార్య గతాన్ని విస్మరించి తిరిగి తన జీవితంలోకి ఆహ్వానించిన తీరు మహోన్న తంగా ఉంది.

వితంతువైన రాధ అనాథ అయిన ఓ పాపను దత్తత తీసుకోవడం హృదయాన్ని స్పందింపజేసింది. పైపై మెరుగులకు ఆకర్షితుడై, నిజమైన ప్రేమకు దూరమై అనుక్షణం వివాదాల మధ్య బిడ్డను పెంచాల్సి వచ్చిన రాఘవ ఆ రాధనే జీవితభాగస్వామిగా చేసు కుని ఇండియాలోనే ఉండాలని నిర్ణయించుకుంటాడు. మన మూలాలు మరువరానివన్న సత్యాన్ని ఈ సంఘటన తెలిపింది. రాహుల్ - మిసిమిల మధ్య చిగురించిన ప్రేమ అందరి జీవితాలను చక్కదిద్ది ఒక్కటిగా చేసింది. మంచి మనసుకు మంచి జీవితమని తెలిపి, ప్రేమ చెట్టుపై వాలిన చిలుకల గుంపులా కనువిందు చేసింది.

సోమర్‌సెట్‌మామ్ 'జేన్' హాస్యంలో దాగిన జీవితసత్యాన్ని తెలియజేసింది. 'రేవు' నవల నాటి బడుగువర్గాల జీవితాన్ని కళ్లకుకట్టింది. అంకమ్మ తిరుగు బాటు, రామిశెట్టి పలాయన వాదాన్ని జయించిన తీరు అద్భుతంగా ఉంది. విలువైన విషయాన్ని చిన్నమాటలతో సూటిగా చెప్పే 'కొత్తగాలి' కవితలు నాకెంతో ఇష్టం.

– ***పిశిపాటి శైలజాజానకి,***
నవులూరు, గుంటూరు జిల్లా

## కొత్తగాలి...

**చదువులకు బడి**
**దేవుళ్లకు గుడి**
**అనాథలకు ఆదరించే ఒడి**
**ఉండాలోయ్! ఉండాలి!**

– కాళ్ల గోవిందరావు,
ఆముదాలవలస

ది. శేఖర్ విశాఖలో చదువుకుంటున్నాడు.

అత్తయ్య నన్ను చూసి "మరీ అర్భకంగా ఉంది పిల్ల. ఏం అన్నయ్యా! పిల్లకి సరిగ్గా తిండి కూడా పెట్టటం లేదా? " అంటూ భళ్ళున నవ్వింది. "అయినా ఫర్వాలేదు! పెళ్ళయ్యాక ఒళ్ళు ఎలాగు వస్తుంది!" అని జోకేసింది.

ఆవిడవైపు సీరియస్‌గా చూశాను.

అమ్మ నన్ను కళ్ళతోనే వారించింది.

"అబ్బే! అదేం లేదొదినా! నీకు తెలియనిదేముంది ఈకాలం పిల్లల తిండి సంగతి" అని అమ్మ సర్దుకోవడం చిరాకేసింది.

"నువ్వేమన్నా మాట్లాడరా" అన్నారు ఆ అబ్బాయితో.

నాకు అదే మంచిదనిపించింది. 'ఎట్ లీస్ట్ అతని ఇష్టాలు, అభిరుచులు తెలుస్తాయి కదా!' అనుకున్నాను.

ఇద్దరం కలిసి పెరట్లోని సంపెంగ చెట్టు కింద బల్ల మీద కూర్చున్నాం.

కొంతసేపు మౌనం.

"అబ్బ! ఏవిటీ వాసన? " అన్నాడు మొహం చిట్లిస్తూ.

"సంపెంగ పూల నుంచి! మనం ఆ చెట్టుకిందే కూర్చొన్నాం" అన్నాను.

"నీకు ఈ పూలు ఇష్టమా? " అన్నాడు.

"అవును" అన్నాను.

వెంటనే అతను తడుముకోకుండా "అవంటే నాకు అసహ్యం! ఆ వాసన అస్సలు పడదు" అన్నాడు.

నిర్ఘాంతపోయాను.

కొంచెంసేపు గడిచాక నా గదిలోకి తీసుకువెళ్ళాను.

గదిలోకి రాగానే, చెప్పులతోనే మంచం మీద కూర్చొన్నాడు. అసలే పెరట్లోకి వెళ్లి వచ్చాం కదా! చెప్పులకి మట్టి అంటుకునే ఉంటుంది. అది చిన్నవిషయమే కానీ ఎందుకో ములుకులా గుచ్చుకుంది.

"ఇప్పుడంటే పేరు పెట్టి పిలిచావు గానీ, పెళ్ళయ్యాక మటుకు పిలవకు! మావాళ్ల ముందు" అన్నాడు.

నా గదిలో ఉన్న పుస్తకాలు చూసి "ఓహో! నీకు పుస్తకాల పిచ్చి ఉందేమిటి? నా ఫ్రెండ్ ఒకడు ఉన్నాడు! వాడూ పుస్తకాల పురుగే" అంటూ హేళనగా మాట్లాడాడు.

షెల్ఫ్‌లోంచి ఒక్కో పుస్తకం పేరు తీసి చూస్తూ "చలం అంటే సినిమాల్లో వేస్తాడు అతనేనా? " అన్నాడు.

అలా ప్రతి పుస్తకం తీయడం, పేరు చదివి ఏదో ఒక సినిమా వాళ్ళతో కలిపి చెప్పేవాడు.

అప్పుడర్థమయింది.. తనకి సాహిత్యంతో అస్సలు పరిచయం లేదని.

"మీ నాన్న, అదే మావయ్య నాటకాలు బాగా ఆడతాడట కదా!" అన్నాడు.

నాకు ఒళ్ళు మండిపోయింది. వెంటనే అన్నాను "ఆడటం కాదు.. వేయడం. అసలు మా నాన్నకి ఎంత పేరు ఉందో తెలుసా? ఇప్పటికిప్పుడు నాన్న ఊc! అంటే చాలు సినిమాలో తీసుకోవడానికి రెడీగా ఉన్నారు. అదీ బ్లాంక్ చెక్ ఇచ్చి మరీ!" అని ఆవేశంగా అన్నాను.

"అయ్యో! అంత సీరియస్ అవకు! ఏదో సరదాగా అన్నాను"

"భాస్కర్! మీ ఇష్టాలు ఏవిటో చెప్పనే లేదు" అన్నాను.

"నువ్వు అడగలేదుగా!" అన్నాడు.

"ఇప్పుడు చెప్పండి!" అన్నాను.

"పేకాట అంటే ఇష్టం. అది కూడా డబ్బుపెట్టి ఆడటం! సినిమాలు కూడా చాలా ఇష్టం! అయితే ఏడుపుగొట్టు సినిమాలు కాదు.." అని కొన్ని పేర్లు చెప్పాడు. దాంతో అర్థమయింది అతని అభిరుచులేంటో.

వెన్నెలరాత్రులు, గోదావరి అందాలూ, తిలక్, చలం, శరత్ పుస్తకాలు సీరియస్ సినిమాలు ఇవేమీ అక్కర్లేదు అతనికి.

పైపైకి కనిపించేవి అంటేనే ఇష్టం. లోతులకి వెళ్లి ఆలోచింపచేసేవి నచ్చవని అర్థమయింది.

ఆ రోజుతో నా ఇష్టాలన్నీ లోపలి పొరల్లో మడతపెట్టి దాచేశాను. పెళ్లి చేసుకోబోయే మనిషి ఇష్టాయిష్టాలతో నిమిత్తం లేకుండా, కొత్త వాళ్ళతో, అందులో ఆడవాళ్ళతో ఏం మాట్లాడాలో తెలియని మనిషితో జీవితాంతం కలిసి ఉండాలంటే భయమేసింది.

పెళ్ళి జరిగిపోయింది. నాన్నకు ఉన్న పరపతి వల్ల పెళ్లి బాగా జరిగింది. భాస్కర్ చూడటానికి బానే ఉంటాడు. పెళ్ళయిన వెంటనే కాకినాడలో వాళ్లింటికి వెళ్ళాం. డబ్బు, ఆస్తి ఉన్నవాళ్లే! పెద్ద ఇల్లు! ఇంట్లో బోలెడు జనం.

కొత్తపెళ్లి కూతురిని కాబట్టి పైన గదిలో కూర్చోమన్నారు. కాసేపటికి అమ్మ వచ్చి నా దగ్గర కూర్చుని, అక్కడ ఎవరెవరు ఉంటారో? ఎలా ఉండాలో? చెబుతోంది. పొద్దున్న గృహప్రవేశం అయిన తరువాత నుంచి అసలు భాస్కర్ ఎక్కడున్నాడో కూడా తెలియదు.

అత్తయ్య ఆ పక్కనుంచి వెళుతూ మమ్మల్ని చూసి "ఏం వదినా! కూతురికి అత్తవారింట్లో ఎలా ఉండాలో చెబుతున్నావా? " అంది.

"అవునమ్మా! ఆడపిల్లనిచ్చుకున్నాకా తప్పుతుందా? " అంది.

"అయ్యో! దాన్ని కడుపులో పెట్టుకొని నా బిడ్డలా చూసుకుంటాను" అంది.

అది వట్టి నోటిమాటే అని అర్థమయింది. మా ఆడపడుచు శ్యామల, ఇంకా కొంతమంది ఆడవాళ్ళు ఏదేదో మోటుగా మాట్లాడుతున్నారు ఆ రాత్రి గురించి. అతను జాడ లేడు ఎక్కడా!

కింద అంతా హడావుడిగా ఉంది.

మా ఆడపడుచు "నువ్వు భోజనం చేసేయి" అని చెప్పి తిన్నాక పై గదిలోకి తీసికెళ్ళి "ఇది తమ్ముడి గది! ఇక్కడ పడుకో!" అని చెప్పి వెళ్లిపోయింది. ఎంతో ఆనందంగా గడపాల్సిన ఆ రాత్రిని.. అర్ధరాత్రి అదీ ఎప్పుడో నిద్రమత్తులో ఉన్న నన్ను మొరటుగా ఆక్రమించుకుంటూ "నువ్వంటే నాకు ఇష్టం! కానీ 'తాగుడు మానండి!' అంటూ డైలాగులు కొట్టొద్దు. ఈ అలవాటు నీకంటే ముందు వచ్చింది. అంటే నా మొదటి పెళ్ళాం అన్నమాట! అందుకని వదిలేయి అన్న మాట రాకూడదు నీ నోట. అలాగే మీ నాన్నకి, మీ అమ్మకి చెప్పడం, గోల గత్రా ఇలాంటివి నచ్చవు. నాకు నచ్చిందే చేస్తాను. చెప్పిన మాట వింటూ ఉండు నువ్వు" అని చెప్పి తన పనయ్యాక అటుతిరిగి పడుకున్నాడు. ఏమనుకున్నాడో మళ్ళీ నావైపు తిరిగి "ఇవాళ ఒక్కరోజు తాగాను. రేపటి నుండి మానేస్తాలే" అన్నాడు.

ఆ రేపు ఎప్పటికీ నా జీవితంలో రాలేదు.

ఆ రాత్రే అర్థమయింది. ఇతనితో జీవితం ఎలా ఉంటుందో? ఇప్పుడు నేను ఏడ్చి మొత్తుకొన్నా, అమ్మావాళ్లకి చెప్పినా, ఒరిగేది ఏమీ లేదు. కాబట్టి సహించడం అలవాటు చేసుకోవాలి. రాజీ పడాలి. అసలు ఈ జీవితమే రాజీలమయం.

అప్పటి నుండి నేను అన్నీ సహించడం, దేన్నయినా ఎదుర్కోవడం అలవాటు చేసుకోవడం మొదలుపెట్టాను.

తాగుబోతు భర్తను కట్టుకున్న ప్రతీ

ఆడదాని బతుకులో ఉండే అపస్వరాలే నా జీవితంలోనూ ఉన్నాయి.

నాలోని బాధను అక్షరాలు పంచుకొని మనసును తేలికపరుస్తున్నాయి.

అల్లుడు తన కళ్లముందే ఉంటే బాగుపడతాడని నాన్న రాజమండ్రికి వచ్చేయమన్నారు. నాకు సంతోషమనిపించింది. అమ్మ, నాన్న కళ్లముందు ఉంటారని, కానీ అతని పరిస్థితి ఏమీ బాగుపడలేదు. అక్కడికీ నాన్న చెప్పి చూశారు. అప్పటికి విన్నట్టే ఉండేవాడు. మళ్ళీ తన ధోరణి తనదే. అలా నాలుగేళ్ళు గడిచాయి. నాన్న ప్రాక్టీస్ తగ్గింది. కేసులు రావడం లేదు. మళ్లీ స్ట్రోక్ వచ్చింది నాన్నకి. ఆదాయం తగ్గి, ఖర్చులు ఎక్కువయ్యాయి. ఇక చేసేది లేక ఇల్లు అమ్మేశాం. వచ్చిన డబ్బు బ్యాంకులో వేసి ఇల్లు అద్దెకు తీసుకున్నాం. కానీ కొన్నిరోజులకే నాన్న పోయారు.

కృష్ణ, బలరాం వచ్చారు, మాధవయ్యగారి ద్వారా తెలిసి. నన్ను ఆ పరిస్థితిలో చూసి చాలా బాధపడ్డారు. ఈ విషయాలు ఎందుకు చెప్పలేదని ఇద్దరూ విచారం వ్యక్తం చేశారు.

నేను ఒకటే అన్నాను "ఇది ఒకనాటిది కాదు, ఒకళ్ళు తీర్చేది కాదు. నేనే ఎదుర్కోవాలి, యుద్ధం చేయాలి. కాకపోతే ఒక సాయం చేయండి. నా మీద జాలి మాత్రం పడకండి" అని కచ్చితంగా చెప్పాను. "సరదాగా వచ్చి కబుర్లు మాత్రం చెప్పండి. అదే నాకు సంతోషాన్నిస్తుంది" అన్నాను.

భాస్కర్ కోర్టుకి వెళుతున్నాడు. ఏదో తంటాలు పడి కేసులు వచ్చేలా చేస్తున్నారు నాన్న మీద అభిమానంతో ఇద్దరు ప్లీడర్లు. వాళ్ళు నాన్న దగ్గర జూనియర్లుగా పనిచేసి, తర్వాత సొంతంగా ప్రాక్టీసు చేస్తున్నారు. కానీ ఏం లాభం? భాస్కర్ తాగేసి పడిపోయేవాడు కోర్టులోనే.

అమ్మ అయితే 'నీ గొంతుకోశానే!' అని ఒకటే ఏడుపు. కొంతకాలానికి భాస్కర్ తల్లిదండ్రులు పోయారు. అతని తోడబుట్టినవాళ్ళతో రాకపోకలు లేవు. ఇక పట్టపగ్గాలు లేవు. ఇలా ఓ ఏడాది గడిచింది.

ఆ తరువాత ఎందుకనో కొన్నిరోజులు బానే ఉన్నాడు భాస్కర్. తాగుడు, పేకాట మానలేదు కానీ కాస్త తగ్గినట్లు అనిపించింది. కాస్త నయమే అనుకున్నాను.

అమ్మ 'పోనీలే ఏదో బావున్నాడు, అంతే చాలు!' అనుకుంది.

అమ్మని చూస్తే జాలి వేసింది. నాన్న ఉన్నంతకాలం మహారాణిలా రాజభోగాలు అనుభవించింది. జీవితంలో ఇలాంటి పరిస్థితి వస్తుందని అనుకోలేదు.

ఎందుకో ఈ మధ్య బొత్తిగా అన్నం తినబుద్ధి కావటం లేదు. ఆ రోజు తను కోర్టుకి వెళ్ళాక, లేడీ డాక్టర్ దగ్గరకు వెళ్ళి చూపించుకున్నాను. ఆవిడ నాకు మూడో నెల నడుస్తోంది అని చెప్పింది. సంతోషం అనిపించింది. 'ఒక చిన్నిప్రాణం నాది అనేది నాకు తోడుగా, నా కోసం, నా సొంతం..' ఇలా ఏవేవో అందమైన ఊహాలోకాల్లో విహరిస్తూ ఇంటికి వచ్చాను. ఆ విషయం అమ్మకి చెప్పాను.

"పోనీలే అమ్మా! ఈ బుజ్జిగాడు పుట్టి, వాళ్ళ నాన్న బుద్ధి మారిస్తే చాలు. పిల్లాడు పుట్టాడని అయినా బాధ్యతగా ఉంటాడని అనుకుందాం" అంది.

నేను గదిలోకి వెళ్ళాను తనకి చెబుదామని. ఆ సంతోషంలో అతనికి కూడా భాగం ఉంది కదా! కానీ అక్కడ లేడు. బహుశా ఇంకా కోర్టు నుంచి రాలేదేమో అని చూస్తున్నా.

ఇంతలో అమ్మ వచ్చి "అసలే వట్టి మనిషివి కాదు, భోజనం చెయ్యి" అంది.

"తను రానీ" అన్నాను.

"ఆс! వచ్చాడు, భోజనం చేసి వెళ్ళాడు. వెళుతూ ఈ కవర్ ఏదో నీకు ఇమ్మన్నాడు" అంటూ ఓ కవర్ ఇచ్చింది.

## కొత్తగాలి...

**జలకళ ఉంటేనే**
**జనకళ!**
**జనకళ ఉంటేనే**
**జగతికి కళ!**

– మా. శ్రీ. రాజు,
పాల్వంచ, ఖమ్మం జిల్లా

అందులో ఓ సంబోధన లేదు. రెండే రెండు వాక్యాలు.

'నా కోసం వెతక్కండి! నేను ఇంట్లోంచి వెళ్ళిపోతున్నాను!' అని ఉంది.

మొదట నాకు అర్థం కాలేదు. మళ్ళీ చదివాను, మళ్ళీ మళ్ళీ చదివాను. చిత్రంగా నాకు ఏడుపు, కోపం రాలేదు. అతను ఒక బంధానికి కట్టుబడి ఉండే వాడు కాదు. జీవితానికి ఒక విలువ ఉంటుందని తెలియని మూర్ఖుడు.

తాగుడు, పేకాట, ఆడవాళ్ళు. ఇవే జీవితం అతని దృష్టిలో. వాటికోసమే తల్లి దండ్రులను వదిలేశాడు. ఇప్పుడు కట్టు కున్న భార్యను వదిలేసి వెళ్ళిపోయాడు. అవును అతని అవసరాలు తీర్చగలిగే డబ్బు లేదు. పనిచేసి పెళ్ళాం పిల్లల్ని పోషించుకోవడానికి బద్ధకం. 'అయ్యో! ఎందుకు వెళ్ళిపోయాడు? నా జీవితం ఇలా అయిందేమిటి?' అని అనుకోలేదు.

ఏడుపు పరిష్కారం చూపించదు. శాంతంగా ఆలోచించాను. ఇప్పుడు నేనేమి చెయ్యాలి? ఇది నా జీవితం. ఇప్పుడు నాకో తోడు కూడా ఉంది అని పొట్టను తడుముకున్నాను. ఇది నా పోరాటం. ఇందులో ఎవరినీ ఇబ్బంది పెట్టదలచుకో లేదు. ఒక్కోసారి అనుకుంటాం తలుపులు అన్నీ మూసుకుపోయాయని. కానీ ఒకటి మూసుకుంటే వేరేది తెరుస్తాడు ఆ దేవుడు. అది నాపట్ల రుజువైంది.

ఆరోజు పేపర్‌లో ఒక ప్రకటన చూశాను. ఊరి శివార్లలో ఉన్న ఓల్డేజ్ హోంలో పనిచేయడానికి మనుషులు కావాలని ఉంది. వాళ్ళకి ఫోన్ చేశాను. వివరాలు అడిగారు. మాకెవరూ లేరని చెప్పాను. నేను, మా అమ్మా ఉంటామని చెప్పాను.

మరునాడు రమ్మన్నారు. అది ఎవరో ధర్మాత్ముడు నడిపిస్తున్న హోం. అక్కడికి వెళ్ళిపోయాం. కడుపు నిండా తిండి, ఉండ టానికి నీడ దొరికాయి. అక్కడ హోంని చూసుకునే బాధ్యత నాకిచ్చారు. అన్నీ సక్ర మంగా జరుగుతున్నాయా? లేదా? అని సూపర్‌వైజ్ చెయ్యడం. బానే ఉండేది. కొంత ప్రశాంతత ఏర్పడింది. నాకు వేరే ఆలోచనలే లేవు. నెలలు నిండాయి. హోంకి వచ్చే డాక్టర్ తన నర్సింగ్‌హోం లోనే డెలివరీ చేసింది.

రోజులు గడిచిపోతున్నాయి.

పాపకు 'రమ్య' అని పేరు పెట్టుకు న్నాను. అక్కడే ఉన్న స్కూల్‌లో చేర్పిం చాను. అమ్మ మట్టుకు అప్పుడప్పుడు పాత రోజులు గుర్తు తెచ్చుకొని బాధపడుతోంది. నాకు అసలు అక్కడ టైం ఎలా గడిచిపో తోందో తెలియదు.

అక్కడ ఎన్నో కథలు, కన్నీళ్లు, వ్యధలు! కొన్ని కట్టెలు కాలటానికి సిద్ధం, మరెన్నో పండుటాకులు రాలటానికి సిద్ధం! వీరిని ప్రపంచం విస్మరించిందా? లేక కన్నపేగే రక్త సంబంధాన్ని తెంచి దూరమయిందా? అని అనుమానం కలుగుతుంది. విధి ఆడుతున్న వింత నాటకంలో పావులు, జీవచ్ఛవాలుగా మిగిలిన ఈ వృద్ధులు.. మానవ సంబంధాలు మృగ్యమైపోతు న్నాయి అనే మాటను నిజం చేస్తూ వృద్ధా శ్రమాలు పెరిగిపోతున్నాయి. చివరిదశలో వారికి కావాల్సింది గుప్పెడు ప్రేమ. వాళ్ళ ముందు నా బాధ ఎంత? అనుకునే దాన్ని. అందుకే వాళ్ళతో మమేకమై,

వాళ్ళలో ఉత్సాహాన్ని నింపేదాన్ని. వాళ్ళు కూడా ఎప్పుడూ నీ భర్త ఎక్కడ? అని అడిగేవారు కాదు. పెద్దవాళ్ళు గనుక వాళ్ళకి అర్థమయ్యే ఉంటుంది నా జీవితం ఏమిటో? నేను ఏమిటో?

ఎప్పుడన్నా ఒంటరిగా కూర్చొన్నప్పుడు శ్రీరామ్ గుర్తుకొచ్చేవాడు. అతని ప్రేమ గుర్తుకొచ్చేది. కానీ అంతలోనే అది ముగిసిపోయిన కథ. అదే తలచుకుంటూ కుమిలిపోకూడదు అని నాకు నేనే సమాధానపరచుకొని, పనిలో పడిపోయేదాన్ని.

రమ్య పెద్దదవుతోంది. ఊహ తెలుస్తోంది. స్కూల్‌కి వెళుతోంది కదా! అన్ని విషయాలూ గమనిస్తోంది. ఒకసారి అడిగింది "డాడీ ఎక్కడ ఉంటారు?" అని.

"చాలా దూరంగా ఉన్నారు. నువ్వు పెద్దయి బాగా చదువుకున్నాక మనం వెళ్దాం" అని సర్దిచెప్పి చెప్పాను.

ఈమధ్య ఎందుకో తరచూ జ్వరం వస్తోంది. ఏవో మందులు వేసుకుంటున్నాను, బరువు తగ్గినట్లూ అనిపిస్తోంది.

హోంకి రెగ్యులర్‌గా వచ్చే డాక్టర్‌తో పరీక్ష చేయించుకున్నాను. ఆవిడ చూసి వెంటనే మీరు "నాతో హాస్పిటల్‌కి రండి. అక్కడ టెస్టులు చేయిస్తాను" అంది.

ఇన్నేళ్ళలో నేను ఈ హోం దాటి బయటకు అడుగుపెట్టలేదు. ఆ హోమే నా ప్రపంచం.

అలాంటిది మళ్ళీ చాలా ఏళ్ళ తరువాత ఊర్లోకి వెళ్ళాను. అంతా మారిపోయింది. హాస్పిటల్‌కి వెళ్ళాం. బోలెడు రకాల టెస్టులు చేశారు. చాలా టైం పట్టింది. నాతోపాటే ఆవిడ కూడా ఉన్నారు.

"నా గురించి ఎంతో శ్రమ తీసుకుంటున్నారు" అన్నాను.

దానికి ఆవిడ ఏం మాట్లాడలేదు. "పదండి! పెద్ద డాక్టర్ దగ్గరకు వెళదాం!"

లోపలికి వెళ్ళాం. అక్కడ ఆ పెద్ద డాక్టర్ ఎవరో కాదు బలరాం!

నన్ను చూసి మొదట గుర్తుపట్టలేదు. నేనే "బావున్నావా బలరాం?" అన్నాను.

నన్ను చూసి షాక్ తిన్నాడు "ఇన్నాళ్ళు ఎక్కడున్నావు? ఇలా అయిపోయావేమిటి గౌతమీ? నాన్నగారు చివరి రోజులలో మీ గురించి ఎన్నిసార్లు అడిగారో?" అన్నాడు.

"అయ్యో! మాధవయ్యగారు పోయారా?" అన్నాను.

"అవును, రెండేళ్ళు అయింది. అయినా నువ్వేంటి ఇక్కడ?" అంటూ నాతోపాటు వచ్చిన డాక్టర్‌తో "ఇప్పుడు మీరు తెచ్చిన రిపోర్ట్స్ ఈవిడవేనా?" అన్నాడు.

"ఎస్! ఈవిడవే డాక్టర్"

బలరాం ఎవరెవరికో ఫోన్ చేస్తున్నాడు. డాక్టర్లని ఎన్నో ప్రశ్నలు వేస్తున్నాడు. రిపోర్ట్స్ గురించి ఫోనులో చాలాసేపు మాట్లాడాడు.

గంట అయింది. రెండుసార్లు కాఫీ తెప్పించాడు. మనిషి ఎందుకో టెన్షన్ పడుతున్నాడు. అప్పుడు నాకు అర్థమయింది. ఆ రిపోర్ట్స్‌లో ఏదో ఉంది, అందుకే కంగారుపడుతున్నాడు.

"బలరాం! ఏమైంది చెప్పు?" అన్నాను.

"ముందు నువ్వు హాస్పిటల్‌లో అడ్మిట్ అవుతున్నావు" అన్నాడు.

నర్సుని పిలిచి "ఈవిడని ఆ స్పెషల్ రూమ్‌కి తీసుకెళ్ళండి" అని చెప్పాడు.

"గౌతమీ! వెళ్ళు నేను వస్తాను" అని నాకు చెప్పాడు.

"అయ్యో! అదేమిటి నన్ను అడ్మిట్ చేస్తున్నావు? ఏదో మామూలు జ్వరానికి.. అక్కడ అమ్మ, పాప ఉన్నారు" అన్నాను.

"వాళ్ళ సంగతి నేను చూసుకుంటాను. నువ్వు ఏం మాట్లాడకు" అని చెప్పాడు.

సాయంకాలానికి కృష్ణ వచ్చాడు. నాతో మామూలుగానే మాట్లాడాడు. అప్పుడు ఇద్దరూ మాట్లాడుతుండగా బలరాం భార్య ఉష, తనూ డాక్టరే, భలే ఉంది.. కొంచెం పొట్టి! ఇద్దరూ కలిపి నర్సింగ్ హోం

పెట్టారు. కృష్ణ భార్య నాకు తెలుసు, శాంతి. కానీ తను ఇప్పుడు రాలేదు. గీత జైపూర్‌లో ఉంటోంది. ఇద్దరు పిల్లలని చెప్పాడు కృష్ణ.

"సో అందరూ, జీవితంలో సెటిల్ అయ్యారు చక్కగా. మనం అందరం కలుసుకున్నాం, శ్రీరామ్ సంగతి ఏమైనా తెలిసిందా? " అంటుండగా గొంతు వణికింది.

"లేదు" ఇద్దరూ ఒకేసారి అన్నారు.

అలా మాటలలో పెట్టి బలరాం, "ఇప్పుడు నువ్వో ఛాలెంజ్‌ని ఫేస్ చెయ్యాలి" అన్నాడు.

"తప్పకుండా" అన్నా సరదాగా.

"నీ రిపోర్ట్స్ అన్నీ చూశాను. ముంబయికి కూడా పంపాను. క్యాన్సరు అడ్వాన్సు స్టేజిలో ఉంది. నువ్వు జ్వరాన్ని, బరువు తగ్గిపోవడాన్ని నిర్లక్ష్యం చేశావు. ఇప్పుడు డాక్టర్స్ కూడా ఏమీ చెయ్యలేని ప్రమాద స్థితికి వచ్చేశావు" అని ఓ క్షణం ఆగి "నీకు ఈ క్షణం నుండే ట్రీట్‌మెంట్ మొదలుపెడుతున్నాను" అని చెప్పాడు.

కృష్ణ వెంటనే నా దగ్గరకు వచ్చి "నువ్వు, వాడు చెప్పినట్లు వినాలి అంతే" అన్నాడు.

నాకు అర్థమయింది. మృత్యుదేవత చాలా దగ్గరగా వచ్చేసింది.

"ఇంకెంత సమయముంది? " అన్నాను.

అప్పుడు చెప్పలేదు.

కానీ తర్వాత తెలిసింది మహా అయితే నెలా, రెండు నెలలు..!

ఓ మరణమా! నువ్వెక్కడ ఉన్నావు? నాలోనా, మరి పుట్టినప్పటి నుండి పక్కనే ఉంటే కనిపించవెందుకు?

ఈ ఒక్కటి చెప్పు నన్ను ఎక్కడకి తీసుకుని వెళతావు? ఏం చేస్తావు? అసలు నీ అంతరంగంలో ఏముంది?

అన్నీ జవాబు లేని ప్రశ్నలే!

చాలాసార్లు అనిపించేది. నేను లేకుండా ఈ లోకం అంతా ఎలా ఉంటుంది? నేను ఉండను. మిగతా అంతా ఇలాగే ఉంటుంది. ఏ మార్పూ ఉండదు. గాలి వీస్తుంది. వాన పడుతుంది. ఎండ కాస్తుంది.. గర్ల్‌ఫ్రెండ్ పంపే మెసేజ్‌లు చూసుకుంటూ మురిసేపోయే వార్డ్‌బాయ్, డాక్టర్ వస్తే చెప్పమని, గుర్రుకొట్టి నిద్రపోయే డ్యూటీ నర్సు.. అందరూ ఇలాగే ఉంటారు. నేనేగా ఉండనిది.

"ఎలాగూ వెళ్లక తప్పదు. అందుకే రెడీగా ఉంటే పోలా.." అనేదాన్ని కృష్ణ, బలరాంలతో.

దానికి వాళ్ళు కోపంగా అనేవారు "అవన్నీ నువ్వు ఆలోచించకు, బతుకుతానని పాజిటివ్‌గా అనుకో. లేకపోతే ఏ మందులూ పనిచేయవు" అని.

వాళ్ళకు తెలియదా? తెలుసు! నేను యుద్ధం చేస్తున్నానని, నా శత్రువు అతి బలవంతుడని. అయినా పోరాటం తప్పదు, ఆఖరి ఊపిరి వదిలే వరకు.

ఒక వ్యక్తిని మనసారా ఇష్టపడితే అంత తేలికగా మర్చిపోలేం. నాపట్ల అదే జరిగింది. నిన్ను మర్చిపోలేకపోయాను శ్రీరామ్. నీ సాంగత్యంలో గడపాలన్న కోరిక తీరలేదు. నీ కళ్ళు అంటే నాకిష్టం. ఆ కళ్ళని చూస్తూ ఉండిపోవాలనిపించేది. ఇష్టపడింది, కోరుకున్నది జరగకపోవడం.. ఇదేగా జీవితం?

కళ్ళ ముందు ఎన్నో గడిచిన సంగతులు, కలలు వెన్నెలలో పడవ ప్రయాణం, సంపెంగ చెట్టుకింద చెప్పుకున్న కబుర్లు, స్మృతులు. అవన్నీ తల్చుకుంటున్న నాకు చచ్చిపోతానని భయం వేయటం లేదు. చివరిసారిగా నిన్ను చూడలేకపోతున్నానే అని బాధగా ఉంది.

కృష్ణని ఆకు సంపెంగలు కావాలని అడిగాను. వెంటనే తెప్పించాడు.

ఆ పరిమళం ప్రతిక్షణం, ప్రతిఘడియ నువ్వు నా చెంతనే ఉన్న అనుభూతిని ఇచ్చింది.

నాకు సెలవయింది. ఇదే నా వీడ్కోలు.

అ
క్ష
రం

ఎక్కువ తక్కువలు
కులమత భేదాలూ
ఉండడం మానవజాతికి
అవమానకరం!

– మహాత్మాగాంధీ



అదిగో నా మృత్యువు వస్తోంది. ప్రయాణానికి సిద్ధం అవమని ప్రకటన చేస్తోంది.

ఇక రాయగలిగే శక్తి ఉంటుందో ఉండదో.. నేస్తమా సెలవు!!

## శ్రీరామ్...

తరువాత పేజీలు ఖాళీగా ఉన్నాయి. డైరీ మూసేశాను. సప్త సముద్రాలు దాటినా, నిన్ను నా గుండెల్లో దాచుకున్నానే! కానీ ఇంతటి విషాదాన్ని నాకు ఎందుకు మిగిల్చావు, గౌతమీ? ఇక ఈ జన్మకి నిన్ను చూడలేనే.. అయ్యో! నా గుండెలు ఎందుకు బద్దలు కావటం లేదు? మనసు అంతా విషాదంగా ఉంది. కళ్ళలో నీళ్ళు ధారలుగా కారుతున్నాయి!

మరునాడు బాగా పొద్దెక్కిన తరువాత తెలివి వచ్చింది. తలంతా భారంగా ఉంది.

కింద పిల్లల మాటలు, అరుపులు వినిపిస్తున్నాయి. అంతా హడావుడిగా ఉంది.

ఓహో.. కృష్ణ పిల్లలు ఊరు నుండి వచ్చుంటారనుకుని కిందకి దిగి వెళ్ళాను. నన్ను చూసి శాంతి "వీళ్ళ హడావుడికి లేచేశావా? రెండు రోజులు శెలవు వస్తే మా ఊరు పంపించాను. ఇంక వస్తూనే ఏదో ఒక అల్లరి" అంది.

"పిల్లలు అన్నాక అల్లరి చేయకపోతే సందడే ఉండదు శాంతీ" అంటూ ఆలోచనలో పడిపోయాను.

వాళ్ళు నన్ను పలకరిద్దామని వచ్చినట్లున్నారు. కాని నా వాలకం చూసి భయమేసి వెళ్ళిపోయినట్లున్నారు. నేను చూస్తూనే ఉన్నాను గాని నా చూపు, మనసు ఎక్కడో ఉన్నాయి.

"శ్రీరామ్! ఒక రెండు గంటలు ఆఫీసుకి వెళ్ళి వస్తాను. హాయిగా కళ్ళు మూసుకొని పడుకో, ఎక్కడికీ వెళ్ళకు" కృష్ణ నా దగ్గరకి వచ్చి అన్నాడు.

"నిన్న ఒక ఆశతో బయటకు వెళ్ళాను. ఇవాళ ఎక్కడికీ వెళ్ళనులే!" అని నా గదిలోకి వెళ్ళిపోయాను.

ఒక్కరోజులో ఎంత మార్పు!

"శాంతీ! వాడిని ఓ కంట కనిపెడుతూ ఉండు" అని కృష్ణ అనడం వినిపించింది.

వాడి భయం గానీ నేను నిన్నటి నుండీ తిండి తినడం లేదా? నిద్రపోవటం లేదా? అన్ని పనులూ అతి మామూలుగా ఎప్పటిలాగే జరిగిపోతూనే ఉన్నాయి, తను లేదని తెలిసినా! అదే.. అందుకే.. దుఃఖం వేస్తోంది.

★ ★ ★

బలరాం, ఉషలు మెడికల్ కాన్ఫరెన్స్ నుంచి తిరిగి వచ్చారు. రాజమండ్రిలో దిగిన వెంటనే ఇద్దరూ ముందు కృష్ణ ఇంటికి వచ్చేశారు.

"ఒరేయ్ శ్రీరామ్! ఎన్ని ఏళ్ళు అయిందిరా నిన్నుచూసి! నీ గురించి అసలు ఎంత ఎదురు చూశానో తెలుసా? తీరా నువ్వు వచ్చేసరికి మేం ఇద్దరం ఊరెళ్లాం"

"కృష్ణ అంతా చెప్పాడు"

"ప్చ్! తప్పలేదు, అక్కడకు వెళ్ళడం వల్ల చాలా ఉపయోగాలున్నాయని. ముఖ్యంగా గౌతమిలా చివరి క్షణాల వరకు తమలో ఉన్న జబ్బు ఏమిటో కూడా తెలియని స్థితిలో ఉండేలా కాకుండా కొంత అవేర్

నెస్ వచ్చేలా, దాని ద్వారా తొందరగా చికిత్స జరిగేలా చెయ్యాలని ఈ కాన్ఫరెన్స్ ఉద్దేశ్యం. అందుకోసం వెళ్ళాల్సి వచ్చింది" అంటూ హత్తుకున్నాడు.

వాడు చూపించిన ఆత్మీయతకు నా కళ్ళు నిండు గోదావరిలా అయ్యాయి. హృదయం దుఃఖంతో బరువెక్కింది. ఒక మనిషికి ఇంతకంటే ఏం కావాలి? చేతి నిండా డబ్బు, కొనిపడేసిన ఆస్తులు కావు. ఆప్యాయంగా పలకరించే మనసు కావాలి.

అక్కడే ఉన్న కృష్ణ "బలరాం! మనం ముగ్గురం మాట్లాడుకోవాలి. నువ్వు వీలు చూసుకొని టైం చెప్పు" అన్నాడు.

"సరే ఫోన్ చేస్తా, బై కృష్ణా! రెస్ట్ తీసుకో శ్రీరామ్" అని వెళ్ళిపోయాడు బలరాం. ఉష కూడా వెళ్ళిపోయింది.

ఆరోజు మరోసారి తన డైరీ చదువుతూనే గడిపేశా. చెట్టుకున్న సంపెంగను కోసుకొని జేబులో పెట్టుకున్నాను. ఆ రోజు గది విడిచి బయటకు రాలేదు. కృష్ణ కూడా నన్ను ఒంటరిగా వదిలేశాడు ఆరోజు మొత్తం.

రెండోసారి గౌతమి డైరీ చదివిన తరువాత, చిత్రంగా నా మనసు శాంతించింది.

గౌతమి ఒక ధీర, ఆఖరి ఊపిరి విడిచే వరకు వీరమరణం పొందిన సైనికుడిలా, బతుకుతో, అంతకు ముందు జీవితంతో పోరాడింది. పిరికి దానిలా ఏడవలేదు. ఎవ్వరి సానుభూతీ కోరలేదు. పైగా 'మృత్యుదేవతని వట్టి చేతులతో పంపను. నా జీవితాన్నే ఇస్తాను' అని చెప్పి మరీ వెంట వెళ్ళింది.

మరుసటి రోజు పొద్దున్నే ఫోన్ చేసి చెప్పాడు బలరాం "ప్రశాంతి వనానికి వెళ్ళాం రెడీగా ఉండండి" అని.

పొద్దునే వచ్చాడు. ముగ్గురం కలిసి ధవళేశ్వరం వెళ్ళాం. అన్నట్లుగానే పి.డబ్ల్యు.డి ఆఫీస్ దాటి ముందుకు వెళితే వస్తుంది ప్రశాంతివనం.

దానికి ఎదురుగుండా ధవళేశ్వరం బ్యారేజి, ఆ పక్కన గోదావరి కనిపిస్తుంటాయి. మా కారు హారన్ వినగానే సెక్యూరిటీగార్డు వచ్చి కృష్ణని, బలరాంని విష్ చేస్తూ గేటు తీశాడు. లోపలికి వెళుతూనే చూశాను. రోడ్డుకి రెండు పక్కలా చెట్లు, వాటి మధ్యలో సిమెంట్ బెంచీలు. ఆహ్లాదంగా ఉంది. ఒక అరమైలు దాటాక పెద్ద బిల్డింగ్ ఉంది. 'ప్రశాంతి వనం' అని పెద్ద బోర్డు కనిపిస్తోంది. కారు దిగి ఆఫీస్ అని రాసున్న బోర్డువైపు నడుస్తున్నాడు బలరాం.

వెళుతున్న అతన్ని చాలామంది పెద్దవాళ్ళు, ఆడవాళ్ళు, మగవాళ్ళు కూడా 'నమస్కారం డాక్టర్ గారు' అని పలకరిస్తున్నారు. కొంతమంది 'డాక్టర్‌గారు ఈ మధ్య ఊర్లో లేరు కదా' అంటూ తలో మాట మాట్లాడుతున్నారు.

వారి పలకరింపులకి చిరునవ్వుతో సమాధానాలు చెబుతూ ముందుకు వెళుతున్నాడు బలరాం. కొంతదూరం వెళ్ళిన తరువాత ఒక పెద్ద బిల్డింగ్ వచ్చింది. అందులో చాలా గదులున్నాయి. అక్కడున్న ఒక గదిలోకి వెళ్ళాం ముగ్గురం. ఆ గదిలో మంచం మీద ఒక పెద్దావిడ పడుకొని ఉన్నారు.

"ఎలా ఉన్నారు? కళ్ళు తెరవండి, నేను వచ్చేశాను ఊరు నుంచి" అంటూ ఆవిడని లేపాడు బలరాం.

ఆ మాటలు విని ఆవిడ కళ్ళు తెరిచింది. బలరాంని చూస్తూనే "వచ్చావా? ఇన్ని రోజులు ఎక్కడికి వెళ్ళావు? " అని అడిగింది.

"పనిమీద బెంగళూరు వెళుతున్నాను అని చెప్పానుగా" అన్నాడు.

'మర్చిపోయాను' అన్నట్లుగా సైగ చేసిందావిడ.

"బ్రేక్‌ఫాస్ట్ అయిందా? "

"ఆ! చేశాను. శుభ్రంగా తిండి తింటూ

ఉన్నాను. అందరినీ మింగేసి" అంటూ కళ్ళనీళ్ళు పెట్టుకున్నారావిడ.

అప్పుడు ఆవిడని పరిశీలనగా చూశాను.

"ఆవిడ.." అంటూ ఆశ్చర్యంగా చూసాను కృష్ణవైపు.

'నువ్వు ఊహించినది కరెక్టే' అన్నట్లు తలూపాడు.

ఆమె అన్నపూర్ణమ్మగారు!

వెంటనే ఆవిడ దగ్గరకు వెళ్ళి చేతులు పట్టుకున్నాను. నిండుగా అపర లక్ష్మీదేవిలా ఉండే ఆవిడకి, ఇప్పుడు నేను చూస్తున్న రూపానికి అస్సలు పోలికే లేదు. కాలం దారుణంగా మార్చేస్తుంది జీవితాన్ని అనిపించింది. కళావిహీనంగా ఉన్న మొహం, చిక్కిశల్యమైన శరీరం.. ఆమెని బాధగా చూస్తూ ఉండిపోయాను.

నేను ఎవరో అర్థం కానట్లు చూశారు ఆవిడ వాళ్ళిద్దరివైపు. అప్పుడు కృష్ణ చెప్పాడు "మన శ్రీరామ్ మిమ్మల్ని చూడటానికి వచ్చాడు" అంతే ఆవిడలో దుఖం కట్టలు తెంచుకొని వచ్చింది. అన్నేళ్ళు మనసులో దాచుకున్న మాటలు నన్ను చూడగానే ప్రవాహంలా వచ్చేశాయి.

"చూడు శ్రీరామ్! ఎలా అయిపోయానో, అందరూ నన్ను వదిలేసి వెళ్ళిపోయారు. ఇలా ఏకాకిగా మిగిలిపోయాను, ఏదో శాపం పెట్టినట్లు. నువ్వు వెళ్ళిపోయావు మాకు అప్పటి నుంచే కష్టకాలం మొదలయింది. దాని మాట వినకుండా పెళ్లి చేసేశాను. అప్పటికీ అది అంది 'అమ్మా ఇప్పుడే వద్దు' అని. కానీ నాకు భయం వేసింది. అప్పటికే నమ్మినవాళ్ళు ఆయన్ని నడిసముద్రంలో ముంచేశారు.

ఇక జీవితంలో పెళ్లి చెయ్యలేమేమో అనే ఆదుర్దా. అడిగి చేసుకుంటున్న సంబంధం కాబట్టి పిల్ల సుఖపడుతుందని అనుకున్నాను. కానీ దాని జీవితం ఇలా అర్థాంతరంగా ముగిసిపోతుందని తెలియదు. చేసిన పాపం చెబితే పోతుందని, గౌతమి నీ మీద మనసు పెట్టుకుందని తెలిసి కూడా ఆ పెళ్ళి చేశాను. నా తల్లి ఎన్ని కష్టాలు పడిందో.. ఒక్కముక్క కూడా నాకు చెప్పలేదు. అన్నీ గుంభనంగా దాచేసింది. ఎప్పుడూ 'నేను బానే ఉన్నాను' అనే చెప్పేది" అని ఇక మాట్లాడలేక ఆయాసపడసాగారు.

వెంటనే బలరాం ఒక నర్స్‌ని పిలిచి ఆవిడకి ఇంజెక్షన్ ఇయ్యమన్నాడు.

క్రమంగా ఆవిడకి మత్తు ఆవరించింది. మేం ముగ్గురం ఆ గదిలోంచి బయటకు వచ్చాం. నా మనసంతా దిగులుగా ఉంది.

ముగ్గురం పైన గదిలో కూర్చొన్నాం. అది బలరాం ప్రైవేటు గది. సోఫా, ఫ్రిజ్, టీవీ, ఒక డబుల్‌కాట్ అన్నీ ఉన్నాయి. తన గది బాల్కనీలోంచి దూరంగా గోదావరి కనిపిస్తోంది. కృష్ణ ఫ్రిజ్‌లోంచి మంచినీళ్ళ బాటిల్ తీసి ఇచ్చాడు. అవి అందుకొని తాగాను.

బలరాం నా చేతులు పట్టుకొని "గౌతమి బతికి ఉండగా నిన్ను చూపించాలని చాలా ప్రయత్నం చేశాను. కానీ అదే సమయానికి నువ్వు లేకపోవటం, మా ఫోన్ రీచ్ అవ్వకపోవడం నిజంగా దురదృష్టం. నాకు తెలుసు నువ్వు తనని కలవాలని ఉన్నా, ఎందుకు రాలేకపోయావో? బట్ అన్నీ వెంటవెంటనే జరిగిపోయాయి. కొంచెం కూడా టైం లేకుండాపోయింది, అది పూర్తి అడ్వాన్సు స్టేజిలో గుర్తించడం వల్ల. అసలు ఎలా మొదలుపెట్టాలి ట్రీట్మెంట్? అని ఎంత మధన పడ్డామో, ముంబయి నుంచి స్పెషలిస్ట్‌ని కూడా పిలిపించాం. కానీ వాళ్ళు అదే అన్నారు, సమయం మించిపోయింది అని. ఏదైతేనేం గౌతమిని బతికించుకోలేకపోవడం ఒక డాక్టర్‌గా నేను ఓడిపోయానేమో అనిపిస్తోంది. చివరి క్షణాలలో మట్టుకు నీ కోసం చూసిందనిపించింది" అన్నాడు.

నేను మౌనంగానే ఉన్నాను.

అప్పుడు కృష్ణ అన్నాడు "కలకత్తా వెళ్ళాక ఉత్తరం రాస్తాను అన్నావు. ఒక్కటి వచ్చింది. ఆ తరువాత ఏమైందిరా? పోని మేం రాద్దామంటే మా దగ్గర అడ్రస్ లేదు, ప్లీడరు గారిని అడిగి, ఫోను నెంబర్ తీసుకున్నాం. ఫోన్ చేసినప్పుడల్లా ఎవరో బెంగాలీలో మాట్లాడతారు మాకు ఒక్క ముక్క అర్థమయి చావలేదు. అలా రెండు మూడుసార్లు చేశాం. కానీ లాభం లేకపోయింది. ఆ తరువాత నీ దగ్గర్నుంచి ఎటువంటి కమ్యూనికేషనూ లేదు. పైకి అడగకపోయినా గౌతమి కళ్ళలో నీ గురించిన విషయం తెలిసిందా? అన్న ప్రశ్న కనిపించేది. అందుకే కొన్నిరోజులు తన ఎదుట పడలేదు. కాలమే అన్ని గాయాలకూ మందు కదా!

ఇప్పుడు చెప్పరా! మీ బాబాయి దగ్గరకి వెళ్ళి అక్కడ నుంచి అమెరికా ఎలా వెళ్ళావు? అంతదూరం వెళ్ళిపోయాక కూడా, నీకు మమ్మల్ని కలవాలని, మాట్లాడాలని అనిపించలేదా? మేమిద్దరం అదే అనుకున్నాం, ఏంటిరా వీడు ఇలా చేశాడు? నిజమే ప్రేమించిన అమ్మాయి దూరం అయింది. ఒప్పుకుంటాం, కానీ స్నేహితులని ఎందుకు దూరం పెట్టావు? ఇన్నేళ్ళ తరువాత గుర్తుకొచ్చామా? అదైనా లక్కీగా అక్కడున్న అతని అన్నగారు మాకు ఇక్కడ పరిచయస్తుడు. అతని ద్వారా నీ ఫోను, అడ్రస్ వివరాలు మాకు తెలిశాయి. లేకపోతే ఇక అంతేనా? " అని సీరియస్‌గా అడిగాడు కృష్ణ.

"అరేయ్! తప్పుగా అనుకోకు, అప్పటి



పరిస్థితి అది. చిన్నతనం, ఓడిపోయానన్న బాధ నన్నలా చేశాయి"

"అయినా శ్రీరామ్! నాకు మట్టుకు చాలా కోపంగా ఉంది నీ మీద. నీ కారణాలు నీకు ఉండచ్చు. కానీ అంతగా ప్రేమించిన గౌతమి గురించి నువ్వు ఇన్నేళ్ళలో ఒక్కసారి కూడా తెలుసుకోకపోవడం క్షమించరాని విషయం" కాస్త కరకుగా అన్నాడు బలరాం.

"అవునురా! నాకు కూడా అదే అనిపించింది" అని కృష్ణ కూడా అన్నాడు.

"ప్లీజ్! నన్ను అర్థం చేసుకోండి. తల్లిదండ్రులను పోగొట్టుకొని ఒక రకంగా అనాథనయిన నేను జీవితాంతం ఎవరి చెయ్యి పట్టుకొని నడవాలనుకున్నానో ఆమె కూడా దూరమవటం భరించలేకపోయాను. నా దురదృష్టం ఏమిటోగాని నేను అమితంగా ఇష్టపడే వాళ్ళను, పోగొట్టుకోవడం నా జాతకంలోనే ఉందేమో? అదీగాక పరాధీన అయిన ఆమెతో చనువుగా ఎలా మాట్లాడగలను? ఆలోచించండి. పోనీ మీరన్నట్లు మీ ద్వారా ఆమె గురించి తెలుసుకొని సంతృప్తి పడటం నావల్ల కాలేదు. అందుకే దూరంగా ఉండిపోయాను.

మీకు తెలియని విషయం ఏంటంటే ఈ ఇరవై ఏళ్ళలో మీ ఇద్దరికీ ఎన్నో ఉత్తరాలు రాసి కూడా పోస్ట్ చెయ్యకుండా పెట్టెలో దాచుకున్నాను. ఎందుకో తెలుసా? మీ దగ్గర్నుంచి రిప్లై వస్తుంది. అందులో నేను అడగలేకపోయినా గౌతమి ప్రసక్తి ఉంటుంది. అది చూసి తట్టుకోలేనేమో అనే భయం, వెరపు కలిగాయి. మరీ ఎవరో పరాయి వాళ్ళని అడిగినట్లుగా తన గురించి కుశలప్రశ్నలు వేయటం లౌకికమైన మాటలు మాట్లాడటం.. ఇవన్నీ నాకు చేత కాలేదు.

అందుకే మనం గడిపిన అందమైన గతంలోనే ఉండిపోయాను. ఆ మధురమైన జ్ఞాపకాలలో జీవించడమే మంచిదనుకున్నాను. నిజాన్ని ఎదుర్కొనే శక్తి లేక భయపడ్డానా లేక పిరికితనమా? ఏమో? కారణం ఏదో చెప్పలేను. కానీ ఒక జంకు మాత్రం ఉండిపోయింది. కానీ ఇన్నేళ్ళ తరువాత, ఆనందమైన సంసార జీవితం గడుపుతూ పిల్లాపాపలతో కళకళలాడుతూ ఉన్న గౌతమిని ఒక్కసారి చూడాలనుకోవడం ఈ జీవితంలో తీరని కోరిక అవుతుందని మాత్రం అనుకోలేదు.

హు..! మనం ఒకటి తలిస్తే దైవం ఇంకోలా తలుస్తాడు కదా, అదే జీవితం.. అనుకున్నవి జరగకపోవడం, జరిగేవి తెలియకపోవడం. బతుకులో ఇలాంటి మలుపు వస్తుందని, నా ప్రేమకి ముగింపు ఈ విధంగా ఉంటుందని ఊహించలేదు.

నా జీవితం ఇంత శాపగ్రస్తం అవుతుందని కూడా తెలియలేదు.

మీకోటి తెలుసా? ఈ ప్రపంచంలో ప్రతి ఒక్కరికీ నమ్మకమైన ఒక స్నేహితుడి అవసరం ఉంది. అలాంటి స్నేహం మీతో నాకు దొరికిన తరువాత నాకు వేరే వాళ్ళతో పరిచయాలే తప్ప స్నేహం ఏర్పడలేదు. నా రహస్యాలు, నా ఆశాభంగం, నా ఉక్రోషం.. అన్నీ మీతోనే పంచుకోవాలి. ఇంతరకు ఎవరికీ చెప్పనివి మీకు చెబుతున్నాను. అసలు జీవితమంటే కలకత్తాలో బాబాయి ద్వారా, అమెరికాలో మూర్తి అంకుల్ ద్వారా అర్థమయింది.

## కలకత్తాలో...

కలకత్తా స్టేషన్‌లో రిసీవ్ చేసుకోవడానికి వచ్చాడు బాబాయ్.

ఎప్పుడూ చూడని ఆ మనిషి దగ్గర నేను ఎలా ఉండగలుగుతాను? ఏమో కాలమే నిర్ణయించాలి. బాబాయ్ అంటే పెద్దగా, లావుగా పెద్దపెద్ద మీసాలతో ఉంటాడనుకుంటే, సన్నగా, పొడుగ్గా, మీసాలు లేకుండా, రౌండ్ కళ్ళజోడు, లాల్చీ పైజామా వేసుకొని అచ్చమైన బెంగాలీలా ఉన్నాడు. వయసు ఎంత ఉంటుందో చెప్పలేను.

ఎలా గుర్తుపట్టాలా? అనుకుంటున్నాడుట. నేను తెలివిగా నా పేరుని కాగితం మీద పెద్దగా రాసి, బోగి దగ్గరే పట్టుకొని నుంచున్నాను.

అప్పుడు నవ్వుతూ అన్నాడు "ఫర్వాలేదు, ఈ మహానగరంలో బతికే తెలివి కనిపిస్తోంది" అని.

అప్పుడు బాబాయిని అడిగాను 'మీ పూర్తి పేరు చెప్పండి' అని.

ధృవమిత్ర అని చెప్పాడు. అది కూడా బెంగాలీ పేరే. వాళ్ళు ఎప్పటి నుండో కలకత్తాలో స్థిరపడ్డారు. వాళ్ళ ఫ్యామిలీలో చాలా మంది రైల్వేస్‌లో ఉద్యోగాలు చేస్తూ కలకత్తా, ఆ చుట్టుపక్కలా స్థిరపడ్డారు.

అప్పుడప్పుడు వాళ్ళ సొంత ఊరు కోనసీమకి వెళుతూ ఉండేవాడుట. మా నాన్న అంటే చాలా ఇష్టంగా ఉండేదిట.

నాన్న, బాబాయికి అక్కడ చుట్టుపక్కల ఉండే అన్ని ప్రదేశాలు తిప్పి చూపించేవారుట. గోదావరి సముద్రంలో కలిసే అంతర్వేది అంటే అతనికి చాలా ఇష్టం. ఇలా ఎన్నో కబుర్లు చెప్పేవాడు.

అక్కడ రైల్వే క్వార్టర్స్‌లో మకాం. మిడిల్ ఇన్‌కం. వాళ్ళ క్వార్టర్స్ బానే ఉండేవి. కానీ తనకి అర్థం కానిదేమంటే ఆ ఇంట్లో ఇంకెవరూ ఉండేవారు కాదు. సాయంత్రం అయ్యేసరికి అతని కోసం కొంతమంది స్నేహితులు వచ్చేవారు. వాళ్ళింట్లో బెంగాలీ సంస్కృతే అంతాను. కొన్నిరోజులు వాళ్ళు వాడే ఆవనూనె వాసన భరించలేకపోయాను. తరువాత అలవాటయింది.

అప్పుడు నన్ను తలుపులేసుకొని చదువుకోమనేవాడు. ఏం తంటాలు పడ్డాడో తెలియదు కానీ నన్ను ఒక మంచి కాలేజీలో జాయిన్ చేశాడు.

మొదట్లో చాలా కష్టపడ్డాను. నెమ్మదిగా అలవాటు పడిపోయాను. రాజమండ్రిలో గోదావరి అయితే, ఇక్కడ హుగ్లీ నదిని చూస్తూ గడిపేవాడిని. ఎన్నో ఆలోచనలు ఆ దీపాల తళతళ మెరుపుల్లా నా మనసులో మెదిలేవి.

కలకత్తాలో బాబాయ్ సాంగత్యం జీవితంలో కొత్తమలుపులు తిప్పి, నన్ను కొత్త మనిషిగా మార్చింది.

బాబాయ్ తల్లిదండ్రులు పోయారు. అన్నయ్య కలకత్తాలోనే ఉంటారు కానీ పెద్దగా రాకపోకలు లేవు. ఒక అక్క. ఆవిడ వైజాగ్‌లో ఉంటారు. ఇవి ఆయన చెప్పిన సంగతులు. బాబాయ్ ఒకప్పుడు ఫుట్‌బాల్ ప్లేయర్‌ట. రైల్వే లీగ్ మ్యాచ్‌లు చాలా ఆడి బోలెడు కప్పులు

అక్షరం

చెడును ద్వేషించు
చెడు చేసిన వ్యక్తిని కాదు

– మహాత్మాగాంధీ



సంపాదించారు. ఫొటోస్ చూపించారు. 'అవన్నీ ఒకప్పటి జీవితంరా. ఇప్పుడు అలాంటి సరదాలు లేవు' అనేవారు.

ఆయన రాత్రి అయ్యేసరికి తన హార్మోనియం పెట్టె తీసుకొని డాబా మీదకు వెళ్లిపోయి పాటలు పాడుకుంటూ ఉండేవాడు. ఒకసారి పైకి నేను వెళ్లబోతుంటే వద్దు లేరా అంటూ నన్ను రానివ్వలేదు. తరువాత అర్థమయింది అక్కడ గ్లాసులు, సీసా చూసిన తరువాత.

ఆయన పాడే పాటలో నాకు ఏదో విషాదం కనిపించేది, భావం అర్థం కాకపోయినా. గొంతు మహాశ్రావ్యంగా ఉండేది. రవీంద్రసంగీత్ కాకుండా, రజనీకాంత్ సేన్ అని ఒక పెద్ద గాయకుడి పాటలు కూడా పాడేవాడు. ఇంకా బెంగాలీ ఫోక్ సాంగ్స్ కూడా పాడేవాడు. అతను పాడుతుంటే హేమంత్‌కుమార్‌లా అనిపించేది. చాలా బాగా పాడేవాడు. నిజానికి ఆ పాటలు హృదయంలోకి చొచ్చుకుపోయేవి.

మొదట్లో భావం అర్థం అయ్యేది కాదు. పోనుపోను ఆ సాహిత్యం విలువ తెలిసింది. డాబా మీద వెల్లకిలా పడుకొని బాబాయి పాట వింటూ, ఆకాశంలో నక్షత్రాలని చూస్తుంటే గౌతమి గుర్తొచ్చేది. గోదావరి, అమ్మ.. మన స్నేహం అన్నీ జ్ఞాపకాలుగా మిగిలిపోయాయి.. ఏదో దిగులుగా విషాదంగా అనిపించేది.

చాలా విషయాలలో మనకి వాళ్ళకి పోలికలు ఉంటాయన్నాడు బాబాయ్.

ప్లీడరుగారిలాగే బాబాయ్‌కి కూడా నాటకాలు అంటే చాలా ఇష్టం.

ఇక్కడ దాన్ని ఒక కళారూపంగా బాగా ఆరాధిస్తారు. ఒక సినిమాకి ఎలా జనం ఉంటారో ఒక నాటకం చూడటానికి అంతే జనం వస్తారని చెప్పాడాయన.

అప్పుడు అనిపించేది ప్రపంచం ఎంత చిన్నదో కదా అని.

నాకు భాష తెలియకపోయినా కాలేజీలో అందరూ నాతో కలిసిపోయేవారు. నా వచ్చీరాని హిందీ, అదైనా స్కూల్లో చదువుకున్నది. కొంత హిందీ సినిమాల ద్వారా నేర్చుకున్న దానితోనే మేనేజ్ చేసేవాణ్ని.

మనం ఒక నిజం ఒప్పుకోవాలి.. బెంగాలీ వాళ్ల పేర్లు ఎంత బావుంటాయో, అక్కడి ఆడవాళ్లు కూడా అంతే అందంగా ఉంటారు. మా క్లాసులో అమ్మాయిలు అందరూ అందంగానే ఉండేవారు. వాళ్ళలో ఒక అమ్మాయి నాతో కాస్త చనువుగా ఉండేది. పేరు శంఖరూప. తను కూడా నేను ఉండే క్వార్టర్స్‌లోనే ఉండేది. పేరు ఎంత బావుందో, మనిషి కూడా అలాగే ఉండేది. తనే చెప్పింది నాకు రవీంద్రుని సంగీతం గురించి.

అప్పుడు నేను అన్నాను "గీతాంజలి తెలుగు అనువాదం చదివాను. నా దగ్గర ఉంది" అని.

ఇంకా అక్కడ కల్చర్ గురించి, దుర్గా పూజ, లిటరేచర్ గురించి చెప్పేది. అప్పుడు నేను బంకించంద్ర, శరత్, సరోజినీదేవిలాంటి మహామహుల అనువాదాలు చదివాను అని చెబితే ఆమె చిన్నపిల్లలా సంబరపడింది.

చిన్నచిన్న బెంగాలీ పదాలు నేర్చుకు

## కొత్తగాలి...

**నేటి కీచక, రావణుల పనిపట్టేందుకు**
**భీముని గద, రాముని బాణం**
**అవసరం లేదమ్మా!**
**గుండెల్లో ధైర్యం,**
**గుప్పెట్లో కారం ఉంటే చాలు!**

– కె.వి. లక్ష్మణరావు,
మానేపల్లి, తూ. గో. జిల్లా

న్నాను.

ఒక రోజున అడిగింది "నువ్వు ఎవరి నైనా ప్రేమించావా? " అని ఇంగ్లీష్‌లో.

దానికి నేను వెంటనే ఏదో నేర్చుకున్నాను కదా అని బెంగాలీలో గొప్పగా అన్నాను "అమీ తుమో బాలో బాషి గౌతమీ" అని.

దానికి తను కొంచెం కన్ఫ్యూజ్ అవుతూ 'నా పేరు గౌతమి కాదు, అయినా గౌతమి ఎవరు? ' అని ఆరాగా అడిగింది. ఆమె గొంతులో గౌతమి గురించి తెలుసుకోవాలన్న కుతూహలం కనిపించింది.

అప్పుడు చెప్పాను గౌతమి గురించి.

"అయితే ఇప్పటికీ నువ్వు ఆమెను ప్రేమిస్తున్నావా? ఈ పాటికి తన పెళ్ళి అయిపోయి ఉంటుంది కదా.. అయినా కూడానా? " అని ఆశ్చర్యంగా అడిగింది.

"అవును, జీవితాన్ని పోగొట్టుకున్నాను. హృదయమంతా తనే నిండి ఉంది. నా ప్రేమ తన కోసం ఎదురుచూస్తూనే ఉంటుంది. ఈ జన్మలో అది ఎలాగూ సాధ్యపడదు" అన్నాను.

అప్పటి నుంచి తను నాతో మునుపటిలా చనువుగా ఉండటం మానేసింది. మొదట నాకు అర్థం కాలేదు ఎందుకు తప్పించుకుంటోందో? తరువాత ఏదో నిష్టూరంగా మాట్లాడసాగింది, దానితో అర్థమయింది.

అప్పటినుంచి నేను పూర్తిగా దూరంగా ఉండసాగాను, ఆమెని ఇంకా బాధపెట్టడం ఇష్టంలేక. నాకు తెలుసు నిరాశ ఎంత బాధాకరమో?

రోజులు గడుస్తున్నాయి.

ఈ మధ్య నేను అదోలా ఉండటం బాబాయి గ్రహించాడు. మొదట్లో ఆదివారాలు గ్రౌండ్‌లోకి వెళ్ళి చాలాసేపు ఫుట్‌బాల్ ఆడి వచ్చేవాళ్ళం సరదాగా. నాకు కూడా అందులో కాస్తో కూస్తో ప్రావీణ్యం ఉందన్న సంగతి చెప్పగానే ఇంకా సంబరపడిపోయాడు. అలాంటిది ఎందుకో ఈమధ్య అన్నింటి మీదా ఆసక్తి తగ్గిపోయింది.

ఎప్పుడూ ఒంటరిగా ఆలోచిస్తూ ఈ జీవితంలో గౌతమిని కలుసుకునే భాగ్యం లేదనే వేదనని తప్పించుకోలేక, ఒక్క క్షణమైనా మర్చిపోలేక, నిద్రలోనూ మెలకువలోనూ ఆ విషాదాన్ని, బాధని మోస్తూ ఉన్న నన్ను చూసి ఒక రోజు బాబాయి "శ్రీరామ్! నువ్వు ఎవరినైనా ప్రేమించావా? " అన్నాడు.

అనుభవజ్ఞుడు కనుక పసిగట్టాడు. ఇక దాచకుండా చెప్పాను. గౌతమిని కలుసుకోవడం, నాకు దొరికిన ప్రేమ, గోదావరి చల్లదనం లాంటి మన స్నేహం.. అన్నీ వివరంగా చెప్పేశాను.

వెంటనే "జీవితం ఎప్పుడూ ఒకేలా ఉండదు. ఒక్కోసారి చిత్రమయిన పరిస్థితులు వస్తాయి. వాటినెదుర్కోవడం అలవాటు చేసుకోవాలి. భయపడకూడదు" అంటూ బాబాయి తన జీవితంలో ఎదుర్కొన్న సంఘటనలు చెప్పాడు. పెళ్ళి చేసుకొని ఆనందంగా ఇంటికి వెళుతుండగా కారు ఏక్సిడెంట్‌లో పిన్ని చనిపోయిందట!

ఎంతో ఇష్టపడి ప్రేమించి పెళ్ళి చేసుకున్న వ్యక్తి.. ఆనందంగా, పాటలా సాగిపోవాల్సిన జీవితం.. ఒక్క రోజులోనే ముగిసిపోవడం! ఎంత విషాదమో కదా?

అదే అడిగాను బాబాయిని ఇంత విషాదాన్ని ఎలా మోస్తున్నారని?

దానికి బాబాయి "జీవితం అనుకోని మలుపు తిరిగింది. అది తట్టుకొని నిలబడడానికి చాలా కష్టపడ్డాను. ఆ తరువాత ఏముంది.. ఎప్పటిలాగే జీవితం సాగిపోతోంది" అని చెప్పాడు.

"ప్రేమ అంటే ఏమిటి? మనం ఇష్టపడే వాళ్ళ ఇష్టాలను గౌరవించడం.. వాళ్ళు దగ్గర ఉన్నా లేకపోయినా! అదే నేను చేసింది" అన్నాడు బాబాయి.

తనలోని ప్రేమని తొంగి చూసుకుంటూ, ఆ జ్ఞాపకాల తడి ఆరిపోకుండా ఆమెకోసం జీవిస్తూ ఉండటం అద్భుతం అనిపించింది. బాబాయి ప్రేమకి అంతకన్నా నీరాజనం ఏముంటుంది?

అప్పటినుంచి నా ఆలోచనలలో మార్పు వచ్చింది. శ్రద్ధగా చదువుకోడం మొదలుపెట్టాను. కొన్ని కంప్యూటర్ కోర్సులు చేశాను. అప్పుడు సరిగ్గా నా జీవితం మరో మలుపు తిరిగింది. అది అమెరికా వెళ్ళే అవకాశం రావడం.

ఎక్కడివాడిని? ఎక్కడెక్కడ తేలుతున్నానో చూడండి.

నా జీవితంలో ఈ ట్విస్ట్ నేను అనుకోనిది, ఊహించనిది కూడా!

కోర్సులు నేర్పిన ఇన్‌స్టిట్యూషన్ వాడే అమెరికాకి పంపుతానని చెప్పాడు. దానికి నాకు వచ్చే జీతంలోంచి దాదాపు సగం వాడికి కట్టేయాలి అనే కండిషన్‌కు ఒప్పుకున్నాను. అప్పుడే అందరూ వెల్లువలా అమెరికా వెళ్తున్న సమయం. నేను కూడా ఆ ప్రవాహంలో ఈదుకుంటూ ఏడు సముద్రాలు దాటి అమెరికాలో అడుగుపెట్టాను.

## అమెరికాలో...

చికాగో ఎయిర్‌పోర్టులో దిగి షార్లెట్ వెళ్ళే ఫ్లైట్ ఎక్కాను. అక్కడ కాంట్రాక్టు బేసిస్ మీద ఒక ప్రముఖ బ్యాంకులో ఉద్యోగం వచ్చింది. రెండేళ్ళు బానే గడిచిపోయింది. అదృష్టవశాత్తు వెంటనే మళ్ళీ ఇంకో రెండేళ్ళకి పొడిగించారు.

ఆ క్రమంలో పర్మినెంట్ ఉద్యోగం సంపాదించుకున్నాను. క్రమేణా అక్కడ పరిస్థితులకు అనుగుణంగా మారుతూ, షార్లెట్‌లో స్థిరపడ్డాను. కొత్త పరిచయాలు బానే ఉండేవి. అయితే మన అంత దగ్గరితనం ఎవరి దగ్గరా కలగలేదు. కానీ అప్పుడప్పుడు ఎవ్వరూలేని ఒంటరిననిపించి ఒక్కోసారి ఏడుపు కూడా వచ్చేది. అలాంటి పరిస్థితులలో నాకు మూర్తిగారితో పరిచయం ఏర్పడింది. ఆయనది రాజమండ్రే. ఇన్నీసుపేటలో ఉండేవారుట. ఆయన అప్పటికే చాలా ఏళ్ళనుండి అమెరికాలో ఉంటున్నారు. ఆయనకి ఒక్కతే కూతురు సుమ. హైస్కూల్‌లో చదువుతోంది.

మూర్తిగారి పరిచయంతో నాకు పోగొట్టుకున్న పెన్నిధేదో దొరికినట్లనిపించేది. ఎక్కువగా మా మధ్య రాజమండ్రి గురించిన మాటలే వచ్చేవి. వాళ్ళ బంధువులు ఎక్కువమంది హైదరాబాదులోనే ఉన్నారని చెప్పేవారు. మూర్తిగారి భార్య జయ. ఆవిడ కూడా చాలా సరదా మనిషి. నన్ను ఆత్మీయుడిగా భావించి, వాళ్ళ ఫ్యామిలీ విషయాలన్నీ చెప్పేవారు.

ఇలా రోజులు గడుస్తున్న క్రమంలో ఒక వీకెండ్ వాళ్ళింటికి వెళ్ళినప్పుడు మూర్తి

## కొత్తగాలి...

**ఏ పనీ చేయనివాడిని**
**తనతో పోల్చినందుకు**
**ఎంత విలపిస్తున్నదో**
**దుక్కిదున్నే దున్నపోతు!**

– కనకనాగ్,
పెనుగొండ, ప.గో. జిల్లా

## కొత్తగాలి...

**కాల్ మనీ!**
**కాల్ గర్ల్!**
**కాల్ సెంటర్!**
**కాలర్ ట్యూన్!**
**అంతా 'కాల' మహిమ!!**

– దూసి ఇషాన్,
బెంగళూరు

గారు అడిగారు "నువ్వు ఒక ఇంటివాడివి ఎప్పుడు అవుతావు? " అని.

"ఆల్రెడీ నేను ఇంటి వాడినే అయ్యాను, మీ దయవల్ల. మీరేగా దగ్గరుండి కొనిపించారు" అన్నాను.

"ఆల్రైట్! డైరెక్ట్‌గా పాయింట్ లోకి వస్తాను. ఇంటివాడివి అయ్యావు.. మరి పెళ్ళెప్పుడు చేసుకుంటావు? "

"ఏమో దానిమీద ఆలోచన రాలేదు"

"నేను నమ్మను. వేరే రీజన్ ఉందా? "

"అనుకున్నది జరగలేదు. అందుకని.."

"అలా కాదు" అని, పెళ్లి ఎందుకు చేసుకోవాలి అన్న విషయం మీద చాలా సేపు చెప్పారు. "పెళ్ళి అంటే భార్యా, భర్త, పిల్లలు అనే నార్మల్ చిత్రం కాదు. ఒక తోడూ, ఒక స్నేహం, ఒక లాంగ్ కంపానియన్ షిప్. నీలో కలిగే అన్ని ఎమోషన్స్‌ని షేర్ చేసుకోగలగడం" అన్నారు.

అప్పుడు నాకు స్ట్రయిక్ అయ్యింది. ఈ ప్రపోజల్ వెనకాల ఏదో ఉంది అనుకున్నాను. తరువాత చెప్పారు. జయగారి మేనకోడలు ఉందట. నాకిష్టమయితే మా ఇద్దరికీ పెళ్లి చేయాలని ఆవిడ అనుకుంటున్నారు. ఆ అమ్మాయి అందచందాలు, గుణగణాలు, ఆస్తిపాస్తులు అన్నీ చెప్పారు.

ఆవిడకి కచ్చితంగా చెప్పేశాను, ఇప్పుడే నాకు పెళ్లి చేసుకోవాలని లేదని. అప్పటి నుంచి కొంతకాలం ఆవిడ నాతో ముభావంగా ఉంది. తరువాత మారింది, అది వేరే సంగతి.

నాకు అమెరికాలో బాగా నచ్చింది ఫాల్ లో కలర్స్ మారడం. అది నాకు చాలా అద్భుతంగా అనిపించేది. పసుపు, ఎరుపు, ఊదారంగులతో ఒక అందమైన వర్ణ చిత్రంలా అనిపించేది.

ఆఫీస్ పనితోనూ, వీకెండ్స్ మూర్తి గారింటికి వెళ్ళి అక్కడ వాళ్లతో గడపటంతోనూ రోజులు గడిచిపోతున్నాయి. మూర్తిగారు కాకుండా, ఇంకో ఇద్దరు స్నేహితులయ్యారు. వాళ్ళింటికి కూడా తరచు వెళుతూ ఉండేవాడిని. లేదా వాళ్లు మా ఇంటికి వచ్చేవారు. ఫుట్ బాల్ మ్యాచ్ చుట్టుపక్కల ఉంటే వెళ్లి చూసేవాణ్ణి. కుదరకపోతే టీవీలో చూసేవాళ్లం.

ఆఫీస్‌లో ఒక కొలీగ్ రేఖారావు అని ఉండేది. తెలుగువాళ్లే కానీ ముంబయిలో సెటిల్ అవడంతో నార్త్ ఇండియన్‌లా ఉండేది వేషభాషలతో సహా. తను నాతో సరదాగా, చనువుగా ఉండేది. ఎంతయినా సాటి తెలుగమ్మాయి కదా అని నేను కూడా బాగా మాట్లాడేవాణ్ణి. సినిమాలు, పాటల గురించి, ఎక్కువ హిందీ సినిమాలు, ఇంకా అక్కడ అమెరికాలో ఉండే ఇండియన్స్ గురించి, మనకి, వాళ్ళకి ఉండే వ్యత్యాసాలు ఇలా.

అనుకోకుండా జరిగిన ఓ సంఘటన దిగ్భ్రాంతికి గురిచేసింది. ఒక వీకెండ్ వాళ్లింట్లో తన బర్త్‌డే పార్టీ ఉంది రమ్మనమని ఇన్వైట్ చేసింది. చాలామంది వస్తారేమో అనుకుంటూ బర్త్‌డే గిఫ్ట్, బొకే పట్టుకొని తన అపార్ట్‌మెంట్‌కి వెళ్ళాను.

ఎలాంటి హడావుడీ వినిపించడం లేదు. బెల్ నొక్కాను. వచ్చి తలుపు తీసింది రేఖ. పుట్టిన రోజు కాబట్టి స్పెషల్‌గానే కనిపిస్తోంది. లోపలికి రమ్మనమని ఆహ్వానించింది. కొంచెంసేపు కబుర్లు చెప్పుకున్నాక స్నాక్స్, వైన్ బాటిల్ తీసుకొచ్చి

పెట్టింది. అక్కడ పరిస్థితి చూస్తే ఎవరూ వచ్చేలా లేరు. అదే తనని అడిగాను.

"లేదు డియర్, నిన్ను ఒక్కడినే పిలి చాను" అంటూ దగ్గరగా వచ్చింది.

ఎందుకో ఆమె బిహేవియర్ వింతగా అనిపించింది. మేమిద్దరమే ఇలా ఏకాం తంగా ఉండటం నచ్చలేదు నాకు. "ఓకే, ముందు బర్త్‌డే గిఫ్ట్ అందుకో" అన్నాను తెచ్చినవి ఆమెకి చేతికి ఇస్తూ.

వాటిని పక్కన పెట్టి "థాంక్యూ" అని 'రా మ్ డియర్! నీ కళ్లంటే నాకు చాలా ఇష్టం" అంటూ నా కళ్ళ మీద ముద్దు పెట్టబోయింది.

వెంటనే గౌతమి నా కళ్ళని ముద్దు పెట్టుకున్న క్షణం గుర్తుకొచ్చింది నాకు.

ఈ కళ్ళు తనకే సొంతం అనుకుంటూ వెంటనే తలని పక్కకు తిప్పుకొని సున్ని తంగా ఆమెని పక్కకు జరిపి "నేను వెళ తున్నాను" అని చెప్పి బయటకు వచ్చే శాను. వెనకనుంచి ఆమె ఏదో అంటూనే ఉంది. విననట్టే వచ్చేశాను.

కొన్నిరోజుల తరువాత మూర్తిగారు నన్నడిగారు "శ్రీరామ్! నువ్వు రేఖతో డేట్ చేస్తున్నావని చెప్పలేదేంటి? "అని.

అది విని ఆశ్చర్యపోయాను.

"నేను ఆమెతో డేట్ చెయ్యడమేంటి? ఎవరు చెప్పారండీ? " అన్నాను.

"ఎవరో కాదు, తనే చెప్పింది. అది నా ఒక్కడితోనే కాదు చాలామందికి చెప్పిం ది" అన్నారాయన.

ఆ మాటతో షాక్ తిన్నాను.

తనతో సరదాగా ఉన్న మాట నిజమే, కానీ ఎప్పుడూ నేను హద్దులు మీరలేదు. అలాంటి మాటలు మా మధ్య రాలేదు. ఇన్‌ఫాక్ట్ తనవి, నావి అభిరుచులు అస్సలు కలవవు. తనకి ఫాస్ట్‌లైఫ్ ఇష్టం.

ఎప్పుడూ నా భావుకత్వాన్ని తక్కువ చేసి మాట్లాడేది. దాని గురించి నేను పెద్దగా పట్టించుకోలేదు. అయినా ఎవరి భావాలు వాళ్ళవి, ఎవరి అభిరుచులు వాళ్లవి. అంత మాత్రం చేత నేను తనతో డేట్ చేస్తున్నానని ఎలా చెప్పింది? అంటే ఆ రోజున జరిగిన దానికి ఇలా రివెంజ్ తీసుకుంది కాబోలు.

ఆ రోజు ఈవెనింగ్ ఆఫీస్ నుండి బయ టకు వస్తూ రేఖని అడిగాను "నేను విన్నది నిజమేనా? నా ప్రమేయం లేకుండా నువ్వు అందరికీ ఎలా చెప్పా వు? " అని నిలదీశాను.

"అదేంటి శ్రీరామ్! ఎవ్రీ మూమెంట్ నాతో సరదాగా ఉంటావు, కనుక నీకు కూడా నేనంటే ఇష్టమే. అది నువ్వు డైరె క్ట్‌గా చెప్పలేకపోతున్నావు. అందుకే అంద రితో మనిద్దరం డేట్‌లో ఉన్నామని నేనే చెప్పాను. ఇందులో పెద్ద తప్పేముంది? ఎలాగయినా మనం పెళ్లి చేసుకుంటాం కదా!" అంది.

ఆ మాటలకి, అతి చనువుకి నాకు చాలా కోపం వచ్చింది. ఎలాగో కంట్రోల్ చేసుకుంటూ "నేను ఎప్పుడూ అనలేదు ఆ మాట. అసలు పెళ్లి ధ్యాసే లేదు నాకు. అంతకుమించి నిన్ను పెళ్లి చేసుకునే ఉద్దేశ్యం అసలే లేదు" అన్నాను.

"ఇది చాలా అన్యాయం. నన్ను ఆశ పెట్టి మోసం చేస్తావా? ఛీఛీ! నువ్వు మని షివేనా? జన్మలో నీ మొహం చూడను" అంటూ విసురుగా వెళ్ళిపోయింది.

## కొత్తగాలి...

**మూడు ఎరువులు**
**ఆరు అరువులు**
**నేటి రైతును**
**ఆదుకోండి! ఆదుకోండి!**

– జి.వి.ఎస్. ప్రియంవద,
శ్రీకాకుళం

నా పక్క నుండి ఎటువంటి కమిట్ మెంట్ లేదు. పైగా తనకు తనే అన్నీ అనేసుకొని, చివర్లో నన్ను ఒక విలన్‌గా చిత్రీకరించి వెళ్లిపోయింది. నాకు చాలా కోపం, బాధ కలిగాయి. ఇలాంటి వాళ్ళు కూడా ఉంటారా? ఉన్నారని నిరూపిం చింది కదా రేఖ అనుకున్నాను.

అప్పటి నుండి ఆఫీస్‌లో కానీ, బయట కానీ ఆడవాళ్లతో జాగ్రత్తగా, ఆచితూచి మాట్లాడటం అలవాటు చేసుకున్నాను.

కలకత్తాలో శంఖరూప ఓ రకంగా, అమెరికాలో రేఖ మరో రకంగా నా జీవి తంలోకి రావాలనుకొన్నారు.

కానీ జీవితంలో నేను ప్రేమించిన గౌత మిని కోల్పోయిన తరువాత, నాకు అసలు పెళ్లి మీద ధ్యాసే రాలేదు. మీరు నమ్మండి, నమ్మకపోండి.

ఇంక మా బాబాయి అయితే కలకత్తా విడిచి ఎక్కడికీ రానని చెప్పేశారు. నేను ఎన్నోమార్లు రమ్మనమని చెప్పాను.

సుమ, ఆమె భర్త కలకత్తా వెళ్ళారు బాబాయ్‌ని కలవడానికి నా మాట మీద.

చూస్తుండగా కాలం కదిలిపోతోంది. రోజులు, వారాలు, నెలలు, సంవత్సరాలు గడుస్తున్నాయి. నేను షార్లెట్‌లోని బెల్ మోంట్‌లో ఇల్లు కొనుక్కొని స్థిరపడ్డాను.

నా ఆఫీస్ అప్ టౌన్‌లో ఉండేది. అక్కడి స్టేడియంలో ఫుట్‌బాల్ మ్యాచ్‌లు జరిగినప్పుడల్లా తప్పనిసరిగా వెళ్తుంటాను. ఇక్కడ వెదర్ మోడరేట్‌గా ఉంటుంది. టోటల్‌గా లైఫ్ బానే సాగిపోతోంది.

నదిలో ప్రవాహానికి మలుపులు ఉన్నట్లే, జీవితంలో కూడా మలుపులు వస్తాయి. అవి మంచివా? ప్రమాదకరమైనవా? అని దగ్గరకు వెళ్ళేదాకా తెలియదు. అయితే ఈ మలుపు నిజానికి నాది కాదు, నేనంటే ప్రాణం ఇచ్చే సుమది. అది నాకు బాధ కలిగించింది.

మూర్తిగారి అమ్మాయి సుమ సడెన్‌గా ఓ రోజున "అంకుల్ నేను ఒక అబ్బాయిని లవ్ చేశాను, అతన్నే పెళ్లి చేసుకుంటా" అని చెప్పింది. సుమ అప్పటికే ఫోర్ ఇయర్స్ అండర్ గ్రాడ్ బ్యాచులర్ ఆఫ్ ఆర్ట్స్‌లో చేసింది. జాబ్‌లో కూడా జాయిన్ అయింది. అయితే ఆ బాధ్యత నా మీద పెట్టింది.

మూర్తిగారిని, ఆయన భార్యని కూర్చో పెట్టి తన సంగతి చెప్పాను. కొంత భయ పడినా తరువాత ఒప్పుకున్నారు. అబ్బాయి తెలుగువాడే, కానీ వాళ్ళు భయపడింది ఇక్కడే పుట్టి పెరిగిన అమ్మాయికి, ఇండియా నుండి చదువుకోవడానికి వచ్చిన అబ్బాయికి సరిపోతుందా? అని.

పెళ్ళి చేసుకోబోయే ఇద్దరూ హామీ ఇచ్చారు ఏం ఫర్వాలేదని. పెళ్లి జరిగింది. సంతోషంగా ఉన్న సమయంలో సుమ వ స్తున్న కారుకి ఏక్సిడెంట్ జరిగింది.

అప్పటికే ప్రెగ్నెంట్‌గా ఉన్న తనకి అబార్షన్ అవడంతో పాటు ఇక జీవితంలో తల్లి అయ్యే అవకాశం కోల్పోయింది. అది విన్న మూర్తిగారికి, జయగారికి కూడా పెద్ద షాక్. ఇక సుమ అయితే పిచ్చిదా నిలా అయిపోయింది.

ఇన్నేళ్ళలో మూర్తిగారిని అలా డల్‌గా చూడలేదు. ఆయనకి ఒక్కళ్ళకి నా జీవితం గురించి తెలుసు. ఆయన నాకు ఎన్నో విషయాలు చెప్పేవారు. 'అస్తమానూ దిగులు పడుతూ, బాధపడుతూ ఉండటం కాదు ప్రేమంటే, ఆ మనిషి దగ్గర ఉన్నా లేకపోయినా, వాళ్ళ అభిప్రాయాలను గౌర వించడం. వాళ్ళు ఇష్టపడే పనులు నువ్వు చేయగలగడం' అనేవారు. అంత గట్టిగా ఉండే మనిషి సుమని చూస్తూ దిగులు పడిపోయేవారు.

నిజానికి సుమని పెళ్లి చేసుకున్న కిషోర్ మంచి కుర్రాడు. 'నాకు సుమ ముఖ్యం. పిల్లలు కావాలంటే ఎవరినైనా పెంచుకుం టాం. ఎంతో మంది చిన్నపిల్లలు తల్లిదం

ద్రుల ప్రేమలేక ఉన్నారు. వాళ్ళకి జీవితం ఇద్దాం' అని సుమని ఓదార్చాడు.

అతని ప్రేమతో, లాలనతో సుమ తొందరగానే ఆ ట్రామా నుంచి బయటపడింది. కావాలంటే అతను ఆమెని వదిలేసి వేరే పెళ్లి చేసుకోవచ్చు కానీ అతనికి సుమ కావాలి. అది నిజమైన ప్రేమ. ఇండియా వచ్చి హైదరాబాద్‌లో గవర్నమెంట్ వాళ్ళు రన్ చేసే హోం నుండి ఇద్దరు పిల్లలని అడాప్ట్ చేసుకున్నారు.

వాళ్లని చదివించి పెద్దవాళ్ళని చెయ్యాలని ఉంది. సుమవాళ్ళకి తెలుసు, దానికి చాలా డబ్బు ఖర్చు పెట్టాలని. అయినా సరే దానిలో ఒక తృప్తి, ప్రేమ ఉన్నాయని భావించారు.

## మళ్లీ రాజమండ్రి!

"అవునూ శంఖరూపని కలిశావా ఎప్పుడైనా మళ్ళీ? " అనడిగాడు బలరాం.

"అయ్యో! చెప్పడం మరిచాను. నేను కలకత్తాలో ఉండగానే తన పెళ్లయింది. పెళ్ళికి వెళ్ళాను. సంతోషపడింది. భర్తకు చూపించి పరిచయం చేసింది. నేను అమెరికాకు వెళ్ళేటప్పుడు ఎయిర్‌పోర్టుకి వచ్చి కలిసింది. ఇప్పటికీ టచ్‌లోనే ఉంది ఈ-మెయిల్స్‌లో.

అన్నట్టు ఇంకో సంగతి.. రేఖని కూడా చాలా రోజుల తరువాత న్యూజెర్సీలో కలిశాను. పెళ్లి చేసుకుంది. బానే ఉందిట. చాలా సేపు మాట్లాడింది. చివర్లో వెళ్ళిపోతూ ఒక మాట అంది. 'పాత విషయాలు మర్చిపోయి మంచి స్నేహితుల్లా ఉందామ'ని షేక్ హ్యాండ్ ఇచ్చింది"

"మొత్తానికి కథ సుఖాంతం అయింది" కృష్ణ అన్నాడు.

"వాళ్ళవి అయ్యాయి. నాది కాదు" అన్నాను.

"అరె నా ఉద్దేశ్యం నిన్ను అనాలని కాదురా!" వాడు ఫీల్ అయ్యాడు.

"అది కాదురా! నేను ఎంత దురదృష్టవంతుడినో అన్నదే నా బాధ. గౌతమిని చూడలేకపోయాను. ఇక ఈ జీవితంలో చూడలేను కదా! అందులో తను అనారోగ్యాన్ని దాచేసుకొని ఇలా అయిపోయిందే అనే బాధ నా గుండెల్ని పిండేస్తోంది.

ఆ తరువాత కొన్నిరోజులకి ఆఫీస్ పని మీద చైనా వెళ్ళాల్సి వచ్చింది. బహుశా అప్పుడు నీ ఫ్రెండ్ వాళ్ళ అన్నయ్య నా ఇంటి ఫోన్ నెంబర్‌కి కాల్ చేసి ఉంటాడు. అదే సమయంలో నాకు అక్కడ చైనాలో అనుకోకుండా, మన తెలుగు వాళ్ళే రాజమండ్రి వాళ్ళు కనిపించారు.

మాటల సందర్భంలో కృష్ణ పేరు, నీ పేరు చెబితే అతనికి తెలిసిన కాంటాక్ట్ ద్వారా కృష్ణ నెంబర్ దొరికింది. అక్కడి నుండే ఎన్నోసార్లు ట్రై చేశాను, కానీ కలవలేదు. చాలా బాధ అనిపించింది. ఎప్పుడూ నాకు అలాగే అవుతుంది. ఏదైతే ఎక్కువగా అనుకుంటానో అది అందకుండానే పోతుంది. అప్పుడే నాకు ఫోన్ కలిసి ఉండి ఉంటే ఈ ప్రయాణం మరోలా ఉండేది. అయినా పట్టు వదలక మళ్ళీ షార్లెట్‌లో దిగిన వెంటనే ఫోన్ చేశాను. మిగతావి మీకు తెలుసు.

అసలు కృష్ణ పేరు, నీ పేరు తలచుకోగానే ఆగలేకపోయాను రా బలరాం.. ఎప్పుడెప్పుడు మిమ్మల్ని కలుస్తానా? అని. నెల్లాళ్ళలో పనులన్నీ పూర్తి చేసుకొని సంతోషంగా బయలుదేరి వచ్చేశాను. అప్పటి నుండి రోజూ మనం టచ్‌లోనే ఉన్నాం. అయినా గానీ మీరు కొంచెం కూడా బయటపడలేదు గౌతమి గురించి.

కానీ ఇక్కడకు వచ్చాక అర్థమయింది నేను పోగొట్టుకున్నదేమిటో? ఇన్నాళ్ళు ఎవరి కోసం తపించిపోయానో, ఆమె లేదు అనుకోలేకపోతున్నాను.. అసలు నా వల్ల కావటం లేదు. ఇంతవరకు ఒక హోప్ ఉండేది, ఎప్పటికయినా తనను కలవగ

లను అని. ఇప్పుడు తనే లేదన్న నిజాన్ని తట్టుకోలేకపోతున్నాను" అంటూ అక్కడ నుండి లేచి పక్కకి వచ్చేశాను.

'గౌతమి ఒక జ్ఞాపకం! అవును తను భౌతికంగా లేదు నిజమే, కానీ నా హృదయంలో ఎప్పటికీ ప్రజ్వలిస్తూనే ఉంటుంది. ఆమె కనపడదు కానీ, ఆ రూపం నా కళ్ళకి కనిపిస్తూనే ఉంటుంది.

నా పంతంతో ఎంత తెలివితక్కువ పని చేశానో. దాని ఫలితం తనని ఆఖరి క్షణంలో అయినా చూడలేకపోవటం. ఈ శాస్తి నాకు జరగాల్సిందే!' అని కుమిలి కుమిలి ఏడుస్తున్న నన్ను కృష్ణ, బలరాం చెరో చేత్తోపట్టుకొని లేపారు.

ముగ్గురం కలసి కృష్ణా వాళ్లింటికి వెళ్ళాం. ఇంటి దగ్గర పిల్లలతో హడావుడిగా, సందడిగా ఉంది. అప్పుడు గుర్తొచ్చింది. పొద్దున్నే చూశాను వాళ్ళని. శాంతి పరిచయం చేసింది వాళ్ళని పెద్దాడు, చిన్నాడు అని. ఇద్దరూ ఒక్కలాగే ఉన్నారు. ఇద్దరికీ ఏడాదే తేడాట. పది, పదకొండు ఏళ్ళు ఉంటాయి. ఇంతలో నా చూపు వాళ్ళ పక్కనున్న పాప మీద పడింది. పాపలో తెలిసిన వాళ్ళ పోలిక బాగా కనిపిస్తోంది. ఎవరై ఉంటారు? చప్పున గుర్తుకొచ్చింది.. చిన్నప్పటి గౌతమిలా ఉందని. వెంటనే "ఎవరా పాప, గౌతమి కూతురేనా? " అని ఆత్రంగా అడిగాను.

"అవును! గౌతమి కూతురే అని శాంతి చెప్పింది.

అంతలో కృష్ణ, బలరాం వచ్చారు నా దగ్గరకి.. "ఇదే గౌతమి చివరి కోరిక. తన పాపని నీ దగ్గరకు చేర్చాలని" అని ఆ పాపని నా చేతులకి అందించారు.

ఆ అమాయకమైన కళ్ళలో, ఏదో దిగులు తొంగి చూస్తోంది.

"నువ్వేనా డాడీ అంటే? నువ్వు ఎక్కడో దూరంగా ఉన్నావని, నేను పెద్దయ్యాక వస్తావని అమ్మ చెప్పింది"

"అవునమ్మా నేనే" అని గుండెలకి హత్తుకున్నాను.

"ఇక్కడే నా దగ్గరే ఉంటావా? నువ్వు మళ్లీ వెళ్ళిపోవు కదా! అమ్మ దేవుడిదగ్గరకు వెళ్ళిందిట కదా! బబ్లూ అన్నాడు" అని జాలిగా అంది.

చప్పున శాంతి వచ్చి "లేదమ్మా! మళ్లీ వచ్చేస్తుంది" అంటూ దగ్గరగా తీసుకొని, కొడుకును పిలిచి తిట్టింది.

"ఫర్వాలేదు, నిజం తెలియటం మంచిదే కదా శాంతీ!" అన్నాను.

## ముగింపు

"హలో, సుమా! యా.. షార్లెట్ కనెక్టింగ్ ఫ్లైట్ ఇంకో గంటలో ఉంది. అన్నట్లు నీకో సర్ప్రైజ్!"

అవతలి మాటకి బదులుగా-

"డోంట్ వర్రీ! నేనొచ్చి మాట్లాడి సెటిల్ చేస్తా! సరేనా? డియర్! ఐ విల్ బి దేర్ బై ఈవినింగ్ ఓకే బై!" ఫోన్ పెట్టేశాను.

బ్యాగ్‌లోంచి గౌతమి డైరీని బయటకు తీసి అపురూపంగా తడిమి అనుకున్నాను.

గౌతమీ! అన్ని హృదయాలలో నిండిన ప్రేమమూర్తివి నువ్వు. అయినా వీళ్లందరికేం తెలుసు? అన్ని చోట్లా నాకు నువ్వే కనిపిస్తున్నావని? ప్రేమ అంటే నువ్వేనని, నీ సందేశాలు నాకు వస్తున్నాయని, పాపం వీళ్ళకు తెలియదు. నా ప్రతి అడుగులో నువ్వున్నావన్న మనోబలం ముందుకు నడిపిస్తుంది నన్ను..

ఇంతలో బాబాయి నుంచి ఒక మెసేజి వచ్చింది.

★ ★ ★

కొన్ని సంవత్సరాల తరువాత..

చేతిలో ఫోన్ మోగింది.

వీడియో కాల్

"హలో డాడ్! హౌ ఆర్ యు? "

"అయామ్ ఓకే! మరి నువ్వు ఎలా ఉన్నావు? "

## కొత్తగాలి...

**పూజలు ప్రార్థనలూ కొందరు**
**వ్రతాలు ఉపవాసాలూ ఇంకొందరు**
**మొక్కులు తీర్థయాత్రలు మరికొందరు**
**అందరూ దేవునికోసం అంతటా**
**వెతికేవారే, తమలో తప్ప!**

– చిత్తూరి సాయిప్రసాదరెడ్డి,
చింతలగూడెం

"డాడ్! అయామ్ ఫైన్! ప్లీజ్! డు మి ఎ ఫేవర్!"

"ఏంటి తల్లీ! మళ్లీ నీ కోరిక? "

"గంగరాజు పూతరేకులు, తాపేశ్వరం కాజాలు కావాలి నాకు, మా ఫ్రెండ్స్‌కి. కొరియర్ చేస్తావా? ప్లీజ్!"

"కాదంటే, నేను బతకగలనా? "

కృష్ణ హడావుడిగా వచ్చాడు "అరేయ్ శ్రీరామ్! మా పెద్దాడికి పూతరేకులు కావాలిట, గంగరాజు దగ్గరకు వెళ్ళి ఆర్డర్ ఇచ్చి వస్తున్నా!" అనగానే వాడి గొంతు విని రమ్య "హాయ్ కృష్ణా అంకుల్!" అంటూ గట్టిగా అరిచింది.

"హాయ్ రమ్యా! ఎలా ఉన్నావురా తల్లీ? " అంటూ నా చేతిలోంచి ఫోన్ తీసేసుకొని ఇద్దరూ నాన్‌స్టాప్‌గా మాట్లాడుకుంటున్నారు.

"..మీ నాన్నకి చెప్పావా? అయినట్లే, నేను పంపిస్తాను తల్లీ! ఎలాగూ మా బడుద్ధాయి కూడా అడిగాడు. వాడికి, నీకు కూడా పంపుతాను. అయినా అక్కడకి చదువుకోవడానికి వెళ్ళాడో, తిండి తినడానికి వెళ్ళాడో అర్థం కావటం లేదు, బకాసురుడి తమ్ముడిలా ఏది పంపినా ఉఫ్ అని ఊదేయడం మట్టుకు బాగా తెలుసు. మొన్ననే పంపానా, అప్పుడే మళ్ళీ పంపమని మెసేజ్ పెట్టాడు. వాడు నాకు వీడియో కాల్ చెయ్యడు తిడతానని"

వాళ్ళ మాటలు వింటున్న నేను "అన్నీ తండ్రి పోలికలే" అన్నాను.

"పో డాడ్! కృష్ణ అంకుల్ మంచివాడు. అంకుల్! డాడ్ వచ్చినా రాకపోయినా నువ్వు మట్టుకు నా గ్రాడ్యుయేషన్ సెరిమొనీకి రావాలి. అప్పుడు మనం మొత్తం అమెరికా చూసేద్దాం" అని వాడికి రమ్య భరోసా ఇస్తోంది.

వాళ్ళిద్దరూ ఇంకా ఎన్నో కబుర్లు చెప్పుకుంటున్నారు.

"ఫోన్ నాకు చేసింది" అన్నాను

"మీ నాన్నకి కుళ్ళు, మనిద్దరమే కబుర్లు చెప్పుకుంటున్నామని" అన్నాడు కృష్ణ.

"లేదులే అంకుల్, పాపం డాడ్!"

"చూడరా! రమ్యకి నువ్వంటే ఎంత ప్రేమో!"

"సరే సరే.. రమ్యా! నాకు వేరే పని ఉంది తల్లీ!"

"ఓకే డాడ్"

"బై బై అంకుల్!" ఫోన్ పెట్టేసింది.

★ ★ ★

ఓహ్! చెప్పనే లేదు కదా మీకు, అక్కడ జాబ్ రిజైన్ చేసి, నేను ఇప్పుడు బలరాం నడుపుతున్న 'ప్రశాంతివనం'లో ఉంటున్నాను. రమ్య ఇప్పుడు అమెరికాలో చదువుకుంటోంది. సుమ తను పెంచుకునే ఇద్దరి పిల్లలతో పాటు రమ్యని కూడా చూసుకోడం మొదలుపెట్టింది. "నేను బాధ్యతగా చూసుకుంటాను. నువ్వు నిశ్చింతగా ఉండు అంకుల్" అని చెప్పింది. అంతకంటే కావలసింది ఏముంది?

ముగ్గురు పిల్లలతో మూర్తిగారు, జయగారు బిజీ అయిపోయారు. వాళ్ళ ఇల్లంతా ఇప్పుడు సందడితో నిండిపోయింది.

మధ్యమధ్యలో నేను వెళ్ళడం, లేదా సుమ, కిషోర్ పిల్లలని తీసుకుని రావడం జరుగుతోంది.

బలరాం, కృష్ణలు మొదలుపెట్టిన ఈ ఆశ్రమం ఎందరో శాపగ్రస్తులయిన పేషెం

ట్లకి, వృద్ధులకి మానసిక ప్రశాంతతను చేకూరుస్తోంది.

షార్లెట్‌లో నా పనులన్నీ సుమకి అప్ప చెప్పి వచ్చాను. నేను ఇక్కడే ఉంటూ ఆశ్రమ బాధ్యతలు నిర్వహిస్తున్నాను.

ఇంతలో బలరాం, ఉష కూడా వచ్చారు రౌండ్స్‌కి. అందరం కలిసి ఆశ్రమంలో ఉన్న వాళ్ళందరినీ పలకరించటానికి వెళ్ళాం. ఒక్కో మనిషికి ఒక్కో వ్యథ. ఈ వయసులో ఆ వృద్ధులకి కావలసింది మన స్ఫూర్తిగా వాళ్ళని పలకరించి కబుర్లు చెప్పడం. బలరాం, ఉష హెల్త్ చెకప్ చేస్తున్నారు అందరికీ.

ఇక్కడ రెండు అంబులెన్సులు ఎప్పుడూ రెడీగా ఉంటాయి. సెక్యూరిటీ సిబ్బంది, డ్రైవర్స్‌కి, ఇంకా అక్కడ పనిచేసే సిబ్బంది మొత్తానికి భోజన, వసతి సదుపాయాలు ఏర్పాటు చేశాం. మిగతా పనులు చేసుకోవడానికి ఇద్దరు మేనేజర్లు ఉన్నారు.

అదికాకుండా ఈ మధ్య చాలామంది యువకులు స్వచ్ఛందంగా సేవ చేస్తున్నారు. రకరకాల సంస్థలవాళ్ళు కూడా ఇక్కడకు వచ్చి గడుపుతూ ఉంటారు.

ఆశ్రమంలో వాళ్ళకి కొన్ని ఆక్టివిటీలు డిజైన్ చేశాం. వాళ్ళ కాఫీలకి, కావాల్సిన పాలు ఉదయాన్నే వాళ్ళకి అందేలా ఆవులని పెంచుతున్నాం. వాటి సంరక్షణ కోసం ఇద్దరు ఉంటారు.

అలాగే కూరలు, పూల మొక్కలు పెంచుతున్నాం. తోట పని చూసుకోవటానికి కొంతమందిని పెట్టాం. వాళ్ళతో పాటు వీళ్ళు కూడా తిరుగుతూ పువ్వులని, పళ్ళని సంరక్షణ చేస్తూ ఉంటారు.

ఆశ్రమం పది ఎకరాల స్థలంలో ఉంది. చుట్టూరా ఎత్తైన ప్రహరీ, దానిపైన ఎలక్ట్రిక్ కంచె కూడా ఏర్పాటు చేశాం.

లోపలే ఒక గుడి ఉంది. అందులో అందరు దేవుళ్లూ ఉన్నారు. అలాగే అన్యమతస్తులకి కూడా ప్రత్యేక గదిలో మందిరాలు ఏర్పాటు చేశాం. భజనలు కూడా ఇదే విధానంలో ఏర్పాటు చేశాం.

మాతోపాటు స్వచ్ఛంద సేవా సంస్థ వాళ్ళు 'మేము సైతం..' అంటూ ఈ కార్యక్రమాలలో భాగస్తులయ్యారు. రోజూ ఏదో ఒక కార్యక్రమం ఉండేలా చూస్తాం. సాయంత్రం ఒక గంటసేపు మనసుని ఉల్లాస పరిచేలా ఎంతోమంది పేరున్న కళాకారులు తమ అమూల్యమైన సమయాన్ని వీళ్ల కోసం వెచ్చిస్తారు.

ఆశ్రమంలో వాళ్ళు ఏదైనా కారణాల వల్ల డిప్రెషన్‌లోకి వెళితే ముందుగానే జాగ్రత్తగా గమనించి వాళ్ళ స్నేహితులు, బంధువుల సహాయం తీసుకుని, వాళ్ళ గురించి తెలుసుకుని, అందులోంచి బయటపడేలా చూస్తున్నాడు బలరాం.

క్రమం తప్పకుండా వ్యాయామం చేయడం, సమయానికి భోజనం, నిద్ర ఉండేలా చూడటం, వ్యాయామాలు అంటే సరదాగా వాళ్ళచేత పరుగు పందేలు, చిన్నప్పుడు ఆడుకున్న ఆటలు, వంటల పోటీలు పెట్టడం.. ఇంకా వాళ్ళచేత చిన్న చిన్న స్కిట్స్ చేయించడం.. ఇలాంటివన్నీ దగ్గరుండి నేను చేయిస్తున్నాను.

'అనవసరమైన ఆలోచనలు మానండి. ఏదో ఒక పని చేస్తుండండి..' అని ప్రతి రోజూ అందరం కలిసినప్పుడు చెప్పేవాణ్ణి. ఒకవేళ ఎవరైనా మరణించినా అందరం కూడా వాళ్ళని జాగ్రత్తగా కైలాసభూమి వరకు వెళ్ళి సాగనంపి వచ్చేవాళ్ళం.

గౌతమి తన మరణాన్ని ఎంత సహజంగా తీసుకుందో వాళ్ళకి చెప్తున్నాను..

"ధైర్యంగా ఎదుర్కోండి. వచ్చేదాన్ని మీరు ఎలాగూ ఆపలేరు కాబట్టి అంతవరకు ఆనందంగా ఉండండి. జిడ్డు కృష్ణమూర్తి చెప్పినట్లు మరణం అనేది జీవితంలో ఒక ప్రధాన భాగం. జీవితం అనేది నిరంతర గమనం, కదలిక. ఆ గమనంలోనే నిరంతరం మార్పు

ఉంటుంది. ఆ మార్పే లయం, మరణం" వాళ్లతో కూర్చొని చెబుతూ గౌతమిలా వాళ్లతో మమేకమై వాళ్ళలో ఒకడిగా కలిసిపోయాను. అదే నా ఇల్లు, ఇక్కడుండే వాళ్ళే నా బంధువులు.

★ ★ ★

విత్తనం మొలకెత్తి, మొక్కగా పెరిగి, చెట్టుగా ఎదిగి, పూలతో పళ్ళతో పండి, మరో విత్తుకి చోటిచ్చి తను తప్పుకుంటుంది. చెట్టునుండి రాలిపోయిన ఆకుని చూసి బాధపడకూడదు. చిగురాకుకి, కొత్త ఆశలకి చోటు కల్పిస్తోందని ఆనందపడాలి.

రాకింగ్ చైర్‌లో కూర్చొని పుస్తకం చదువుకుంటున్నాను. ఆశ్రమ మేనేజర్ వచ్చి "సర్! ఒకసారి రండి" అంటూ నన్ను ఆఫీస్‌రూమ్‌లోకి తీసుకొని వెళ్ళాడు. అక్కడ ఒక వ్యక్తిని పట్టుకొని సెక్యూరిటీ అతను నించుని ఉన్నాడు. గుబురుగా పెరిగిన గడ్డం, పొట్ట వెన్నులోకి వెళ్ళిపోయి అపస్మారకస్థితిలో ఉన్నాడు.

"ఏం చేద్దాం? " అన్నాడు మేనేజర్.

"ముందు ఫస్ట్ ఎయిడ్ ఇవ్వండి. ఇప్పుడు బలరాం ఎలాగూ వస్తాడు. తను మిగతావి చెక్ చేస్తాడు. అతను వివరాలు చెప్పే స్థితిలో లేడు.. ఏమైనా దొరుకుతాయేమో? వెతుకు" అన్నాను.

అతన్ని లోపలకి తీసుకొని వెళ్లి స్నానం చేయించి, తినడానికి పెట్టారు మావాళ్లు. అతని బ్యాగ్‌లో ఒక కాగితం దొరికిందని తెచ్చి ఇచ్చాడు మేనేజర్. మడతలు పెట్టి శిథిలావస్థలో ఉన్న పెళ్లి కార్డు! దాని వెనకాల ఏవో అంకెలు వేసి ఉన్నాయి. తిప్పి చూస్తే వధూవరుల పేర్లు అన్నచోట గౌతమీ, భాస్కర్ అని ఉంది. పక్కనే వాళ్ళ ఫొటో కూడా ఉంది. వెంటనే ఆత్రుతగా కార్డును తీసికొని చూశాను. భాస్కర్ అన్న పేరును రెండు రోజుల నుండి నా మెదడు బాగా గుర్తుంచుకుంది.

కార్డుపైన ప్లీడరుగారి పేరుతో ఆహ్వానం ఉండటం వల్ల అతనే గౌతమి భర్త అని నిర్ధారణ అయింది. శుభలేఖ మీద పేకాట లెక్కలు రాసుకునే ప్రబుద్ధుడికి పెళ్ళి, భార్య విలువ తెలియకపోవడంలో ఆశ్చర్యపడనక్కరలేదు.

ఫొటోలో గౌతమి రూపం చూద్దామని, ఎంతో ప్రయత్నం చేశాను. కానీ అది అంతా నల్లగా అయిపోయి, చుక్కలుచుక్కలుగా అలుముకుపోయింది. ఏదో ఆకారాలు మాత్రం ఉన్నాయి.

ఒక్కక్షణం నా చేతులు బిగుసుకున్నాయి. బాధని, కోపాన్ని కంట్రోల్ చేసుకున్నాను. ఇతని వ్యసనాలకి గౌతమి బలయింది. అదే అతను తెలివిలో ఉండి ఉంటే బహుశా హత్య చేసి ఉండేవాడినేమో! బతికిపోయాడు. 'బయటకు తోసేయి' అందామనుకుని, తమాయించుకొని, ఆవేశం తగ్గించుకోవడానికి కాసేపు బిల్డింగ్ నుండి బయటకు వచ్చి కొంచెం దూరం నడిచి సంపెంగ చెట్టు కిందకి వెళ్ళాను. కాసేపు పచార్లు చేశాను. ఏం చెయ్యాలో పాలు పోలేదు. అతన్ని గుర్తుపట్టటానికి గౌతమి అమ్మగారు కూడా లేరు. ఆవిడ కాలం చేసి చాలా రోజులయింది. వెంటనే కృష్ణకి ఫోన్ చేశాను, బలరాం ఎలాగూ వస్తున్నాడు కాబట్టి.

ఒక్క అరగంటలో కృష్ణ, బలరాం వచ్చారు. బలరాం అతనికి పూర్తిగా చెకప్ చేసి తాగుడు మూలంగా లివర్ ప్రాబ్లం వచ్చింది. ఫరవాలేదు మందులతో నయం చేయవచ్చు. వాళ్ళవాళ్ళు ఎవరైనా ఉన్నారా? ఎట్ లీస్ట్ ఏదైనా కాంటాక్ట్ నెంబర్ ఉందా అని చూశాం. దొరకలేదు. సరే అతనికి పూర్తిగా తెలివి వచ్చిన తరువాత ఆలోచిద్దాం!

అంత వరకు అతన్ని ఇక్కడే ఉంచాలా? ఏం చెయ్యాలి? మానవత్వంతో ఆలోచిస్తే అయ్యోపాపం! అని జాలిపడ్డాం.

అక్షరం

వెప్పేది
చేసేది
ఆలోచించేది..
ఈ మూడింటికీ సారూప్యం ఉంటేనే ఆనందం

– మహాత్మాగాంధీ



కానీ అతడు పువ్వులాంటి గౌతమి జీవితాన్ని కాలరాసిన రాక్షసుడు. దేవుడు పైనుండి అన్నీ చూస్తూనే ఉంటాడు. ఎవరి లెక్క వాళ్ళకి రాసే ఉంచుతాడు. కాకపోతే ఈ స్థితిలో ఉన్న వాడిని ఏం చేస్తాం? భరించడం తప్ప! అవును అదే పని చేసింది గౌతమి కూడా. ఈ తాగుడు, పేకాట లాంటివి కూడా ఒక రకమైన వ్యాధులే. వాటికి తగిన చికిత్స చేయాలి.

బలరాం, కృష్ణ కొంచెం దూరంగా నిలబడి ఏదో మాట్లాడుకుంటున్నారు.

రమ్య నా బాధ్యత. కానీ భాస్కర్‌కి రక్తసంబంధం. అది చాలా విలువైనది. అందుకే ఈ ఆలోచన. సరే రమ్య ఎలాగూ రెండురోజుల్లో వస్తోంది. పెద్దదయింది. ఆలోచించుకునే శక్తి వచ్చింది.

★ ★ ★

"డాడీ! నే వచ్చేశా" అంది. ఎప్పుడొచ్చినా కృష్ణ ఇంట్లో దిగుతుంది. శాంతికి ఆడపిల్లలు లేకపోవటంతో రమ్యే అన్నీ తనకి.

నా మెడ చుట్టూ చేతులు వేసి "నువ్వు ఓల్డ్ బాయ్‌లా ఉన్నావు" అంది.

"మరి వయసు వస్తుంటే ఇలాగే ఉంటారు" అన్నాను. అసలు రావడమే ఒక ఝుంఝూమారుతంలా వచ్చింది. ఒకసారి వెళ్ళి ఆశ్రమం అంతా కలయ తిరిగి వచ్చింది.

అందరితో కబుర్లు చెప్పింది. వాళ్ళతో పాటలు పాడి, డాన్స్ చేసి అలసిపోయి, వేపచెట్టుకి కట్టి ఉన్న ఉయ్యాల బల్ల మీద కూర్చొని ఊగుతోంది.

నెమ్మదిగా తన దగ్గరకు వెళ్ళి గౌతమి డైరీ ఇచ్చాను. అందులో చివరి పేజీలో 'భాస్కర్ వచ్చి ఇక్కడే ఉన్నాడు, అతనే రమ్య తండ్రి' అని రాశాను.

"ఎవరి డైరీ డాడీ ఇది? " అంది.

"మీ అమ్మది రమ్యా! మొత్తం చదివి, ఆలోచించి నిర్ణయం తీసుకో" అని చెప్పి అక్కడ నుండి వెళ్ళిపోయాను.

రెండు గంటల తరువాత, ఆ డైరీ నా చేతికిచ్చి, నా లాప్‌టాప్ ఓపెన్ చేసి, మా ముగ్గురికీ వినిపించేలా "మేనేజర్ గారూ! మన ఆశ్రమంలో ఉండే మెంబర్స్, ఫైల్ ఏ ఫోల్డర్‌లో ఉందో చెప్పండి" అని గట్టిగా అంది. ఎందుకంటే అందులో మెంబర్ ఏ రూమ్‌లో ఉంటున్నాడు? ఎప్పుడు ఇక్కడికి వచ్చాడు? లాంటి డీటెయిల్స్ అన్నీ ఉంటాయి. అంతవరకూ టెన్షన్‌లో ఉన్న ముగ్గురం ఒకళ్ళ మొహాలు ఒకళ్ళు చూసుకుని ఆనందంగా నవ్వుకున్నాం.

ఆ ప్రశాంత వాతావరణంలో గౌతమీ తరంగాల సవ్వడి వింటూ, నేను ప్రత్యేకంగా పెంచుకుంటున్న సంపెంగ చెట్ల పూల పరిమళాన్ని ఆస్వాదిస్తూ కళ్ళు మూసుకున్నాను. జ్ఞాపకాలు జీవితంతో పాటే ముందుకి సాగుతున్నాయి. ఆ రోజున బాబాయి పంపిన మెసేజ్ ఇప్పటికీ నా మెదడులో నిక్షిప్తమై ఉంది.

'జీవితం ఒక రసరమ్య తరంగిణి. అది ఎన్నో మలుపులు తిరుగుతుంది. కానీ ఆగదు. నీల నీర గంభీరాల గలగలలతో కొండలను, కోనలను ఎదిరించి, చురుకుగా, వడివడిగా సాగిపోతుంది.. అదో చైతన్య ఝరి.. సాగుతూనే ఉంటుంది..!' ©

# అవార్డులు



హైదరాబాద్ రవీంద్రభారతిలో సెప్టెంబరు 9న కాళోజీ జయంతి పురస్కారాన్ని కవి, గాయకుడు గోరటి వెంకన్నకు ప్రదానం చేస్తున్న శాసనసభాపతి మధుసూదనాచారి. చిత్రంలో మంత్రులు నాయిని, ఈటెల, కడియం, మేయర్ రామ్మోహన్, ఎమ్మెల్సీలు తదితరులు.





హైదరాబాద్ తెలుగు వర్సిటీలో సెప్టెంబరు 8న గోపీచంద్ జాతీయ పురస్కారాన్ని బెంగాలీ కవయిత్రి నబనీత దేవ్‌సేన్‌కు ప్రదానం చేస్తున్న దృశ్యం. చిత్రంలో సుద్దాల అశోక్ తేజ, కె.వి. కృష్ణకుమారి, సారిపల్లి కొండలరావు, ఓల్గా, సాయిచంద్, యువకళావాహిని నాగేశ్వరరావు తదితరులు. (ఇన్‌సెట్‌లో) నబనీత దేవ్‌సేన్.

## కవితా సదస్సు

విశాఖలో సెప్టెంబరు 16న జరిగిన (బ్రిక్స్) అంతర్జాతీయ కవితోత్సవంలో ప్రసంగిస్తున్న గిరిజన కార్పొరేషన్ ఛైర్మన్, ప్రముఖ కవి రవిప్రకాశ్, వేదికపై రామతీర్థ, ఎల్.ఆర్.స్వామి, ప్రొ. కె. వెంకటేశ్వర్లు, ప్రొ. చందు సుబ్బారావు



# ఆవిష్కరణలు



గిడుగు జయంతి సందర్భంగా ఆగస్టు 29న విజయవాడలో 'గిడుగు సాహిత్య సర్వస్వం' పుస్తకాన్ని ఆవిష్కరిస్తున్న ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు, ఉప శాసనసభాపతి మండలి బుద్ధప్రసాద్, డా. వేదగిరి రాంబాబు తదితరులు



హైదరాబాద్‌లో ఆగస్టు 15న జరిగిన డి. కామేశ్వరి ఆంగ్లకథా సంపుటి 'ఫొటోఫ్రేమ్' ఆవిష్కరణ కార్యక్రమంలో కామేశ్వరి, తెలుగు విశ్వవిద్యాలయం మాజీ వైస్‌ఛాన్సలర్ డా. మంజులత, డా. వంగూరి చిట్టెన్ రాజు, డా. సరస్వతీ హనుమంకర్



ఆగస్టు 13న విశాఖలో జరిగిన 'తెలుగు కథారచయితల వేదిక' ప్రచురణ 'మా కథలు- 2015' ఆవిష్కరణ సభలో అడపా రామకృష్ణ, ఆకెళ్ల రవిప్రకాశ్, చింతకింది శ్రీనివాసరావు, సంకలనకర్త వాణిశ్రీ, (సి హెచ్. శివరామప్రసాద్) పి. చంద్రశేఖర అజాద్, సన్యాసిరావు

పెద్దకథ

# నాగలమ్మ

**తమిళ మాసపత్రిక 'కలైమగళ్' కథల పోటీలో ప్రథమ బహుమతి పొందిన కథ నాగలమ్మ! చరిత్రలోని ఓ ఉదంతం ఆధారంగా రూపుదిద్దుకున్న ఈ కథ 2015 మే, జూన్, జులై నెలల్లో ధారావాహికగా ఆ పత్రికలో ప్రచురితమై విశేషంగా పాఠకాదరణ చూరగొంది. అకారణంగా తన తండ్రిని చంపిన విజయనగర రాజుకు బుద్ధి చెప్పేందుకు పేదరాలైన నాగలమ్మ ఏం చేసిందనేదే ఈ కథాంశం.**

ముద్గల్ నగరానికి కొంచెం దూరంలో వుంది ఆశ్రమవాటిక వంటి ఆ కుటీరం. ఓ రథం వచ్చి ఆ కుటీరం ముందు ఆగింది. రథంలోంచి దిగిన వ్యక్తికి సుమారు అరవయ్యేళ్లుంటాయి. జరీ తలపాగా, పెద్ద పొట్ట, ఖరీదైన దుస్తులు.. ఆయన గొప్ప ధనవంతుడని చెప్తున్నాయి.

కుటీరంలోంచి ఉలి చప్పుళ్లు వినపడుతున్నాయి.. వాటికి పోటీగా చెట్ల కొమ్మల్లోంచి పక్షుల కుహూకుహూరావాలు..

అక్కడక్కడ అసంపూర్ణ శిల్పాలు.. వృక్ష ఛాయలలో కొంతమంది యువకులు రకరకాల శిల్పాలు చెక్కుతున్నారు.

ధనవంతుడు ఓ యువకుని సమీపించి అన్నాడు.

"బాబూ! స్థపతి కృష్ణప్పగారిని చూడాలి"

"రండి, తీసికెడతాను" అన్న ఆ యువకుడ్ని అనుసరించాడాయన.

ఓ కుటీరంలా సాధారణంగాను, అందంగాను వుందా ఇల్లు. తెల్లటి పట్టు వస్త్రం మీద నల్లటి సిరాతో ఓ చిత్రాన్ని దిద్దుతున్నారు కృష్ణప్పగారు.

"నమస్కారం స్థపతిగారూ! నేను విజయనగర వర్తకుడిని.."

"ఊc! ఏం పని మీద వచ్చారు? " అడిగారు కృష్ణప్పగారు.

"అయ్యా! నా భవన ప్రాంగణంలోని ఉద్యానవనంలో ఓ సుందరి శిల్పం నెలకొల్పాలన్నది నా చిరకాల వాంఛ! అలాంటి శిల్పం చెక్కగల సమర్థులు మీరే!"

శిల్పి అభావంగా చూశారాయన్ని.

"సందేహించకండి శిల్పిగారూ! చూసిన వారందరినీ మైమరిపించే సుందరి శిల్పం చెక్కగల సమర్థులు మీరొక్కరే!" అంటూ వ్యాపారి బంగారు నాణాల మూట తీసి ఆయన ముందుంచాడు.

అదే సమయంలో 'ఘల్లు.. ఘల్లు'మని కాలి అందియలు చప్పుడు చేస్తూ ఓ చక్కని యువతి అక్కడ ప్రత్యక్షమైంది!

ఆమెను చూసి అప్రతిభుడయ్యాడు ధనికుడు! 'అప్సరస.. అతిలోక సౌందర్యరాశి! ఆమె ప్రవేశించగానే ఆ ప్రదేశమంతా ఒక్కసారిగా కోటి సూర్య ప్రకాశమానమైంది!' అనుకున్నాడు.

"శిల్పిగారూ ఎవరీ సుందరి? "

"ఈమె నా ప్రియపుత్రిక నాగలమ్మ..!"

"నాగలమ్మ! ఆహా! శిల్పిగారూ తమరు చెక్కనున్న శిల్పం ఈమె అంత అందంగా వుండాలి!" అభ్యర్థించాడు ధనికుడు.

వర్తకుడు వెళ్లాక మౌనంగా వుండిపోయారు కృష్ణప్ప.

"తండ్రీ! ఆయన అన్నది విన్నారు కదా! నాలాగే ఓ శిల్పాన్ని చెక్కండి, నమూనాగా నేను కూర్చుంటా!" అని అనేక విధాలుగా నచ్చచెప్పి తండ్రిని ఒప్పించింది నాగలమ్మ.

"నాకైతే ఇది మంచిపనిగా అనిపించడం లేదమ్మాయ్! మనసుకు నచ్చినవాడిని పరిణయమాడి సుఖంగా వైవాహిక జీవితం గడపాల్సిన నువ్వు వర్తకుని ఉద్యానవనంలో నలుగురూ చూసి ఆనందించే శిలగా ఉంటావా..? " వాదించారాయన.

నాగలమ్మ పట్టుదలే గెలిచింది చివరికి.

★ ★ ★

అనతికాలంలోనే ఓ అపురూప శిల్పం చెక్కారు కృష్ణప్ప!

ముద్గల్ నగరమంతా దానిగురించే చెప్పుకుంటున్నారు! జనం తండోపతండాలుగా వచ్చి చూసి పరవశిస్తున్నారు!

కృష్ణప్పగారి మిత్రుడొకాయన "మీరు శిల్పకళలో కనీవినీ ఎరుగని శిల్పరాజాన్ని చెక్కారు. దీన్ని చూస్తే మీ అమ్మాయిని చూసినట్లే ఉంది. నకలనడానికి నమ్మసాధ్యం కావడం లేదు!"

"ఆ! అవును.. మిత్రమా! ఈ శిల్పం నా జీవిత పర్యంతసాధన అనుకుని గర్వపడుతున్నాను. అయినా మనసులో ఏదో తెలియని బెరుకు.. కారణం ఏమిటో తెలియడం లేదు!"

"కృష్ణప్పగారూ! నేటి రాజకీయ పరిస్థితులకు నేనూ భయపడుతున్నాను!"

"మిత్రమా మీరనేదేమిటి? "

"అవును! మనం నివసిస్తున్నది బహమనీ సుల్తానులకు చెందిన ముద్గల్ నగరం! శిల్పం వెళ్లవలసింది విజయనగర సామ్రాజ్యానికి! ఈమధ్య కొంతకాలంగా వారిరువురికీ సత్సంబంధాలు లేవు..."

కృష్ణప్ప కొంచెం గుండె దిటవు చేసుకుని "మిత్రమా! కళలకు, కళాఖండాలకు దేశాలు, సరిహద్దులు ఉండవు. కనుక ఇది వెళ్లడానికెవరూ అడ్డుపడరు. బహమనీ, విజయనగరాలు శత్రుదేశాలైనా కళల విషయంలో జోక్యం చేసుకోరు!" అన్నారు.

"అంతా శుభం జరగాలని ఆశిస్తున్నా!" అని ఆయన నిష్క్రమించాడు.

కృష్ణప్ప శిల్పానికింకా మెరుగులు దిద్దుతున్నారు. తన సృష్టి పదికాలాలు నిల్చి వుంటుందనుకుని మురిసిపోతున్నారు.

శిల్పాన్ని చూసి నాగలమ్మ "తండ్రీ! శిల్పాన్ని చూసినవారు ఈమె ఎవరని ఆలోచిస్తారు. తరువాత నా గురించి తెలుసుకుంటారు. అలా నేను చరిత్రలో నిలిచి పోతాను. మనిషి నశిస్తాడు. కానీ ఈ మహోన్నత సృష్టి ఎప్పటికీ నశించదు!" అని గలగలానవ్వింది.

★ ★ ★

అస్తమయ భానుని లేతఎరుపు కిరణాలు విజయనగర అంతఃపుర సౌధ పైభాగాలన్నింటినీ ధగధగమనిపిస్తున్నాయి. విరూపాక్ష దేవాలయ గోపురంపైనున్న బంగారు కలశాలు సూర్యుని నీరెండతో పోటీ పడి ధగధగమెరుస్తున్నాయి.

రాజవీధిలో విదేశీ వర్తకులు గుంపులుగా వున్నారు. బలిష్టమైన పొగరుబోతు ఎద్లు సరుకుబళ్లను లాక్కెడుతున్నాయి. అంతఃపుర సౌధం పైన నిలబడి అవన్నీ చూస్తున్నారు.. చక్రవర్తి దేవరాయలు. గర్వంతో ఆయన ఛాతి ఉప్పొంగింది.

"ప్రభువులకు అభివాదం!" అనడం విని తిరిగి చూశారు దేవరాయలు.

మహామంత్రి తిమ్మప్ప!

"ఊఁ! ఏం పనిమీద వచ్చారో చెప్పండి మహామంత్రి"

"ప్రభూ! యవనదేశం నుంచి చాలా గుర్రాలను కొన్నాం. మన దళపతి జాతిగు

గ్రాలను చూసిమరీ ఎంపిక చేశారు. అశ్వ శాస్త్రం ప్రకారం కొన్ని గుర్రాలు పనికిరావ న్నారు. అయితే తమరు వాటిలో ఓ గుర్రానికి అధిక ధర ఇచ్చి కొనమని చెప్పా రని అన్నారు!"

"అవును మంత్రివర్యా! నేను కొన్న ఆ గుర్రం యుద్ధానికి పనికిరాదు. కానీ దాని విశాలమైన కళ్లు, తెల్లటి మచ్చలు, చిన్న తోక.. ఇవన్నీ ఆకర్షించాయి. ఎంతో అంద మైన అశ్వం! నా అశ్వశాలలో అలాంటిది తప్పకుండా వుండితీరాలి"

"క్షమించండి చక్రవర్తీ! దాని వెల కొన్ని వేల వరహాలు! ఆ వెలకు మనం కొన్ని వందల గుర్రాలు కొనగలుగుతాం!"

"నిజమే! దాని అందం మాటేమిటి? ప్రపంచంలోని అందాలన్నీ నాకు సొంతం అన్న అభిప్రాయం కలవాడిని. ప్రకృతి లోని సహజసిద్ధమైన అందాలను సొంతం చేసుకునేందుకు నేనెంత వెలనైనా ఇవ్వడా నికి సిద్ధమే! అద్భుతాలకు వెల అడ్డు కారాదు మంత్రివర్యా!"

"మంచిది చక్రవర్తీ! ఆ తురగాన్ని తమరి అశ్వశాలకి పంపే ఏర్పాటు చేస్తాను. తరువాత.." మంత్రివర్యులు చెప్పడానికి సందేహించారు.

"ఏం చెప్పాలనుకుటున్నారో చెప్పండి"

"చక్రవర్తీ! మనం చాలాకాలం బహమనీ సుల్తాను ఫిరోజ్‌షాకు కప్పం కట్టాం. మీ తండ్రిగారి కాలం నుంచే బహమనీ సుల్తా నులకు కప్పం కట్టడం మానేశాం!"

"ఆ! అవును! మాళవం, ఘూర్జరం మొదలగు దేశాలు మనల్ని ఆదరించాయి. మనమీద యుద్ధానికొస్తే జయించలేమన్న భయంతో బహమనీ సుల్తానులు మనల్ని కప్పం అడగడం లేదు!"

"అయినా సుల్తాను మన మీదికి దండెత్తి రావడానికి అవకాశం కోసం ఎదురు చూస్తున్నాడు. వాళ్ల బలగాలను సమీకరించుకుంటున్నాడు"

"కంగారుపడాల్సిందేమీ లేదు మంత్రీ! చిన్న రాజ్యాలు మనకి అండగా నిలవడా నికి సిద్ధంగా ఉన్నాయి. మనమూ సేన లను సమీకరిస్తూనే ఉన్నాం. బహమనీ సుల్తానులు మనమీదికి యుద్ధానికొస్తే ఓడిపోవడం ఖాయం"

"మనకి విజయం తథ్యం అనడంలో ఏమాత్రం సందేహం లేదు. కానీ యుద్ధం సంభవిస్తే మన వాణిజ్య, ఆర్థిక రంగాల్లో బాగా నష్టపోతాం. కనుక సాధ్యమై నంతవరకూ సామరస్యంగా పోవడమే మంచిది ప్రభూ!"

"నిజమే మంత్రివర్యా! అలాగే చేద్దాం"

★ ★ ★

"తల్లీ! రేపు శిల్పంతో విజయనగరం వెడతాను. దీన్ని ఆహ్వానించేందుకు వర్తకు లవారి భవనం కోలాహలంగా పండుగ వాతావరణంలో వుందట. విజయనగర చక్రవర్తి, మహామంత్రి సహా అనేకమంది ప్రముఖులు ఈ సంబరాలలో పాల్గొంటా రట" నాగలమ్మతో చెప్పారు కృష్ణప్ప.

"నాకు చాలా గర్వంగా వుంది తండ్రీ! ఎవరికీ రాని పేరు ప్రఖ్యాతులు నాకు లభిస్తాయని చాలా సంతోషంగా వుంది. శిల్పంగా నేను, శిల్పిగా మీరు అజరామరకీ ర్తి ప్రతిష్టల్ని పొందుతాం!"

★ ★ ★

విజయనగరంలోని వర్తకుని నివాసానికి తరలివచ్చిన జనం ఉద్యానవనంలో అత్య ద్భుతంగా కనపడుతున్న సుందరి శిల్పాన్ని చూసి పరవశించిపోతున్నారు.

"తప్పుకోండి.. తప్పుకోండి! మహామంత్రి విచ్చేస్తున్నారు!" అని ద్వారపాలకులు హెచ్చరించాక, రక్షకభటుల మధ్య గంభీ రంగా విచ్చేశారు మహామంత్రి తిమ్మప్ప! శి ల్పసౌందర్యానికి అమాత్యులూ అవాక్క య్యారు!

"అమాత్యా! ఇది కేవలం ఊహాశిల్పం కాదు. శిల్పి తన కుమార్తెను నమూనాగా

పెట్టుకుని చెక్కారు!" చెప్పాడు వర్తకుడు.

'ఆమెకి ఇంత సౌందర్యమా?' నమ్మలే కుండా ఉన్నారు మంత్రివర్యులు.

వర్తకుడు మంత్రిగారి మౌనాన్ని అర్థం చేసుకున్నారు.

"ఈ శిల్పి శిల్పచాతుర్యం ఏమిటో తెలుసునా మంత్రివర్యా? అసలు రూపంతో వెంట్రుక వాసి తేడా రాకుండా చెక్కడం!"

★ ★ ★

మంత్రి చెప్పింది దేవరాయల ప్రభువు నమ్మలేదు.

"మంత్రీ! ఊహలకు మెరుగులు దిద్ది కళాత్మకంగా చెక్కడం శిల్పులకు వెన్నతో పెట్టిన విద్య. ఇందులో అసలు, నకలు తేడాలేంలేవు. రేపే మారువేషాలలో వెళ్లి ఆ శిల్పాన్ని చూద్దాం!"

అన్నట్టుగానే మరునాడు వెళ్లి ఆ శిల్పాన్ని చూసిన చక్రవర్తి మైమరిచారు.

"అమాత్యా! నా కళ్ళనే నమ్మలేకపోతున్నాను. ఇంతటి అపురూప సౌందర్యమా? ఇందుకు నమూనా ఓ కన్యా? రాతిశిల్పమే మనల్నింతగా మైమరిపింప చేస్తున్నదంటే ప్రాణమున్న ఆ బాల ఎంతగా పరవశింప చేస్తుందో? బ్రహ్మ సృష్టిలో ఇంత అనంత సౌందర్యరాశి నిజంగా వుంటుందా?"

"క్షమించాలి చక్రవర్తీ! ఆ అమ్మాయిని స్వయంగా చూడకుండా ఏమీ చెప్పలేం"

కానీ అందాన్ని ఆరాధించే దేవరాయ చక్రవర్తికి మాత్రం మనసు చలించింది.

'ఆ సౌందర్యరాశి వుండాల్సింది ఓ పేద శిల్పి కుటీరంలోనా? కాదు, భోగభాగ్యాలతో అలరారే విజయనగర సామ్రాజ్య అంతఃపుర భవనంలో!' శిల్పం అందం చూసిన తమకంతో ఆ అందగత్తెను చూడాలని తహతహలాడాడు చక్రవర్తి.

ఆ రాత్రి విజయనగర సామ్రాజ్యాధిపతిని నిద్రాదేవి వరించలేదు.

మర్నాడు -

"అమాత్యా! తక్షణం ఆ ముద్గల్ నగర శిల్పికి కబురు పంపండి. ఆయన పుత్రిక రాకకోసం మా విజయనగర సామ్రాజ్య అంతఃపురం తహతహలాడుతోందని తెలియజేయండి. ఇకపై ఆయన ఉలి పట్టనక్కర్లేదు. మా సామ్రాజ్య అతిథిగా అంతఃపురంలోనే ఉండొచ్చు"

మహామంత్రి అవాక్కయ్యారు.

బహమనీరాజు ఫిరోజ్‌షా గురించి తనకి బాగా తెలుసు. విద్యావంతుడైనా మత పిచ్చి జాస్తి. క్షణమైనా మధుపాత్రను వదలడు. కళారాధకుడు కనకనే తన దేశంనుంచి విరోధి దేశానికి శిల్పం వెళ్ళడానికి అనుమతించాడు. కానీ తనదేశ యువతిని విరోధివద్దకు పంపేందుకు మాత్రం సమ్మతించడు.

శిల్పం అందానికే దాసోహమై విచక్షణ కోల్పోయిన ప్రభువుకెలా నచ్చజెప్పడం?

★ ★ ★

కృష్ణప్ప బంగారు కాసులను కూతురు నాగలమ్మకు ఇచ్చి "చూడు పుత్రీ! ఇది నా శిల్పకళకిచ్చిన బహుమానం! వీటిని విజయనగర వర్తకుడు ఇచ్చాడు! ఈ ధనంతో ముద్గల్ నగరంలో సగం కొనుక్కోగలం!" అన్నారు.

"తండ్రీ! ఇదంతా నమ్మశక్యంగా లేదు! స్వప్నమేమోనని భ్రమ కలుగుతోంది!"

"తల్లీ! విజయనగర మహామంత్రివర్యులే శిల్పసౌందర్యానికి పరవశించిపోయారు! ఇకపై అంతఃపుర చెక్కడాలు, ఆలయ శిల్పాలకు నన్నే పిలుస్తామన్నారు!"

"ఇక మన పేదరికం తొలగినట్లే తండ్రీ! రాజధానికి విచ్చేసే వర్తకుల మూలంగా మీ శక్తి సామర్థ్యాలు ప్రపంచానికి తేటతెల్లమవడం ఖాయం!"

"నిజమేనమ్మా! ఇక నీకు తగిన వరుడ్ని చూసి పెళ్ళి చేస్తానమ్మా! అజంతా, ఎల్లోరా, మహాబలిపురం తదితర నగరాల శిల్పవైభవాలను చూస్తూ శేష జీవితం గడుపుతాను"

★ ★ ★

"అయ్యా! నేను విజయనగరం నుంచి వస్తున్నాను!" నమస్కరిస్తున్న వ్యక్తివంక ఏమిటన్నట్టు చూశారు కృష్ణప్ప.

రాజముద్రతో వున్న ఓ పత్రాన్ని కృష్ణప్ప చేతికిచ్చాడా వ్యక్తి.

శిల్పిని, ఆయన కుమార్తె నాగలమ్మను రాజ అతిథులుగా ఆహ్వానిస్తూ రాసిన పత్రమది. వర్తకుని భవన ప్రాంగణంలోని సుందరశిల్పానికి నమూనాగా వున్న ఆ అందాలరాశిని ప్రత్యక్షంగా చూడాలని మహారాజు ఉవ్విళ్లూరుతున్నట్లుగా ఆ పత్రంలో వుంది.

ఆ సమయంలో బహమనీ సుల్తాన్ ఫిరోజ్‌షా, ఆయన మహామంత్రి అసమ్ ఖాన్‌తో గుల్బర్గాలోని అంతఃపురం ప్రత్యేకగదిలో సమావేశమై ఉన్నారు.

"బాద్‌షాసాహెబ్! మన గూఢచారుల వర్తమానం ప్రకారం ముద్గల్ శిల్పికి విజయనగరం నుంచి ఆహ్వానం అందింది"

"మరి శిల్పి ఏమంటున్నారట? "

"బయలుదేరుతున్నారట. కానీ ఆయన పుత్రిక సంగతి మాత్రం తెలియలేదు!"

"ఇద్దరూ వెళ్ళినా ఆపవద్దు. ఈ సమాచారం సేనాపతికి పంపండి!"

"జీ హుజూర్! కానీ.."

"సందేహించకండి.. మీ మనసులో మాటేమిటో నిరభ్యంతరంగా చెప్పవచ్చు!"

"విజయనగర మహారాజు శిల్పి కుమార్తె అందానికి మోహితులయ్యారని, ఆమెను అంతఃపురంలోనే వుంచుకోవాలని భావిస్తున్నట్లు సమాచారం!"

ఫిరోజ్‌షా పెదవులపై చిరునవ్వు కనిపించి మాయమైంది.

★ ★ ★

"తండ్రీ! నాకు విజయనగరం రావడం ఇష్టంలేదు. మీరు మాత్రం వెళ్ళిరండి!" అంది నాగలమ్మ.

"ఒక్కడినేనా? మరి నేను రావడానికి ఆలస్యమయితే? " కృష్ణప్ప సంశయం.

"అయితే ఏం తండ్రీ? మీ విద్యార్థులు, పెంపుడు తల్లి వున్నారుగా! దిగులు పడకుండా బయలుదేరండి!"

కృష్ణప్ప అయిష్టంగానే బయలుదేరారు.

చక్రవర్తి దేవరాయలు, కృష్ణప్పను స్వయంగా పిలిపించి మాట్లాడారు.

"శిల్పీ! తమరొక్కరే వచ్చారా? మీ కుమార్తెను కూడా తీసుకురావాల్సింది! సరే, మీరు అంతఃపురంలో కొద్దిరోజులుండండి" అన్నారు మహారాజు.

మర్నాడు మంత్రివర్యులు "కృష్ణప్ప గారూ! ఎవరికీ దక్కని అవకాశం మీకు లభించింది! మహారాజు ప్రేమకు పాత్రురాలైన మీ కుమార్తె అంతఃపురంలో నివసించవచ్చు. ప్రత్యేక భవనం, నౌకర్లు చాకర్లు, రాచమర్యాదలతో వైభవంగా జీవించవచ్చు. ఆమెను వెంటనే బయలుదేరమంటూ పత్రం రాసి పంపండి. ఆమె అపూర్వ

**తమిళ మూలం :**
**కె. శివసుబ్రమణ్యం**

**అనువాదం :**
**ఎ. సువర్ణ**

సౌందర్యానికే ఇవన్నీ లభిస్తున్నాయి!"

ఆ మాటలకు శిల్పి ఆశ్చర్యపోయారు!

"నేను వెళ్లి నాగలమ్మతో మాట్లాడి..!" కృష్ణప్ప మాట పూర్తికాకుండానే-

"మీరిక్కడే వుండండి! మీ కుమార్తెను వెంటనే రమ్మని వర్తమానం పంపండి!" అంటున్న మంత్రి మాటల్లో అధికారదర్పం ధ్వనించింది.

ద్వారం ముందున్న భటులకు మంత్రి ఆంతర్యం అవగతమై అందుకు అనుగుణంగా సన్నద్ధమయ్యారు.

★ ★ ★

తండ్రి ఇంకా విజయనగర రాజ్యం నుంచి తిరిగిరాకపోవడంతో నాగలమ్మకు ఏమీ తోచకుండా ఉంది. ఎందువల్ల రాలేదు? మరేదైనా పని అప్పగించారా? అలాంటిదేదైనా వుంటే వర్తమానం పంపే వారు కదా!

ఓరోజు ఆమెకు ఊహించని వర్తమానం వచ్చింది. ఒక రాజభటుడు శిల్పి పంపిన పత్రం తీసుకొచ్చి ఇచ్చాడు. తండ్రి తనను వెంటనే బయలుదేరి రమ్మన్నది అందులోని సారాంశం. కానీ పత్రంలో తండ్రి చేవ్రాలు లేదు.

నాగలమ్మ అప్రమత్తమైంది.

"అయ్యా! మా తండ్రిగారిని వెంటనే ఇక్కడకు పంపే ఏర్పాటు చెయ్యండి. నేనక్కడికి రాలేను" అంటూ తిరుగు వర్తమానం పంపిందామె.

★ ★ ★

బహమనీ మహామంత్రి అసమ్ఖాన్ వేగులు చెప్పిందంతా ప్రశాంతంగా విని "నాగలమ్మ కదలికలను పరిశీలిస్తూండు. ఒకవేళ ఆమె విజయనగరానికి బయలుదేరితే వెంటనే నాకు తెలియపరచు. నా ఊహ సరైనదైతే శిల్పిని వారు ఖైదుచేసి వుంటారు"

★ ★ ★

"చక్రవర్తిగారూ! శిల్పిని చెరసాలలో బంధించాం. నాగలమ్మను ఆమె తండ్రి రమ్మంటున్నట్లుగా పత్రం పంపించాం. రానని మొండికేస్తే తరువాత? .." తన అనుజ్ఞ కోసం చూస్తూ నిల్చున్న మంత్రిని సాలోచనగా చూశారు మహారాజు.

"మంత్రీ! ఆ అపూర్వ సౌందర్యరాశిని ఏవిధంగానైనా అంతఃపురానికి తీసుకురావాలి. అందుకేం చెయ్యాలో చెప్పండి"

తను కోరిన వస్తువుకోసం మారాం చేసే చిన్నపిల్లాడిలా కనిపిస్తున్న మహారాజుపట్ల మంత్రికి విచారం కలిగింది.

"ప్రభూ! మన్నించాలి. శిల్పిని విడుదల చేసి ఆయన దేశానికి పంపేద్దాం. నాగలమ్మని మీ మనసులోంచి చెరిపెయ్యండి!"

చక్రవర్తి స్వరం హెచ్చించి "మిమ్మల్ని సలహా అడగలేదు. నాకు నీతులు చెప్పకండి. ఇంతవరకూ నేను కోరుకున్నదేదీ పొందకుండా వుండలేదు. నాగలమ్మను విజయనగరానికి ఎలా రప్పించాలో నాకు తెలుసు. ఇక మీరు వెళ్ళొచ్చు" అన్నారు.

★ ★ ★

"ప్రభూ ప్రణామాలు!"

సేనాని అచ్యుతరాయలు చక్రవర్తికి తల వంచి నమస్కరించాడు.

"రండి సేనానీ! మిమ్మల్నెందుకు పిలిపించానో తెలుసా? " అడిగారు చక్రవర్తి.

"చిత్తం ప్రభూ! మంత్రివర్యులు అన్ని వివరాలూ విశదీకరించారు. తమరి ఆజ్ఞ మేరకు నడుచుకునేందుకు సిద్ధంగా వున్నాను మహారాజా!"

"ముద్గల్ నగర సౌందర్యరాశి విజయనగరం రావాలి. ఆమె అంతఃపురానికి రావాలి. అది మీవల్ల అవుతుందా? "

"తప్పకుండా అవుతుంది మహారాజా! ఎన్నో దేశాలను ఓడించిన నేను కేవలం పేదరాలైన ఓ యువతిని సునాయాసంగా తీసుకురాగలను"

"మంచిది! తక్షణం తీసుకురండి!"

"తమరి ఆజ్ఞ ప్రకారమే అంతా జరుగుతుంది ప్రభూ!" నమస్కరించి అక్కణ్ణించి నిష్క్రమించాడు సేనాపతి.

★ ★ ★

"అమ్మా! శిల్పులను చూడాలి" అని నమస్కరించి నిల్చున్న యువకుని చూసింది నాగలమ్మ.

అతని ఎత్తయిన భుజాలు, పొడవాటి బాహువులు, నుదుటిమీది గాయపు మచ్చ. అతనో వీరసైనికుడని గ్రహించింది. ఓ యుద్ధవీరుడు తన తండ్రినెందుకు చూడాలనుకుంటున్నాడు?

"మా తండ్రిని చూడాలనుకుంటున్నా

అ
క్ష
రం

మహావృక్షం కూడా
మౌనంగానే ఎదుగుతుంది!
అలాగే మహానుభావులుగా మిగలాలంటే
మాటలకంటే చేతలకు
ఎక్కువ ప్రాముఖ్యతనివ్వాలి!

– మహాత్మాగాంధీ



రా? విషయమేంటో నాతో చెప్పవచ్చును!"

"మేమొక ఆలయ నిర్మాణం చేపట్టాం. అందుకవసరమైన శిల్పాల గురించి మాట్లాడాలనుకుంటున్నాం!"

ఆ మాటల్లో సత్యం లేదని గ్రహించిన నాగలమ్మ "వీరుడా! అబద్ధాలు చెప్పొద్దు. నిజంగా ఎందుకొచ్చారో చెప్పండి!" అంది.

ఆమె సౌందర్యరాశే కాదు, సూక్ష్మబుద్ధి కూడా కలదని అచ్యుతరాయలు తెలుసుకున్నాడు. తనను విశ్వసించని నాగలమ్మ, అబద్ధం చెప్పద్దొని గట్టిగా అనడంతో ఆశ్చర్యపోయాడు సేనాపతి.

ఆయన నుదుటి ముడుతల్లో ఎన్నిరేఖలున్నాయో లెక్కకట్టిన నాగలమ్మ "వీరుడా! ఏం చెప్పాలా? అని ఆలోచిస్తున్నావని తెలుస్తున్నది!" అంది.

"ఉహూ, అదేంలేదు తల్లీ!"

"మా తండ్రిగారు పొరుగూరెళ్లారు. రావడానికి రెండు రోజులవుతుంది. అంతవరకూ మీరిక్కడే బస చెయ్యండి!"

మనసులోని ఆశ్చర్యాన్ని లోపలే దాచుకున్నాడు సేనాపతి.

"మంచిది. అలాగే చేస్తాను!" అని అతనెళ్లగానే ఇద్దరు శిష్యులను పిలిచి "ఈ వీరుని అనుక్షణం గమనిస్తుండండి" అని చెప్పింది నాగలమ్మ.

తనమీద నిఘా వుంచారని అచ్యుతరాయలు గ్రహించాడు.. 'ఇక్కడున్న విశేషాలను విజయనగరానికి పత్రం రాసి తెలియపరచడం అసాధ్యం. మరేంచేయడం?' అనుకున్నాడు.

ఆ రాత్రి భోజనం తెచ్చిన వ్యక్తి విజయనగర వీరుడు. అచ్యుతరాయలేమైనా ఆపదలో పడితే సహాయం చేసేందుకు ఆ వీరుడ్ని మంత్రివర్యులు విజయనగరం నుంచి పంపించారు. అచ్యుతరాయలు, మంత్రిగారి ముందుజాగ్రత్తను మనసులోనే మెచ్చుకున్నాడు.

కొన్నిరోజుల తరువాత నాగలమ్మను తీసుకుని వస్తానని పత్రం రాసి అతనికిచ్చి పంపాడు. కానీ బయటకు రాగానే అతన్ని కొందరు బంధించి పత్రాన్ని స్వాధీనం చేసుకున్నారని సేనానికి తెలియదు.

అచ్యుతరాయలు రాసినట్లు భ్రమింపచేసే పత్రంతో ఓ యువకుడు విజయనగరంలో అడుగుపెట్టాడు. 'శిల్పి కృష్ణప్పను, ఈ యువకుడు కలిసి మాట్లాడే ఏర్పాటు చేయండి. ఇతను కృష్ణప్ప శిష్యుడే! కృష్ణప్ప చేవ్రాలుతో వున్న పత్రం నాగలమ్మకు పంపే ఏర్పాటు చేయండి. అప్పుడామె సందేహించకుండా విజయనగరానికి బయలుదేరి వస్తుంది' అని రాసున్న ఆ పత్రం చూసి మహామంత్రి సంతోషించారు. అది నిజమని నమ్మి యువకుడ్ని కృష్ణప్పగారి వద్దకు పంపారు.

రాజభవనంలో బందీగా వున్న కృష్ణప్ప, తనకు నమస్కరించిన యువకుడ్ని పరిశీలనగా చూశారు. అది మగవేషంలో వున్న తన పుత్రిక నాగలమ్మ అని గుర్తించిన ఆయన ఆనందానికి అవధుల్లేకుండా పోయాయి.

ద్వారపాలకులను చూపి హెచ్చరిక చేస్తూ "నేను చెప్పినప్పుడు తప్పించుకెళ్లడానికి సిద్ధంగా వుండండి" అంది నాగలమ్మ

## కొత్తగాలి...

**లెక్కకు మించి**
**మొక్కలు నాటినా**
**లెక్కపెట్టగలిగే అన్ని**
**దక్కితే చాలు!**

– వెల్ముల రాంరెడ్డి,
పూడూరు, కరీంనగర్ జిల్లా

తండ్రితో మెల్లగా.

తన ప్రియ పుత్రిక ఇలా మారువేషంలో వచ్చింది. ఎంతో నిఘావున్న విజయనగర అంతఃపురంలోకి రావడానికి ఎంత ధైర్యం వుండాలి? కృష్ణప్పకు ఇదంతా కలా నిజమా? అనిపించింది.

"యువకుడా! నీ బస కోసం ప్రత్యేక గది ఏర్పాటుచేశారు" అని కాపలాదారు చెప్పగా, ఆ గదిలోకెళ్లి తలుపుమూసి గడియ పెట్టింది నాగలమ్మ. తన తక్షణకర్తవ్యమేమిటో ఆలోచించింది. ఈ భవనం నాలుగు వైపులా విస్తరించి ఉంది. కాపలాదారులు ఎక్కువమంది లేరు. ముందు వైపు విశాలమైన మైదానం. పక్కన కోట బురుజు, దాటితే అరణ్యం.. ఆ అడవిలోకి వెడితే తప్పించుకునే మార్గం దొరకచ్చు. తండ్రితో అంతదూరం వెళ్లాలి.. ఎలా?

ఆ సమయంలో తలుపు తట్టిన శబ్దం వినిపించి, తెరిచింది నాగలమ్మ. భోజన పళ్లెంతో ఓ ముసలాయన లోనికొచ్చాడు. భోజనం చేస్తూనే వచ్చినతడ్ని పరిశీలనగా చూసింది. దాదాపు తన పొడవు, సన్నటి శరీరం! ఒక్క క్షణంలో తనపైనున్న అంగవస్త్రంతో అతని మొహాన్ని కప్పేసింది. కేకలు పెట్టబోయిన అతని నోట్లో గుడ్డలు కుక్కింది. కాళ్లుచేతులు కట్టి మంచంకిందకు తోసింది. అతని దుస్తుల్ని తాను ధరించి, ఖాళీ అయిన భోజన పళ్లెంతో బయటికొచ్చింది.

అక్కడ సామాన్లున్న పెద్దపెద్ద గంపలు, కట్టేసిన గిత్తలు, బళ్లు.. వాటిని చూస్తూ మనసులో ఓ పథకాన్ని ఆలోచిస్తూ భోజనపళ్లెంతో కృష్ణప్ప గదిలోకి ప్రవేశించింది నాగలమ్మ.

'ప్రాంగణంలో హడావిడిగా వుంటుంది. కాపలావారి దృష్టి చెదురుతుంది. మీరు మీ గది దగ్గరకొచ్చిన ఓ గంపలో దాక్కోవాలి. గంపను ఎడ్లబండిలోకి చేరుస్తారు. బండి కోట బయటకు రాగానే తప్పించుకుందాం!' తన పథకాన్ని ఒక తెల్లటి వస్త్రంమీద పులుసులోని మిరపకాయతో రాసింది నాగలమ్మ. ఆ రాసిన వస్త్రాన్ని భోజనం కింద పెట్టింది.

కాస్త చీకటిపడ్డాక నాగలమ్మ కొన్ని గిత్తలను విప్పింది. అవి రంకెలేస్తూ ఒకదాన్ని ఒకటి కుమ్ముకుంటూ ఖాళీ మైదానంలోకి పరిగెత్తాయి. కాపలాదారులు కొంతమంది వాటిని పట్టుకునేందుకు పరుగులు తీశారు. నాగలమ్మ వరుసగా పెట్టిన గంపలను పడదోసింది. అవి చెల్లాచెదురయ్యాయి. ఎర్రటి వస్త్రం కట్టిన గంపను తండ్రి వున్న గది వైపుగా తోసింది. కృష్ణప్ప ఆ గంపలోకెక్కి దాక్కున్నారు. నాగలమ్మ గంపలోకి పెద్ద పాత్రలను బోర్లించింది. ఎండిపోయిన అరిటాకులు ఆ గిన్నెల పైన పరిచింది. అంతలో కొంతమంది కాపలాదారులు ఎడ్లను లాక్కొచ్చారు. ఓ గిత్తను బండికి కట్టమని చెప్పింది. ఎర్రవస్త్రం కట్టిన గంపను బండిలో ఎక్కించేందుకు సాయపడమని కోరింది వీరులను.

పని పూర్తవగానే, బండి కోటద్వారం వైపు దారితీసింది. అలవాటు ప్రకారం కోట తలుపులు తెరిచారు. గిత్త రంకెలేస్తూ అడవిలోకి పరుగులు తీసింది. సరిగ్గా ఓ గంట ప్రయాణించిన తర్వాత బండి అడవిని సమీపించగానే కొందరు సైనికులు అడ్డగించారు.

"అభినందిస్తున్నాను వీరుడా! నీ తంత్రాన్ని ఉపయోగించి కృష్ణప్పను విజయనగర కోటనుంచి ధైర్యంగా తప్పించావు. కానీ మా సైన్యాన్ని తక్కువగా అంచనా వేశావు" అంటూ దండనాయకుడు లాగడంతో ఆమె తలపాగా ఎగిరి దూరంగా పడింది. పొడవాటి జుట్టుతో వున్న సుందరిని చూసి వారంతా ఆశ్చర్య పోయారు! అదే సమయంలో గంపలోంచి కృష్ణప్పను కూడా లాక్కొచ్చారు.

"నా కూతుర్ని తాకకండి" అంటూ కృష్ణప్ప ఆవేశంగా అన్నారు.

"ఓహో! అలాగా! శిల్పి కుమార్తెవా నువ్వు? " అని సైనికులవైపు తిరిగి "వీళ్ళిద్ద ర్నీ ఈడ్చుకురండి!" అని నాయకుడు ఆజ్ఞాపించగా ఓ సైనికుడు వేగంగా వెళ్ళి నాగలమ్మను పట్టుకున్నాడు. వెంటనే కృష్ణప్ప అతన్ని పక్కకు తోశారు.

దండనాయకుడు ఒరలోంచి కత్తి తీసి వేగంగా విసిరాడు. మరుక్షణం శిల్పి తల తెగి మొండెంనుంచి వేరై కిందపడింది.

నాగలమ్మ తండ్రి దేహం మీద పడి విలపించింది.

ఆ వేళకు విజయనగర మహారాజు సపరివారంగా అక్కడికొచ్చారు.

నాగలమ్మ చక్రవర్తి కాళ్ళమీదపడి "ప్రభూ! నా తండ్రిని అన్యాయంగా చంపేశారు. నాకు న్యాయం జరిపించండి!" అంటూ విలపించింది.

దండనాయకుడు జరిగింది వివరించి, ఆమె కృష్ణప్ప కూతురని చెప్పాడు.

నాగలమ్మ మహాసుందరి! ఇంతటి విషాదంలోనూ అందంతో మెరిసిపోతోంది. ఆమె సౌందర్యాన్ని తిలకించడానికి రెండు కళ్లూ చాలడంలేదు అనుకుంటూ మహారాజు ఆమెను తదేకంగా చూస్తున్నారు.

"సుందరీ! నువ్వు మగవేషంలో మా రాజమాళిగలో ప్రవేశించి, కాపలావారి కళ్ళుగప్పి ఓ ఖైదీని తప్పించడం క్షమించరాని నేరం. నీ తండ్రి ఒక రాజభటునిపై

## కొత్తగాలి...

**పగతో కాదు**
**ప్రేమతో**
**మనసును జయించాలి!**
**మమతలను పండించాలి!**

– గుర్రం శ్రీనివాస్,
చెరుకుపల్లి, గుంటూరు జిల్లా

చేయిచేసుకోవడం మరో నేరం. అందుకాయనను దండించడమే సరైనపని!"

"మహారాజా! పేద శిల్పిని వంచనతో రప్పించి ఖైదు చెయ్యడం, ఆయన కుమార్తెను అంతఃపురానికి ఎత్తుకెళ్ళేందుకు ప్రయత్నించడం నేరాలు కావా? ఆ నేరాలకేం శిక్ష వెయ్యాలి? " అంటూ సింహంలా గర్జించింది నాగలమ్మ.

దేవరాయల ముఖం ఎర్రబడగా, "ఎవరక్కడ? ఈమెని తక్షణం పాతాళ చెరసాలలో బంధించండి. శిల్పి శరీరాన్ని గద్దలకు వెయ్యండి!" అని ఆజ్ఞాపించారు.

"వద్దు మహాప్రభూ! వద్దు.. నా తండ్రి శరీరాన్ని మా దేశానికి తీసికెళ్తాను. ఆయనను అన్యాయంగా సంహరించిన సైనికుణ్ణి మీరు శిక్షించాలి!"

"నాగలమ్మా! ఎవరితో మాట్లాడుతున్నావనేది గుర్తించి ప్రవర్తించు. మీ తండ్రీ కూతుళ్లిద్దరూ దండనార్హులే!"

దేవరాయలు బయల్దేరబోయారు.

నాగలమ్మ పరిగెత్తుకెళ్ళి ఆయన గుర్రం కళ్లాన్ని గట్టిగా పట్టుకుంది! అది చూస్తున్న వారంతా ఆశ్చర్యపోయారు!

"మహారాజా! న్యాయం జరిపించి ఇక్కడినుంచి కదలండి. అబద్ధపుపత్రంతో శిల్పి శిరస్సు ఖండించడమే విజయనగర సామ్రాజ్య నీతా? ఏ పాపం ఎరగని



అమాయకులను చెరపట్టి చిత్రహింసలు పెట్టడమే మీ ధర్మమా?" అంటూ గర్జిస్తు న్న నాగలమ్మను పరిశీలనగా చూశారు దేవరాయలు.

"నిన్ను క్షమించాం.. వెళ్లిపో!"

"క్షమా? దేవరాయా! ఎవరికి కావాలి మీ క్షమ? నాకు నాతండ్రి ప్రాణాలు కావాలి! తిరిగివ్వగలరా? తమరు"

"అధిక ప్రసంగం వద్దు! ఇది మా చా జ్యం.. ఇక్కడిలాగే జరుగుతుంది. నువ్వే మీ చేయలేవు, ఇక వెళ్ళు"

"దేవరాయా! పేదల కన్నీరు వృథా కాదు. మీరు నాకు బదులు చెప్పవలసిన సమయం వచ్చే తీరుతుంది!"

ఆకాశం అదిరేట్లు వికటాట్టహాసం చేసి "ధీరాలుపలికే ఈ వీరవనితను లాక్కె ళ్లండి. రేపు సూర్యోదయవేళ పులిబోనులో పడేయండి" అన్నారు దేవరాయలు.

నాగలమ్మ ఆవేశంగా వంగి భూమిమీది నుంచి గుప్పెడు మన్నుతీసి "ఈ నేల బీ డుభూమిగా మారుగాక! దేవరాయా! మీ రాజ్యాన్ని, బంధువులను పోగొట్టుకోడం త థ్యం! ఇదే నా శపథం!" అంటూ నాలుగువైపులకు విరజిమ్మింది.

భటులామెను ఈడ్చుకెళ్లారు! అక్కడ చే రిన ప్రజలంతా చెదిరిపోయారు. ఆమె ఆర్తనాదాలు ఆ ప్రాంతమంతా ప్రతిధ్వనిం చాయి! 'ఎవరీమె? విజయనగర సామ్రా జ్యాధిపతినే ఎదిరిస్తున్నదే? ఈమెలో నిజాయితీతో కూడిన ఆవేశం కనిపిస్తోంది'



అనుకున్నారు వారంతా నిష్క్రమిస్తూ.

మరుసటిరోజు వేకువ వేళ.. స్పృహ తప్పి వున్న నాగలమ్మను పులిబోనులో ప డేశారు భటులు. పులి గర్జిస్తూ నిలబడిందే కానీ ఆమెనేమీ చేయలేదు! హఠాత్తుగా లేచిన నాగలమ్మ ఊహించని విధంగా బోను తలుపులను తెరిచింది!

మరుక్షణం పులి బయటకు దూకింది! సైనికులు భయంతో పరుగుతీశారు. ఆ క ల్లోల పరిస్థితిని తనకనువుగా మార్చుకుని నాగలమ్మ తప్పించుకుంది!

విలుకాండ్రు బాణాలతో వచ్చి విషబాణా లతో పులిని సంహరించారు. అప్పటికే పులి ఇద్దర్ని చంపింది. కొందరు సైనికులు నాగలమ్మను వెతికేపనిలో వున్నారు.

నాగలమ్మ తప్పించుకున్న విషయం మహారాజుకు తెలిసి దిగ్భ్రాంతిచెందారు.

"నిశ్చయంగా ఆమె స్త్రీకాదు!" మంత్రులు భయంతో అన్నారు.

"ఆమె ఇంకా విజయనగర ఎల్లలు దాటి ఉండదు! ప్రాణాలతోనో, నిర్జీవంగానో పట్టుకురండి" ఆజ్ఞాపించారు మహారాజు.

వందలమంది వీరులు రాజధాని నగరా న్ని అణువణువూ గాలించారు.

నాగలమ్మ ధైర్యంచేసి కందకంలో దూకింది. రాక్షస మొసళ్ళ బారినుంచి తప్పించుకుని ఒడ్డుకు చేరుకుంది.

కొద్దిరోజులకు ముద్గల్ నగరం చేరింది. తన ఇంట్లో బందీగా వున్న అచ్యుతరా యలను సమీపించి "ఈ పేదరాలిని

బంధించడం మీ మహారాజుకు ఎన్నటికీ సాధ్యంకాదు. ఈ గాజులు, చీర మీ దేవ రాయలకు బహుమతిగా పంపానని చెప్పు. నిన్ను వచ్చిన వేషంలో వెళ్లనివ్వను. నీ తల సగం గుండుచేయిస్తా. వెనక్కి చూడ కుండా వెళ్ళు!" అంది ఆవేశంగా.

అన్నట్లుగానే నాగలమ్మ అచ్యుతరా యలు తల సగం గొరిగించి, చీర, గాజులు ఇచ్చి పంపింది.

శిల్పకళా పాఠశాలలోని విద్యార్థులంద రినీ వారివారి ఊళ్లకు పంపించేసింది. పాఠశాలను దగ్ధంచేసి తను అజ్ఞాతంలోకి వెళ్ళింది.

బహమనీ సుల్తాను ఫిరోజ్‌షా, మహా మంత్రి అసమ్‌ఖాన్‌ను పిలిపించారు.

"ఆ శిల్పి కుమార్తె ఏమి చేసిందో గమ నించారా? "

"అవును సుల్తాన్‌షా! చక్రవర్తి దేవరా యలనే నడివీధిలో నిలబెట్టి ప్రశ్నలడి గింది. పులిబోనులోంచి తప్పించుకుంది. సేనాపతి అచ్యుతరాయల తల సగం బోడి చేసి అవమానించి చీర, గాజులు చక్రవర్తికి బహుమతిగా పంపింది!"

"మనదేశ శిల్పిని మోసపూరితంగా తన దేశానికి రప్పించి చంపించిన దేవరాయ లపై యుద్ధం ప్రకటించవచ్చు"

"కానీ ప్రస్తుతం యుద్ధం చేసేందుకు పరిస్థితులు అనుకూలంగా లేవు. విజయన గర సామ్రాజ్య సేనలతో తలపడగల సేనాబలగాలు మనకిలేవు. కేవలం ఒక పౌరునికోసం యుద్ధానికి పూనుకోవడం మంచి పద్ధతికాదు!"

"నిజమే మంత్రిగారూ! దేవరాయలపై కక్ష తీర్చుకుంటానని శపథం చేసిన నాగ లమ్మ ఇంతలోనే శిల్పకళాశాలకు నిప్పం టించి తానందులో కాలి బూడిదవడానికి కారణమేమిటి? "

"ఆవేశంలో ఆమె సాధ్యంకాని శపథం చేసిందనిపిస్తున్నది సుల్తాన్‌షా"

"ఆమె జీవితం అలా అర్థాంతరంగా సమాప్తం కాకూడదనిపిస్తున్నది!" అంటూ నిట్టూర్చారు సుల్తాన్ షా.

★ ★ ★

దేవరాయల ముందు తలవంచుకుని నిల్చున్నాడు సేనాపతి అచ్యుతరాయలు.

"అతిశక్తిమంతుడైన విజయనగర సా మ్రాజ్య సేనాపతి ఒక అబలవల్ల అవమా నాల పాలయ్యాడు. అంతకన్నా అవమా నం నాకు గాజులు, చీర పంపించడం!" ఉ ద్రేకంగా అన్నారు దేవరాయలు.

"చక్రవర్తీ! తక్షణం బహమనీరాజ్యంపై దండెత్తాలి. ముద్గల్ నగరాన్ని స్వాధీనం చేసుకుని ఆ యువతిని ఖైదు చెయ్యాలి. నాలుగు వీధుల కూడలిలో ఆమెని ఏను గులతో తొక్కించాలి!" సేనాని అచ్యుతరా యలు మండిపడ్డాడు.

"అంత శ్రమ అవసరం లేదు ప్రభూ" అంటూ ప్రవేశించారు మంత్రి.

"ఏమంటున్నారు మంత్రీ? "

"నాగలమ్మ శిల్పకళాశాలకు నిప్పంటించి, తను కూడా ఆ మంటల్లో ఆహుతైనట్లు ఇప్పుడే సమాచారం అందింది!"

ముగ్గురూ నెమ్మదిగా నిట్టూర్చారు.

అదే సమయంలో తను మరణించానని నమ్మించిన నాగలమ్మ ఓ బిచ్చగత్తె వేషంలో వీధిలో నడిచి వెళ్తున్నది. అక్క డ ఉన్నట్టుండి కలకలం చెలరేగింది. కొం దరు సైనికులు గుర్రాలపైన వేగంగా వస్తు న్నారు. అప్పుడో చిన్నారి వీధిలోంచి పరు గెత్తుకొస్తున్నది. గుర్రం కాలు తాకి పడబో తున్న ఆ చిన్నారిని నాగలమ్మ ఒడుపుగా పట్టుకుని రక్షించింది. అది చూసి అక్కడి జనం పరుగెత్తుకొచ్చారు.

"సరైన సమయంలో పసిపాపను కాపా డావు!" అంటూ ఓ వృద్ధుడు వచ్చి ఆ చి న్నారిని ఆమె నుంచి అందుకున్నాడు.

నాగలమ్మ శరీరమంతా గాయాలతో రక్తం ఓడుతున్నది!

అ
క్ష
రం

విశ్వాసం అనేది
కొద్దిపాటి గాలికి వాలిపోయేది కాదు
అది అచంచలమైనది
హిమాలయాలంత స్థిరమైనది

– మహాత్మాగాంధీ



"అమ్మా! రామ్మా మా ఇంటికి, మందు రాస్తాను. నీ ఒళ్లంతా గాయాలయ్యాయి!" వృద్ధుడు నాగలమ్మను తన భవంతిలోకి ఆహ్వానించాడు.

కవచాలు, పదునైన ఆయుధాలు కుప్పలు కుప్పలుగా ఉన్నాయక్కడ!

"ఏమిటమ్మా! అలా చూస్తున్నావు? నేను ఆయుధ వ్యాపారిని. నా పేరు ఆయూబ్ ఖాన్. నా ముద్దుల మనుమరాలిని నువ్వు కాపాడావు"

కొన్నిరోజులు నాగలమ్మ ఆయూబ్ ఖాన్ ఇంట్లోనే వున్నది.

"అమ్మా! నీ మొహంలో నిరంతర శోకం కనపడుతున్నది. నీ గురించి వివరాలు చెప్పడానికి నిరాకరించావు. నీ జీవితంలో విషాదకరమైన సంఘటన ఏదో జరిగి ఉంటుంది. ఇష్టమయితే నా కూతురుగా ఇక్కడే వుండిపోవచ్చు"

"లేదయ్యా! నాకు ఓ బాధ్యత ఉంది. అది నెరవేర్చాలి. నేను బయలుదేరుతాను. నన్ను ఆపొద్దు!"

"మంచిదమ్మా! నీ ఇష్టం. నా ప్రాణానికి ప్రాణమైన నా మనుమరాలి ప్రాణాలను కాపాడావు. కృతజ్ఞతగా నీకు ఏదైనా చెయ్యాలనుకుంటున్నాను. ఏం కావాలో అడుగు. నెరవేర్చుతాను!" ఆయూబ్ ఖాన్ బతిమిలాడాడామెను.

అభావంగా చూసిన నాగలమ్మ తర్వాత- "అలా అయితే నాకు అన్నిరకాల యుద్ధవిద్యల్లో శిక్షణ ఇవ్వండి. ఏనుగులు ఎక్కడం, నియంత్రించడం, గుర్రాలెక్కి స్వారీ చెయ్యడం, ఈటె, గొడ్డలి, కత్తి, బాకు, విల్లు.. వంటి ఆయుధాలతో యుద్ధం చేయడం, సైన్యం నడపడం, వ్యూహరచన, బలమైన కోటలను ముట్టడించి పడగొట్టగలగడం.. అన్నిరకాల యుద్ధనైపుణ్యాలను నేర్పించండి.. అవన్నీ నాకు అత్యావశ్యకాలు!"

ఆయూబ్ ఖాన్ నవ్వాడు "వీటన్నిటిలో శిక్షణ ఇవ్వగల నేర్పరిని, పండితుడిని నేను. భరతఖండం మొత్తంలో ఏ కొద్దిమందికో ఈ విద్యలలో పాండిత్యం వుంది!"

"అలాగైతే.."

"తప్పకుండా నువ్వడిగిన విద్యలన్నింటిలోనూ నీకు తర్ఫీదు ఇస్తానమ్మా!"

"కృతజ్ఞతలు అయ్యా! అన్ని యుద్ధవిద్యలూ నేర్చుకుని, నిపుణత్వం సంపాదించి వీరాంగన అయ్యేంతవరకు ఇక్కడే వుంటా"

మర్నాటి నుంచే కఠిన పరిశ్రమ ప్రారంభమయింది. నాగలమ్మ పట్టుదలతో విద్యలు నేర్చుకోవడంలో లీనం అయింది. స్వల్పకాలంలోనే గొప్ప వీరాంగనగా ఆరితేరింది. తర్వాత ఆయూబ్ ఖాన్ నుంచి వీడుకోలు తీసుకుంది.

తండ్రి తనకిచ్చిన బంగారునాణాల మూట తీసుకుంది నాగలమ్మ. కొంత మంది యువకులకు బంగారు నాణాలిచ్చి తన దగ్గర చేర్చుకుంది. కొన్ని యుద్ధవిద్యల్లో తర్ఫీదు ఇచ్చి చిన్న దళం తయారు చేసుకుంది.

"వీరులారా! రేపు మనం విజయనగర సామ్రాజ్యంలో చిన్నచిన్న ఊళ్లపైబడి దోచుకుంటాం.. తగలపెడతాం" దళసభ్యులతో చెప్పింది నాగలమ్మ.

మర్నాడు విజయనగరం ఎల్లల్లోని గ్రామాలు తగలబడ్డాయి.

తరువాత కొన్ని ఊళ్లలో జరిగిన దోపిడీలు, తగలబడడాలు రాజధానికి తెలిశాయి. దేవరాయలు దిగ్భ్రాంతులయ్యారు.

"అచ్యుతా! ఆ దోపిడీగుంపుని తుదముట్టించాలి. సేనలను అక్కడికి పంపించు!" ఆజ్ఞాపించారు రాజు.

కొన్నిరోజులకు అచ్యుతరాయలు తిరిగివచ్చాడు. "చక్రవర్తీ! అది దోపిడీ దొంగల ముఠాలా లేదు. అతి సమర్థులు, చాకచక్యం గల వీరులెవరో వున్నారని సందేహంగా వుంది నాకు!" అన్నాడు.

"ఏమంటున్నావు? "

"అవును మహారాజా! మన సేనా విభాగాన్ని పూర్తిగా నాశనం చేశారు!"

"ఆహా! అలాగైతే వెయ్యిమంది వున్న ఓ సేనాబలగాన్ని పంపించు"

కొంతకాలం ప్రశాంతత పిమ్మట బహమనీ - విజయనగర సామ్రాజ్య సరిహద్దు ప్రాంతాలలో అనుకోని ఆక్రమణలు!

"చక్రవర్తీ! ఇప్పుడు జరిగే యుద్ధాలలో బహమనీ సుల్తానుల హస్తం వుందనిపిస్తున్నది!" మంత్రి సందేహం వెలిబుచ్చారు.

బహమనీ సుల్తానుకు హెచ్చరిక పంపించారు. మళ్ళీ మళ్ళీ పోరు మొదలుపెడితే పెద్ద ఎత్తున నష్టపోతారని హెచ్చరించారు! కానీ ఆ దోపిడీలకు తమకు ఏ సంబంధంలేదని బహమనీ సుల్తాను నుంచి బదులు వచ్చింది.

దేవరాయలుని నిద్ర పోనియ్యకూడదని నాగలమ్మ నిర్ణయించుకుంది.

ఓ అమావాస్య చీకటిరాత్రి!

పెద్ద ఓడ!

విజయనగరానికి చెందిన ఆ ఓడ సముద్రం అలలపై గంభీరంగా అటూ ఇటూ వూగుతున్నది. ఓడను నడిపే సరంగులు తాగిన మత్తులో వున్నారు.



ఆ చీకట్లో దూరం నుంచి ఓ చిన్న పడవ వేగంగా ఓడ సమీపానికి వస్తున్నది. పడవ నుంచి వస్తున్న నిప్పు బాణాలు ఓడను తాకాయి. మంటలు ఓడ నలుమూలలకు వేగంగా వ్యాపించాయి. జనాల హాహాకారాలతో ఓడ జలసమాధి అయింది. అలా విజయనగర చక్రవర్తి కి చెందిన పదికి పైగా ఓడలు ఆ రాత్రి భీకరాగ్ని కీలలకు ఆహుతయ్యాయి.

అపుడు జరిగిన అత్యవసర సమావే



శంలో చాలామంది మాట్లాడారు.

బహమనీ సుల్తాను అనుమతితోనే సరిహద్దు గ్రామాలలో దోపిడీలు జరుగుతున్నాయి.. ఆయనను హెచ్చరిస్తూ దూతను పంపమన్నారు మహామంత్రి.

బహమనీలపై సేనలతో దండెత్తి, మరిచిపోని విధంగా పాఠం చెప్పిరావాలన్నాడు సేనాపతి అచ్యుతరాయలు. మంత్రి, ప్రధానులు మరికొంతమంది దండెత్తాలనే అన్నారు. బహమనీ రాజ్యం మీదికి దండెత్తడానికి మహారాజూ అంగీకరించారు.

★ ★ ★

నాగలమ్మ పకపకా నవ్వింది "బహమనీ మీదికి దండెత్తుతాడా.. అహంభావి దేవరాయలు? ఈ పోరు ఆయన జీవితంలో మరిచిపోనిదిగా వుండాలి!" అని తన చుట్టూ వున్న వీరులను చూసి-

"వీరులారా! విజయనగరం అంతా

కొత్తగాలి...

**నిప్పు నాగరికతకు ఓంకారం**
**చక్రం జగతి ప్రగతికి శ్రీకారం**
**కంప్యూటరు, అంతర్జాలం**
**అభ్యుదయానికి ఆకారం!**

*- అంబటి వెంకటశివారెడ్డి,*

*యర్రగుంట్ల, కడప జిల్లా*

భయంకరమైన యుద్ధభయాన్ని ప్రచారం చెయ్యండి!" అని ఆజ్ఞాపించింది.

వీరులు ఆమె ఆజ్ఞను ఆచరిస్తున్నారు.

★ ★ ★

"అచ్యుతరాయా! మన సేనలో ఎక్కువ మందిని సరిహద్దులకు పంపుదాం. నేనే నాయకత్వం వహించి నడిపిస్తాను!" దేవరాయలు దృఢంగా చెప్పారు.

మంత్రి సంకోచిస్తూనే అన్నారు "మన్నించాలి మహారాజా! సేనాపతి మాత్రం వెళ్తే సరిపోతుందనుకుంటాను. మీరు రాజధాని నగరానికి రక్షణ బాధ్యత వహిస్తే మేలు"

చక్రవర్తి ఎగతాళిగా నవ్వారు

"మహామంత్రీ! విజయనగర మహాసామ్రాజ్య రాజధాని నగరంపై దండెత్తే వాడెవడూ ఇంతవరకూ పుట్టలేదు. కోటను కాపలా కాచే నాయకుడే రాజధానిని రక్షించే బాధ్యత వహిస్తాడు!"

అదే సమయంలో బహమనీ సుల్తాను ఫిరోజ్‌షా మంత్రులతో సమాలోచనలు చేస్తున్నాడు.. "మంత్రీ! విజయనగర సేనలను ఎదిరించి పోరాడడం మనకు సాధ్యం కాదు. సంధి చేసుకుంటామని ప్రకటిస్తే మంచిదనుకుంటున్నాను!"

"సుల్తాన్‌షా! దేవరాయలు తమ సేనలకు తగిన విధంగా తర్ఫీదు ఇవ్వడం లేదు. మాళవం, ఘూర్జరం వంటిదేశాలతో మిత్రభావంతో వుండడం వలన విజయనగర సామ్రాజ్యం బలమైన దేశంగా వుంది. మొదట వాళ్లను యుద్ధానికి రానీయండి. తరువాత మనం దండెత్తుదాం. వారి మిత్రదేశ సేనలు సహాయానికి రాకుండా, వారికి సహాయం అందకుండా చేద్దాం. అప్పుడు విజయం మనదే అవుతుంది" వ్యూహానికి మంత్రి రూపకల్పన చేశారు.

★ ★ ★

"వీరులారా! దేవరాయలు పెద్ద సైన్యంతో సరిహద్దు ప్రాంతాలకు తరలి వెళ్లాడు. రాజధాని రక్షణ లేకుండా వుంది. మీలో కొందరు విజయనగర వీరుల్లా మారువేషాలతో కోటలోనికి ప్రవేశించాలి. మిగిలినవారు కోట గుమ్మంలోనే వుండి నిఘా వేయాలి. అర్ధరాత్రివేళ బయటి నుంచి ఓ ధ్వని వినిపిస్తుంది. ఏ మాత్రం ఆలస్యం చెయ్యకుండా కోట ద్వారాలు తెరవాలి. తరువాత కొద్దిసేపట్లో కోట మన స్వాధీనం అవుతుంది!" నాగలమ్మ వ్యూహ రచన చేసింది. అణుమాత్రం తేడా లేకుండా ఆమె పథకం అమలైంది.

"అదిగో.. కోటపైన ఎగురుతున్న సూకరం జెండా పీకిపారెయ్యండి. దేవరాయలు కేకలు పెట్టాలి. ఇటుపైన సరిహద్దులకు వెళ్లండి. విజయనగర సేనలను వెనక నుంచి ముట్టడించండి" నాగలమ్మ వీరావేశంతో సందేశమిస్తోంది.

★ ★ ★

సముద్రంలా పరుచుకున్న సేనలను చూస్తూ దేవరాయలు "అచ్యుతా! మనం సరిహద్దులకొచ్చి రెండురోజులైంది. బహమనీ సేనలు బారులుతీరి నిలిచి ఉన్నాయే కానీ యుద్ధం చెయ్యడం లేదే? " అడిగారు.

"మన సేనలను చూసి భయపడుతున్నాడు చక్రవర్తీ! రేపటిలోగా బహమనీ సుల్తాను సంధియత్నాలు చేస్తాడు. అలా కాకపోతే మనమే యుద్ధం ఆరంభిద్దాం"

"మన సైన్యం అగ్రభాగంలో అశ్వదళాలను నిలబెట్టాం. యుద్ధం వేగంగా ప్రారం

భించడానికి ఈ సేనలు ఉపయోగపడ తాయి. గజదళం చివరన వున్నది. స్వాధీనం చేసుకున్న బహమనీని నాశనం చెయ్యడానికది ఉపయోగపడుతుంది"

ఆ గజబలం వెనుక కొద్దిదూరంలో తన సేనతో పొంచి ఉన్న నాగలమ్మ "మనం రాజధానిని స్వాధీనం చేసుకున్న విషయం కొద్దిసేపట్లో దేవరాయలుకు తెలుస్తుంది. అతనికి ఆలోచించే వ్యవధి ఇవ్వకూడదు. ఎవరూ ఊహించని విధంగా గజస మూహంపై బాణాలు వెయ్యండి. బెదిరిన ఏనుగులు విజయనగర సేనలనే తొక్కేస్తాయి. మీరు సేనలపైకి మెరుపు దాడి చెయ్యండి. సైనికులు, ఏనుగులు మన వీరుల చేతిలో హతమవ్వాలి. దేవ రాయల్ని ప్రాణాలతో ఖైదు చెయ్యాలి. మన అంచనాలకు మించిన విజయనగర సేనలతో జాగ్రత్త వీరులారా! వివేకం, ధైర్యం మనకు సహాయపడతాయి. ఊc! బాణాలు సంధించండి!" అని తుపానులా చెలరేగింది నాగలమ్మ.

హఠాత్తుగా ఏనుగులు బెదిరి పరిగెత్తు తుంటే విజయనగర సేనలో కలకలం..

అగ్ని బాణాలకు గుడారాలు తగలబడు తున్నాయి. ఏం జరుగుతున్నదో తెలుసు కుని ఎదిరించడానికి వీరులు వ్యూహం పన్నారు. అంతలోనే పరిస్థితులు చెయ్యిదా టిపోయాయి. నాగలమ్మ సైనికులు చిచ్చర పిడుగుల్లా వందలసంఖ్యలో చొచ్చుకొచ్చి చేస్తున్న దాడులకు విజయనగర సేనలు ఛిన్నాభిన్నం అయ్యాయి. ముందు వరు సలో నిలబడిన అశ్వసేనలపైన మంటల బాణాలు సంధించారు. అన్నివైపుల నుంచి హాహాకారాలు చెలరేగాయి.

సైనికులు, దళపతులు, పనివారు, వంటలు చేసేవారు, దాసీ జనం.. పెద్ద సంఖ్యలో ఉండడమే తన బలహీనత అని ఆలస్యంగా తెలుసుకున్నారు చక్రవర్తి.

మరోపక్క రాజధానిని ముట్టడించారన్న వార్త విజయనగరమంతటా ప్రతిధ్వనిం చింది. విరోధి ఎవరో తెలియక సేనలు తికమకపడ్డాయి. తమ కళ్లఎదుట జరుగు తున్న ఘోర వినాశనాన్ని బహమనీ సేనలు భయం భయంగా చూశాయి. విజ యనగర బలగాలు చెల్లాచెదురై నలువైపు లకు పరుగులు తీశాయి. వ్యూహాత్మకంగా దేవరాయలు బందీ అయ్యారు.

"ను... ను... ఆ శిల్పి కూతురు నాగల మ్మవేనా..? "

"దేవరాయా! నాగలమ్మనే! పేదపిల్ల ఏం చెయ్యగలదని తేలికగా అన్నావే? పేదది తల్చుకుంటే దేశం, నగరం, రాజ్యం.. అన్నీ పోగొట్టుకున్న దేశ దిమ్మరిని చెయ్యగలదు! ఏదీ నీ సింహాసనం? ఏదీ నీ సామ్రా జ్యం? స్త్రీ తల్చుకుంటే పెద్దపెద్ద సామ్రా జ్యాలనే కూలగొట్టగలదని ఇప్పటికైనా తెలుసుకున్నావా? పేదదాని కన్నీరు ఎంత శక్తిమంతమైందో తెలిసిందా? " మృత్యుదే వతలా గర్జించిన నాగలమ్మను చేష్టలుడిగి చూశారు దేవరాయలు.

"నన్ను.. నన్ను క్షమించమ్మా!" కన్నీ టితో తలవంచుకున్నారు దేవరాయలు.

"దేవరాయా! ఇప్పుడు నిన్ను క్షమిస్తే నా తండ్రి బతికి వస్తాడా? నా తండ్రిని ప్రాణాలతో తిరిగి ఇవ్వగలవా? "

"ఇవ్వలేను నాగలమ్మా! న్యాయమైన పేదరాలి ప్రతీకారం ముందు ఏదీ నిలవ దని తెలుసుకున్నాను. పేదవారూ మను షులే! వారికీ ఆత్మాభిమానం వుంటుంది. వారిని బాధిస్తే అగ్నిపర్వతాలుగా మారి భయంకరమైన కోపాగ్నిని వెదజల్లుతారని అర్థం చేసుకున్నాను"

"ఈ పేదరాలి కోపాగ్నిని తెలుసుకోవడా నికి నువ్వు చెల్లించిన మూల్యం ఎంతో తె లిసిందా? ఇకనైనా మనుషులకి విలువిచ్చి గౌరవించు. నాకీ సామ్రాజ్యం మీద ఆశ లేదు. వెళ్లిపోతున్నా.." అని తక్షణం గుర్ర మెక్కి నాగలమ్మ నిష్క్రమించింది. ©

పెద్దకథ

# అభిమాని

తన జీవితం గురించి మాచెల్‌కి చింతగా ఉండేది. హెన్రీతో కూడా సంతోషంగా గడపలేకపోతోంది. ఆమెకు ముప్ఫయ్ అయిదేళ్ల వయసు వచ్చింది. ఎగురుతున్న గోధుమరంగు జుత్తూ, అందమైన పలువరసా ఆమెను ఒక సినీతారగా స్ఫురింపచేస్తాయి. సినీతార కంటే ఒక్క పిసరు తానే మెరుగ్గా ఉన్నట్టు కూడా ఆమె తలపోయడం కద్దు. కారణం ఆ సినీతారకు సొంత పళ్లు కూడా లేవు.

ఇక హెన్రీ సంగతి.. అతడు పొట్టివాడు. మధ్య వయస్కుడు. బట్టతల. చిన్నమీసం. ఇంటినే అంటిపెట్టుకుని ఉంటాడు. భార్యను ఒక్క క్షణం కూడా విడిచిపెట్టి ఉండడు. ఎప్పుడూ వాకిట్లోనో, తోటలోనో తచ్చాడుతుంటాడు. వారం అంతటికీ కేవలం గురువారం మాత్రమే తన హోటల్‌కి పోయి తతిమ్మా వారితో కలిసి సమావేశంలో పాల్గొంటుంటాడు.. అంతే!

హెన్రీ అంటే మాచెల్‌కి అసలు ఇష్టం ఉండదు. మూడేళ్ల క్రితం తప్పనిసరి పరిస్థితుల్లో అతడ్ని పెళ్లి చేసుకుంది మాచెల్. ఈ మూడు సంవత్సరాల్లోనూ తను ఎంత తప్పు చేసిందీ బేరీజు వేసుకుంటూ విచారిస్తూంటుంది. మూడు సంవత్సరాల క్రితం ఆమెకు ఎలాంటి ప్రోత్సాహకరమైన అవకాశాలూ ఉండేవి కావు.

ఈ పట్నంలో కొంతకాలం క్రితం నివసించింది మాచెల్. పెళ్లి జరిగిన తర్వాత తిరిగి ఇక్కడికే వచ్చింది. అప్పట్లో ఆమె వద్ద ఎర్రటి ఏగానీ కూడా ఉండేది కాదు.

వసతిగృహాల్లో చిన్నాచితకా పనులు చేసుకుంటూ బతికేది. ఒక వసతి గృహంలో హెన్రీ ఉద్యోగం చేసేవాడు.

ప్రతి బల్లా తిరుగుతుండేది మాచెల్. ఎంత ఎగిరెగిరి దంచినా ఆమెకు దక్కే కూలితో అంతంత మాత్రంగానే ఉండేది బతుకు! అందరి అడుగులకు మడుగులొత్తుతూ బతకవలసి వచ్చేది. అదిగో, అలాంటి సమయంలో ఆమెను పెళ్లి చేసుకుంటానని ప్రతిపాదించాడు హెన్రీ.

వసతిగృహ సేవల నుండి ఆమెకు విముక్తి లభించింది. ఒక గృహిణిగా స్థిరపడింది. అక్కడికీ తానేదైనా పని చేస్తానని హెన్రీతో అన్నది. అతడు ఎటూ వారంలో రెండు రాత్రులు బయటికెళ్లి వసతిగృహాల్లో పనులు చూసుకుంటాడు.

ఆమెను ఒంటరిగా విడిచిపెట్టి వెళ్లేటప్పుడు అతడు శిరస్సును గిర్రున తిప్పుతాడు. ఆమెను విడిచిపెట్టి వెళ్లడానికి తానెంత బాధపడుతున్నాడో వివరించి చెబుతాడు. ఎక్కడెక్కడో సరదాలు తీర్చుకోవాలని తనకు ఉండనే ఉండదంటాడు. ఒక వసతిగృహంలో అతడు ఉద్యోగం చేస్తాడు. రెండో వసతిగృహంలో మాత్రం అతడి స్వార్థం ఉంది.

హెన్రీ గురించిన ఈ సమాచారం అంతా మాచెల్‌కి కొట్టినపిండే. అతడు ప్రతినిత్యం నడయాడే తోట అంటే మాచెల్‌కి కంపరంగా ఉంటుంది. తోట పని అంత మూర్ఖపు పని ఆమెకు కనిపించదు. అదంతా సమయాన్ని వృథాగా గడపడంగా లెక్కకడుతుంది ఆమె.

అతడు తోటపని చేస్తున్నంతసేపూ అత డిని పట్టించుకోదు. అతడు ఉన్న ఛాయ లకు రాదు కూడా. అతడు మాత్రం మాచె ల్‌ని తన వెంట ఉండమని సతాయిస్తుం టాడు. 'నేనేం చేస్తున్నానో చూడటా నికేం? ' అంటాడు.

మాచెల్ ఒళ్లు మంటకి ఇదీ ఓ కారణం.

ఆ తోటలో ఏమీ ఎదగదు. ఎదుగుద లకి అవసరమైన సూర్యరశ్మి అక్కడ ప్రస రిస్తే కదా! నేలలోంచి ఏ మొక్కా ఎదిగిన దాఖలాలు లేవక్కడ. ఇక కింది భాగ మంతా చెమ్మగా ఉంటుంది. చీకటి సరే సరి. తన సమస్యను పరిష్కరించుకోవల సిందే అనుకుంది మాచెల్.

హెన్రీకి విడాకులు ఇవ్వడంతో సమస్య పరిష్కారం కాదు గాక కాదు. ఈ చిన్ని పట్నంలో అలాంటి పని ఎలాంటి మేలూ చేయదు.

హెన్రీ తన పుట్టుకనుండీ ఇక్కడే బతి కాడు. న్యాయమూర్తి కూడా అతడివైపే! విడాకులు మంజూరు చేయకపోవటానికే ఎక్కువ అవకాశం ఉంది. తనవైపున విడా కుల మంజూరుకు తగినంత కారణం ఏముంటుంది?

ఇక హెన్రీ ఒక కొరకరాని కొయ్య. తన మట్టుకు తాను పరిపూర్ణ యవ్వనంతో పిటపిటలాడుతుందయ్యె. తనలో ఆకర్షణ శక్తికి ఏం లోటు వచ్చింది? ఇలాంటి ఆలోచన రేగినప్పుడు ఆమె పోయి అద్దం ముందు నిలబడుతుంది. కానీ హెన్రీ తెచ్చే చౌకబారు అద్దాల వల్ల పూర్తి అందం బహిర్గతం కావడం లేదు. మొహం ఎంత సుందరమైనదో ఆ అద్దాలు చూపలేవు. పూర్తి న్యాయం చేకూర్చలేవు.

రాత్రి భోజనమయ్యాక హెన్రీ తోటప నిలో పడ్డాడు. మాచెల్ ఒక సినీ పత్రిక చదువుకుంటోంది. లక్షలసార్లు.. ఆమె మరోసారి తనను తాను అగ్రశ్రేణి సినీతా రతో పోల్చుకుంటూ ఆమెకంటే తానెంత మెరుగో అంచనా కట్టుకుంటోంది.

ఆ తార కంటే తనను అత్యంత సౌందర్య రాశిగా గుర్తించరెందుకు? అది ఒక అంతుచిక్కని రహస్యంగా మిగిలిపో యింది.

"మాచెల్! తోటలోకి రావచ్చు కదా! ఏం చేస్తున్నానో చూడవచ్చు కదా!" అన్నాడు హెన్రీ, తోటలో నుండి.

"అక్కడికా! ఆ మురికి కూపానికా? నే ను రాను" ఆమె గగ్గోలు పెట్టింది.

"ముప్ఫయ్ లక్షల సంవత్సరాల్లో ఒక్క సారి కూడా రాను సుమా!" అంటూ ఆమె సినీ మాసపత్రికను ఈ మూలా ఆ మూలా పరిశీలిస్తోంది. అక్కడేదో కలిసి వస్తోన్నట్లు చూపు నిలబెట్టింది.

"ఒక్కసారి కిందికి రా! నీకు ఒకటి చూపిస్తాను!" అన్నాడు హెన్రీ.

ఆమె మాట్లాడలేదు.

"దయచేసి కిందికి రా.. ఒక్కసారి!"

"నీ తోట సంగతి తగలెయ్యి! నన్ను ఒ దల్రా బాబూ"

"తోట గురించి కదా అడుగుతున్నాను. రా ఒక్కసారి! నీకు నచ్చుతుంది. నిజాయి తీగా చెబుతున్నాను. నీకు నచ్చి తీరు తుంది" అన్నాడాయన.

మాచెల్ కుర్చీలో కూర్చుంది.

తన భర్త పట్టిన పట్టు వదలడని ఆమెకు తెలుసు. వేలం పాటలా పాడిందే పాడతాడు. ఒక పురుగును విదిలించినట్టు విదిలిస్తే తప్ప తిరిగి అతడు తోటలోకి చావడు. పగిలిపోయి పనికి రాకుండా పోయిన సీసా మాదిరిగా అతడిని విసిరి కొట్టాలి.

సినీ పత్రికను నేలకేసి విసిరికొట్టి మెట్ల వైపు కదిలిందామె. తనలో రేగే ఆవేశానికి తానే వణుకుతోంది.

పునాదుల్లో వెలుతురు పడుతోంది. పని చేసే దుస్తుల్లో ఉన్నాడు హెన్రీ. అతడి

పక్కనే ఎత్తయిన మట్టికుప్ప! ఆయాసంతో చెమటలు కక్కుతున్నాడు. అయినప్పటికీ మొహం మీద చిరునవ్వు కదలాడుతోంది.

"నీ అభిప్రాయమేమిటి?" అతడు ఉద్వేగంగా అన్నాడు.

"దేని గురించి?"

"పని గురించి"

దగ్గరికి నడిచింది మాచెల్. అప్పుడు గుర్తించింది. నిజమే! అతడు చాలా పెద్ద గొయ్యి తవ్వాడు. మెత్తటి మట్టిలో ఆరడుగులు తవ్వాడు.

"ఎందుకింత దరిద్రపు పనిచేశావ్?" అడిగిందామె.

అతడి చిరునవ్వు పెద్దనవ్వుగా మారిపోయింది.

"ఈ తోటలో ఏదీ పెరగదని కదా హాస్యమాడతావ్. అందుకే ఇదంతా!" అన్నాడతను.

"ఇప్పుడూ అంతే.. ఏదీ ఎదగదు!"

"ఇప్పుడు ఎదుగుతాయి చూడు!" ఒక బాల్చీ నిండా మెత్తటి మన్ను తీసుకుని దాన్ని ఆమె వైపు చాపాడతను.

దూరంగా గెంతింది మాచెల్.

"ఇదంతా కొత్త ఎరువు. మొక్కలకు అడుగున చేర్చాలి. లేదా దాన్ని గోతిలో ఉంచి మొక్కలను నాటుకుంటే ఎదగకేం చేస్తాయి? ఎండా, వేడిమీ సోకని లోటును ఈ ఎరువు తీర్చుతుంది"

"పనికి మాలినవాడా! ఈ గోతిని చూడటానికా పనిమాలా తోటలోకి రమ్మన్నావ్!" చివాలున వెనక్కి తిరిగింది మాచెల్. కానీ సంబాళించుకుని ఒక్కక్షణం తన భర్తను ఓరకంట చూసింది. తర్వాత ఆ పెద్దగోతిని పరిశీలనగా చూసింది.

నిజంగానే ఆ గొయ్యి చాలా పెద్దది. ఇంటి పునాదివైపు తన చూపులు మళ్లాయి. తరువాత అవి గోతికి దగ్గరగా హెన్రీకి ఇవతలగా ఉన్న సుత్తి మీదకు జరిగాయి. హెన్రీకి కేవలం కొద్ది అడుగుల దూరంలో మాత్రమే ఉంది సుత్తి. సుత్తివైపు ఆమె మెత్తగా అడుగులు వేసింది.

తలొంచి ఆ పెద్ద గోతిలోకి మట్టిని నెమ్మదిగా తోస్తున్నాడు హెన్రీ.

"తోట పని విషయంలో నువ్వు మరికొంత శ్రద్ధ చూపించాలి సుమా! ఇక్కడ ఈ చిత్తడి ప్రాంతంలో, వెలుగు సోకని మారుమూల ఒకనాటికైనా మొక్కలు పెరుగుతాయి" అంటున్నాడతను.

అతడి శిరస్సు వెనక భాగాన్ని కేంద్రీకరించి చూస్తోంది మాచెల్. ఈ చీకటి చిత్తడి ప్రాంతంలో, పనికిమాలిన మారుమూలలో హెన్రీనే పాతిపెట్టేస్తే- ఆమె పెదిమ కొరుక్కుంది. అంతే! మొక్కలు ఎటూ పెరగవు కాబట్టి హెన్రీనే పాతేస్తే ప్రయోజనకరంగా ఉంటుంది.

"ధడ్.. ధడ్.."

అమెరికా మూలం :
**రేమండ్ మాసన్**

---

అనువాదం :
**ఎం.వి.వి. సత్యనారాయణ**

హెన్రీ శిరస్సు వెనకభాగాన్ని బలంగా తాకింది సుత్తి.

హెన్రీ అసలే పిట్టమనిషి. ఆ దెబ్బలతో గోతిలోకి దొర్లిపోయాడు.

ఆ పెద్ద గోతిలోకి తొంగిచూసిన మాచెల్ కి ఇంచుమించు హెన్రీ మెత్తటి మన్నులో కూరుకుపోయి కన్పించాడు. ఆ స్థితిలో అతడు చాలాకాలం నుండి భూస్థాపితమైపోయిన వాడిలా కనిపిస్తున్నాడు. అయిదారువేల సంవత్సరాలుగా శాశ్వత నిద్రలో ఉన్న 'మమ్మీ'గా అనిపిస్తున్నాడు. పత్రికల్లో మమ్మీల గురించి ఆమె చదివి ఉన్నది.

కొద్దిపాటి విచారం ఆమెను తాత్కాలికంగా ఆవరించింది.

'అతడిని చూస్తే జాలి కలుగుతోంది' మూలిగింది ఆమె.

తనను తాను పోల్చుకునే సినీతార మాదిరిగా ఆమె దుఃఖం అభినయించి మరీ మూలిగింది.

'ఆ సినీతార అయితే తన హెన్రీ వంటి భర్తను చంపవలసి వస్తే ఇలాగే దుఃఖిస్తుందా?' అని కూడా మాచెల్ తలపోసింది. హెన్రీ వంటి భర్త చేతిలో బందీ అయిన ఏ భార్య అయినా చివరికి తలవెనుక సుత్తిదెబ్బలు కొట్టి మట్టుపెట్టవలసిందే అని కూడా తీర్మానించుకుంది.

పార అందుకుంది మాచెల్. గోతిలోకి మన్నును తొయ్యడం మొదలుపెట్టింది. అలవాటులేని కారణంగా ఆమెకు నడుము నొప్పి మొదలైంది. ఏది అయితేనేం మన్నుతో గోతిని పూడ్చవలసిందే. మానవమాత్రుడి కంటపడకూడదు. మానవులను హత్య చేయరాదన్నది ఆ ప్రాంతపు చట్టంగా ఉన్నదనే సంగతి ఆమెకు తెలిసిందే. హెన్రీ వంటి అయోగ్యులను సైతం చంపడానికి లేదు.

అందువల్ల మాచెల్ త్వరగా పని ముగించుకోవలసివుంది. ఆమె ఇటువంటి నేరగాథలు పత్రికల్లో చదివి ఉన్నది. అచ్చంగా హెన్రీ హత్య మాదిరి హత్యను కూడా చదివింది. ఫొటోలతో బాటు వివరణాత్మకంగా కూడా ఆ పత్రిక ప్రచురించింది. అయితే ఆ కథలో భార్యను భర్త ఈ పద్ధతిలో మట్టుపెట్టడం జరిగింది. అంతే తేడా! ఏమైతేనేం- చాలా సులువుగా ముగిసింది వ్యవహారం.

గొయ్యి నింపడం అనుకున్నంత సులువైన పని కాదు. మన్ను ఆ గొయ్యి నిండిపోయాక ఇంకా మిగిలేవుంది. గోతిలోంచి వచ్చిన మట్టి తిరిగి గోతిలోకి సరిపడా సర్దుకోవాలి కదా. ఆమెకు అంతులేని కోపం వచ్చింది. హెన్రీ కూడా గోతిలో స్థలం ఆక్రమించుకోవడం వలన ఇలా జరిగిందా? హెన్రీ ఏకంగా అంతస్థలం ఆక్రమించాడా? అందువల్లేనా మన్ను కుప్ప ఇంతగా మిగిలిపోయింది? అతడు ఇంకా పిచ్చి చేష్టలు విడిచిపెట్టడం లేదా? ఎంతటి పనికిమాలినవాడు!

ఆమె పళ్లు పటపటకొరికింది.

కుప్ప మాదిరిగా ఉన్న మన్నును తోట అంతటా పరిచింది మాచెల్. నేల మీద ఎక్కడా మొక్కా మోడు లేకపోవడంతో మన్ను అంతటా సమాంతరంగా పరచుకుంది. కాని ఆ గోతిని చూస్తోంటే, ఆ తోటను పరిశీలిస్తోంటే అక్కడ ఎవరినో పాతిపెట్టినట్టు తెలిసే అవకాశం ఉన్నదేమోనని ఆమెకు అనిపిస్తోంది. పోలీసులు పసిగడతారేమో? ఇక్కడ ఎవరినో పాతిపెట్టినట్టు అనుమానపడతారేమో! నేల అంతా సాదాసీదాగానే ఉంది. వదులు వదులుగా ఉన్న మన్నుతోనే కప్పబడి ఉంది. అంతేతప్ప దాన్ని ఎవరూ తోటగా పేర్కొనరు.

ఆమె మెట్లెక్కి పైకి పరిగెత్తింది. కుండీల్లోని మొక్కలతో తిరిగి వచ్చింది.

నేలమీద గుంటలు తవ్వింది. పూలమొక్కలు వాటిలో నాటింది. కుండీలను ఒక పక్కగా సర్దింది. నేల అంతటా మామూలుగా ఉండేటట్టు జాగ్రత్త పడింది. మొక్కలు తప్ప ఇతరత్రా అంశాలు ఆ నేల మీద ప్రత్యేకంగా కనిపించరాదు.

అటుతర్వాత ఆమె మెట్ల మీదికీ కిందికీ పలుమార్లు తిరిగింది. హెన్రీకి ఇష్టమైన పూలమొక్కలు ఒకటికి రెండుసార్లు ఎంచి చేత్తో పట్టుకుంది. వాటిని జాగ్రత్తగా తోటలోకి మార్చి అవి ఎప్పటినుండో తోటలో ఉంటున్నట్టు కనిపించేలా చేసింది.

రెండు గంటలు గడిచాయి. ఇంట్లో పెరుగుతున్న తోటను చూస్తోంది మాచెల్. ఆమెకు నవ్వు తెర ముంచుకొ

అ
క్ష
రం

ఆర్థిక సమానత్వం అంటే..
అందరి దగ్గరా ఉన్న సంపదను సమానంగా పంచడం కాదు
ప్రతివ్యక్తి దగ్గరా అవసరాలకు తగినంత సంపద ఉండడం!

– మహాత్మాగాంధీ



స్తోంది. తోట ఇప్పుడున్నట్టు ఇంతకు ముందు ఎన్నడూ లేదు. వాస్తవానికి తోటలో మొక్కలు ఎన్నడూ పెరగలేదు కూడా. ఇప్పుడు తోటలో బాగా ఎదిగిన మొక్కలు పది పన్నెండు వరకూ ఉన్నాయి. మట్టి నేలకు అవి నిండుతనం తెచ్చాయి. పుడమితల్లి నుండి పూలమొక్కలు విచ్చుకుని ఆ స్థలం ఇప్పుడు తోటలాగా కనిపిస్తోంది.

ఇంట్లోకి పోయి ఆమె స్నానం చేసింది. తరువాత సినిమా పత్రిక చదవడం కొనసాగించింది. హెన్రీకి ఏమయిందని ఎవరైనా ఆరా తీసి కనుక్కుంటారా? రెండు వారాలు గడిచిపోయాక హెన్రీ ఇంకా కనిపించకపోతే అతడు ఈ ప్రాంతంలో ఉండటం లేదేమో అనుకుంటారు. ఏమైందో అతడికి అని కూడా భావించవచ్చు. అతడు ఎవరికీ ముఖ్యుడు కాడు. అతడికి కుటుంబం లేదని కూడా పట్నంలో తెలిసిన సంగతే! అతడి అదృశ్యం కొంతమందికి విడ్డూరంగా తోచవచ్చు. కొంతమంది ఆకతాయిలకు మాత్రం ఎప్పుడూ ఏదో ఒక సంచలనం అవసరమవుతుంటుంది. ఇతరులకు శ్రమ కలిగించాలని చూస్తుంటారు. హెన్రీ వంటి పనికిమాలిన వాళ్లు కూడా వాళ్లకు అవసరమవుతుంటారు.

ఆమె తల విదిలించింది. రెండో వసతి గృహంలో కూడా హెన్రీ పనికి కుదిరివుంటే ఇంత పని చేయాల్సిన అవసరం తనకి ఉండేది కాదు. అయితే వారంలో ఆరు రోజులూ రాత్రిళ్లు గడపడంలో అతడు తనకు ఎంత నరకం సృష్టించాడో కదా! ఇంకా నయం! తాను కాబట్టి ఇంత కాలం పాటు నిగ్రహం పాటించింది.

హెన్రీ ఎక్కడున్నాడు! వాడి గురించి తెలుసుకోవాలని కొంతమందికి బుద్ధి పుట్టవచ్చునేమో! మాచెల్ టైప్‌రైటర్‌ని సమీపించింది. కాగితం బిగించి కేవలం చూపుడు వేలితో మాత్రమే టైప్ చేయడం మొదలు పెట్టింది.

ప్రియమైన మాచెల్,

నీకు ఎన్నడూ తగినవాడిని కానన్న సంగతి నాకు తెలుసు. నీ ప్రేమ చాలా గొప్పది. నాకు ఆ సంగతి తెలుసు. అందువలన నేను ఈ సమస్త వ్యవహారాల నుండీ కూడా ఒక పిరికివాడి మాదిరిగా తప్పుకుంటున్నాను. మరో స్త్రీతో కలిసి పారిపోతున్నాను. అలాంటి ఆడదే నాకు సరిపోతుంది. ఆమె ఏమంత అందగత్తె కూడా కాదు. ఆకర్షణీయంగానూ ఉండదు. ఆమె ఎలాంటి సినీతారనూ పోలివుండదు. నీ ముందు నాకసలు విలువ లేకపోవడంతో నీ బతుకు నువ్వు బతుకుతానని భావిస్తూ వెళ్లిపోతున్నాను. నీ జీవితం నీ ఇష్టం వచ్చినట్టు బతికే స్వేచ్ఛ నీకు వుంది. పిరికివాడిగా పారిపోతున్నందుకు ఎంతో చింతిస్తున్నాను. మరో ఆడదానితో పారిపోతున్న కారణంగా కూడా సిగ్గుపడుతున్నాను.

-నిన్ను ఎప్పుడూ ప్రేమిస్తూ.. నీ హెన్రీ.

ఉత్తరం చివర ఆమె అచ్చంగా హెన్రీ మాదిరిగా సంతకం చేసింది. మూడు సంవత్సరాలుగా అతడి సంతకం ఆమె

## కొత్తగాలి...

**మద్యానికేం తెలుసు**
**పద్యం ఇచ్చే మత్తు!**
**అనుభవం కంటే**
**ఆస్వాదనే గమ్మత్తు!**

– ధరణికోట శివరాం ప్రసాద్,
బోరబండ, హైదరాబాద్

చేస్తూనే ఉంది. అతడి సంతకాన్ని కచ్చితంగా అతడి మాదిరిగానే చేస్తుంది మాచెల్. చెక్కుల మీద సంతకాలు చేయడం హెన్రీ ఎప్పుడూ మరచిపోతుండేవాడు. వాటిని సొమ్ము చేయడానికి ఆమె అతడి సంతకం అభ్యసించింది.

ఆ ఉత్తరాన్ని మాచెల్ మరోసారి చదివింది. ఒక పనికిమాలినవాడు రాసిన ఉత్తరం అలాగే ఉంటుంది కదా?

మర్నాటి ఉదయం ఆమె పది గంటలకు నిద్రలేచింది. వంటింట్లోకి అడుగుపెట్టింది. ఎలక్ట్రిక్ కాఫీపాట్ మీద తన కోసం కాఫీ తయారుచేసింది. ఆమెకు ఇదంతా కొత్తగా ఉంది. ఉదయం కాగానే హెన్రీయే కాఫీ పెట్టేవాడు. ఆమెకు వేడివేడి కాఫీ అందించేవాడు. ఆ కాఫీ పొగలు కక్కేది కూడాను. అతడు కాఫీ తయారు చేయకపోవడం తనకి లోటుగానే ఉంది మరి. ఎంత మంచివాడో ఆ విషయంలో!

టెలిఫోన్ దగ్గరకు వెళ్లిందామె. ఇరవై ఎనిమిది సంవత్సరాలుగా హెన్రీ ఉద్యోగం చేసిన యజమానికి ఫోన్ చేసింది. ఈ ఇల్లూ, తోట కూడా ఆయనవే. అవతల యజమాని రిసీవర్ ఎత్తగానే ఆమె రోదించడం ప్రారంభించింది. ఒక ఆడదానితో తన భర్త లేచిపోయిన విషయాన్ని ఏడుస్తూనే ఆయనకి వినిపించింది.

"హెన్రీ నన్ను ఏకాకిని చేసి ఒకామెతో వెళ్లిపోయాడు. వీధుల్లో తిరిగేదానితో లేచిపోయాడు. ఒక వ్యభిచారిణితో కలిసి లేచిపోయాడు!" అంది మాచెల్.

"ఏమిటీ! ఒక ఆడదానితో లేచిపోయాడా? " అడిగాడు యజమాని.

"అవునండి!" ఆమె ముక్కుచీదింది. కన్నీళ్ల పర్యంతమవుతూ ఆయనకి ఉత్తరం చదివి వినిపించాలని నిశ్చయించుకుంది. అలాగే చదివి వినిపించింది కూడా.

అవతలివైపు నిశ్శబ్దం తాండవించింది. యజమాని మౌనంగా ఉండిపోయాడు. మాచెల్ మాటలను అతడు నమ్మాలో లేదో తేల్చుకోలేకపోయాడు. కావచ్చు ఎలాంటి ఆడదానికైనా ఇలాంటి సమస్య ఎదురైతే ఇబ్బందే. హెన్రీలాంటి పొట్టివాడూ, అయోగ్యుడితో ఏ ఆడది లేచిపోవడానికి సాహసిస్తుంది! ఆమె ఎలాంటి ఆడదై ఉండాలి? తన స్థితిగతులతో ఇమడలేక ఒక యువతి అతడితో కలిసి లేచిపోయిందా? హెన్రీ మీద సానుభూతితో లేచిపోయిందా?

నిశ్శబ్దం పెరిగేకొద్దీ మాచెల్‌లో గాభరా పెరిగింది. ఆ యజమానికి ఏం పోయేకాలం దాపరించింది? స్పందించడేం?

"అయ్యా! తమరు అక్కడే ఉన్నారా? " అంది మాచెల్.

"అవును. ఇక్కడే ఉన్నాను. నీపట్ల నా ప్రగాఢ సానుభూతి తెలియజేస్తున్నాను. ఇదంతా దైవలీలగానే స్వీకరించు" అన్నాడు యజమాని.

"తప్పకుండానండి! దైవలీలగాక మరొకటి కాదండి!" ఆమె రిసీవర్‌ని యథాస్థానంలో ఉంచింది.

చవకబారు అద్దంలో తనను తాను ఒకసారి చూసుకుంది. పూర్తి కథ తెలియకుండా చేసి నటించినందుకు తనను తాను అభినందించుకుంది. "ఏమంటావ్? " అని ప్రతిబింబాన్ని ప్రశ్నించింది.

ఆమె తన భుజాలు చరచుకుంది. జర

గవలసిందే జరిగిందన్నట్టు తల పంకించింది. ముసలి యజమాని మెదడులో హెన్రీ ఒక ఆడదానితో లేచిపోయిన ఉదంతాన్ని విజయవంతంగా ప్రవేశ పెట్టినందుకు తనను తాను అభినందించుకుంది. బిగ్గరగా నవ్వుకుంది ఒకసారి.

ఒక కాకమ్మ కథను తాను ఆయనచేత నమ్మింపజేసింది. అది చాలు హెన్రీతో అసలు ఎలాంటి పనికిమాలిన ఆడదైనా పారిపోతుందా?

మాచెల్‌కి తరువాత వారమంతా పట్నంలోని ప్రజల సానుభూతి ప్రవచనాలతో సమయం గడిచిపోయింది. పట్టణంలోని సగానికి సగం మంది ఆమె ఇంటికి తరలివచ్చారు. పొట్టి బుడంకాయగాడు ఆమెకు కీడు చేసినందుకు చలించిపోయారు. వారందరికీ తేనీరు అందిస్తూనే వచ్చింది మాచెల్. వచ్చిన వారిలో ఎక్కువమంది వృద్ధ స్త్రీలు. ఆమె వారికి హెన్రీ రాసినట్టు చెప్పిన ఉత్తరం చూపించింది. వాళ్లు ఆ పొట్టివాడిని ఛీదరించుకున్నారు.

తమ తమ నివాసాలకు ఆమెను ఆహ్వానించారు వాళ్లు. ఆమెకు కొన్నాళ్లు పరిసరాలు మారితే మంచిది అని సూచించారు. ఆమె వంటపని చేయనక్కర లేకపోయింది. ఆమెకి వేడి వేడి ఆహారపదార్థాలు అందుతూ వచ్చాయి.

కాలం గడుస్తోంది. ఆమెపట్ల ప్రజలు శ్రద్ధ వహిస్తూ వచ్చారు. అయితే వారిలో ఎవ్వరూ కూడా ఆమెలో సినీతారకు ప్రతిరూపాన్ని లేదా ప్రత్యామ్నాయం చూడలేదు. అప్పుడప్పుడూ మాచెల్ స్వయంగా ఆ ప్రస్తావన తెచ్చేది. వారిలో కొంతమంది మాత్రం ఆమెలో అక్కడక్కడా సినీతారల పోలికలు గుర్తించారు.

ఆ ప్రాంతంలో మాచెల్ ప్రసిద్ధురాలై కూర్చుంది. అప్పుడప్పుడూ ఆమెకు తాను ఎంత ప్రముఖురాలైపోయిందీ ఆలోచనలు రేగుతూంటాయి. హెన్రీ ఆ నేలలో పాతబడిన తర్వాతనే ఈ వైభవం తటస్థించిందన్న సంగతి కూడా స్ఫురిస్తూంటుంది. అతడు ఖననం కావడం ఏమంత విచారించవలసిన అంశంగా కనిపించడంలేదు. మన్ను కింద అతడు సుఖంగా ఉన్నాడు. మన్ను వెలుపల తనూ సుఖంగా ఉంది.

అతడికి తోట అంటే ఇష్టం కాబట్టి తోటలోనే అణిగిపోయాడు. మెత్తటి మన్నుతో పాటు మన్ను కావడానికి సిద్ధంగా ఉన్నాడు. కాదు కాదు.. అతడి శరీరం సిద్ధంగా వుంది. ఆ శరీరానికి ఎలాంటి వినోదం కానీ, విలాసం కానీ అవసరం లేదు. బతికి ఉన్నప్పుడు కూడా అతడు తాను పనిచేసిన వసతిగృహంలో అలాంటి సదుపాయాలు పొందిన దాఖలాలు లేవు. అలాంటప్పుడు ఓ ఆడదాన్ని వెంట తీసుకుపోవడమా? అసంభవం! దేవుడికే తెలియాలి. ఎన్నోసార్లు హెన్రీని ఇలాంటి అంశం మీద సతాయించింది కూడా.

★ ★ ★

ఒక మధ్యాహ్నం వేళ కిందికి వెళ్ళింది మాచెల్. ఆమె బదిలీ చేసి నాటిన పూల మొక్కలు బాగా పెరుగుతున్నాయి. పైన కుండీల్లో బతికినట్టు కాకుండా సహజమైన పుడమి తల్లిలోకి స్వేచ్ఛగా వేళ్లు చొనిపి బతుకుతున్నాయి.

తాను ఎరువుగా మారి హెన్రీ కూడా వాటికి జీవం అందిస్తున్నాడేమో! ఆ రకంగా చేసి అతడు కూడా కొంత సాంత్వన పొందుతూండవచ్చు. పాపం! బతికి ఉన్నప్పుడు కూడా ఎవరో ఒకరికి మంచి చేసినవాడే. ఎవరికీ తనవలన చెడుకానీ, అపకారం కానీ కలగకుండా జాగ్రత్త పడినవాడే. తనకు తానుగా అయోగ్యుడు. మాచెల్ ఎప్పుడైనా తూలనాడినా, అతడు మాచెల్‌తో మొరటుగా ప్రవర్తించినా అతడే మద్యం సేవించి దాని మగతతో కాలక్షేపం చేసేవాడు తప్ప వేరే రకంగా ఆ వ్యవహారాన్ని మలుపు తిప్పే



వాడు కాదు. మాచెల్‌కి అంతా తన అభిమాన సినీతార మాదిరిగా ప్రవర్తించాలనే భావనే ఉంటుంది. ఇలాంటి పరిస్థితిలో ఆ సినీతార ఎలా ప్రవర్తిస్తుందో అని ఊహించుకునేది మాచెల్. హెన్రీలాంటి పనికిమాలిన భర్తను ఏ సినీతారా క్షమించదు.

వారంలో ఏడురోజులూ అభిమానుల గృహాలు సందర్శించడమే సరిపోయేది. ఇంతకుముందు కంటే ఆమెను మరింత సాదరంగా వాళ్ళు ఆహ్వానిస్తున్నారు. ఆమెకేవి ఇష్టమో అలాంటి వస్తువులూ, తినుబండారాలూ అమర్చి పెడుతున్నారు. ఆమె అభిరుచులను గౌరవిస్తున్నారు. ఆమె నల్లటి దుస్తులు కొనుక్కున్నది. వాటిని కూడా వాళ్లు ఆమోదించారు. ఆమె విషాదం అనుభవిస్తే తాము భరించలేమన్నట్టు చెప్పారు.

హెన్రీ చనిపోయిన పదోరోజున తలుపు చప్పుడయ్యింది. అతివేగంగా పోయి తలుపు తెరిచింది మాచెల్. ఆ సమయంలో ఆమె తనకు ప్రీతి పాత్రమైన దుస్తులు ధరించి, బిస్కెట్స్ తింటూ టీ తయారుచేసుకొంటోంది. ఆ సమయంలో దాపరించిన విషాదం ఒక్కటే.

హెన్రీ ఆమెకు రాసినట్లు, ఆమె ప్రదర్శించిన ఉత్తరం మాత్రం అతిగా పరిశీలించడం వలన దాదాపుగా చిరిగిపోయిన దశకు చేరుకుంది. మరో ఉత్తరం అలాంటిదే తయారు చేయాలని ఆమె భావించింది. అయితే కొత్త ఉత్తరం సందర్శకుల

పరిశీలనలో వాస్తవం చెబుతుందేమోనని భయపడింది. ఈ దశలో ఎవరిలోనూ ఎటువంటి సందేహాలకూ ఆస్కారం కలిగించరాదు. మరింత జాగ్రత్తగా తాను వ్యవహరించవలసి ఉంది. అందువలన ఆ ఉత్తరాన్నే పదిలంగా చూసుకోవాలి. అదే చివరి ఉత్తరం.

తలుపు తెరిచింది మాచెల్. పోలీస్ అధికారి మెర్కిన్ కనిపించాడు. ఒక వీధి అవతలే వుంటాడు అతడు.

"నమస్కారం అమ్మా!" పలకరించాడు.

"అరే..! మీరా మెర్కిన్‌గారూ! ఏమిటి ఇలా వచ్చారు? రండి!" అంది మాచెల్.

"సంతోషం.. మిమ్మల్ని చూశాను!"

వెనకే ఇంట్లోకి ప్రవేశించాడు మెర్కిన్.

"హెన్రీ గురించి మీరు విన్నారనుకుంటాను!" అంది మాచెల్.

"విన్నాను తల్లీ! మేమంతా మీకు అండగా ఉంటాం. కంగారు పడకండి! ఒక గౌరవనీయుడు ఎవ్వడూ కూడా ఒక ఆడదాన్ని లేవదీసుకుపోడు, అతడు వివాహితుడై ఉండి కూడానూ!"

"ధన్యవాదాలు మెర్కిన్ గారూ! మీరు బాగా అర్థం చేసుకున్నారు. టీ తాగండి. పంచదార కలపనా, మీగడ జతపరచనా?"

"వద్దమ్మా! నేను విధి నిర్వహణలో ఉన్నప్పుడు ఏవీ తాగను!"

"విధి నిర్వహణా?"

"అవును తల్లీ! మన పోలీస్‌శాఖలో తప్పిపోయిన వ్యక్తులను వెతికేశాఖ ఒకటి ఉందికదా! ఇలాంటి చిన్న పట్నంలో అది పనికిమాలిన శాఖ. ఈ పట్నంలో తమ వాళ్లు తప్పిపోయారని ఎవరు వస్తారు చెప్పండి? చెప్పలేరు. ఎవరూ రారు. ఈ శాఖకు నేను అధిపతిని. ఇప్పుడు హెన్రీ అనే వ్యక్తి తప్పిపోయాడు. అతడే కదా తప్పిపోయింది!"

"అంతే! అంతే!"

"మా ఉద్దేశ్యం ప్రకారం అయితే హెన్రీ తప్పిపోయిన వ్యక్తే మరి!"

రవంత ఆలోచనలో పడింది మాచెల్

"అతడు తప్పిపోయిన వారి కోవలోకి రాడు. తిరుగుబోతు ఆడదానితో అతడు వెళ్లిపోయాడు. దారి తప్పిన ఆడదానితో..!"

పోలీస్ అధికారి తల వూపాడు.

"నేను మీరేం చెబితే అది చేస్తానండి!"

ఆయన తిరిగి తల వూపి "అవును తల్లీ! ఒకసారి పోలీస్ స్టేషన్‌కి రాగలరా! కొన్ని కాగితాలు నింపవలసి ఉంటుంది. మా ఆఫీస్ వ్యవహారం అలాంటిది. హెన్రీకి అంతా మీరే కాబట్టి మీరే ఆ కాగితాలు నింపవలసి ఉంటుంది. ఎంతో సమయం పట్టదు కూడా. నేనే తిరిగి మీ యింట్లో దింపేస్తాను!" అన్నాడు

"అంతేనా, సంతోషంగా. నా టోపీని తీసుకోనివ్వండి!"

టోపీ ధరించింది మాచెల్. పోలీస్ అధికారితో కలిసి ఇంట్లోంచి బయటికి కాలుపెడుతూ ఇలా అంది "మార్తా మేయర్స్ అని ఒక సినీతార ఉంది కదా! ఆమెను ఎప్పుడైనా సినిమాల్లో చూశారా? "

"ఆమెను ఎప్పుడూ సినిమాల్లో చూస్తుంటాను! ఎందుకని అలా అడిగారు!"

"కారణం లేదండి. ఆమె అద్భుతంగా తోస్తుంది.. అందుకే అడిగాను"

పోలీస్ స్టేషన్‌లో ఆమెను గౌరవప్రదంగా చూశాడు అధికారి. కాగితాలు ఎలా నింపాలో శ్రద్ధగా వివరించాడు. అలాంటి విషయాలు అధికారి వంటి వాళ్ళు చెబితే తప్ప ఎవరికీ తెలియవు. అసలు ఎవ్వరూ వాటిని పట్టించుకోరు. ప్రభుత్వంవారి కాగితాల తీరు తెన్నులే అంత. ఇలాంటి కాగితాలు సృష్టించి ప్రజలమీదికి వదిలిపెట్టి వారుపడే పాట్లుచూసి వినోదించడం తప్ప రాజకీయవేత్తలకు పనులేముంటాయ్!

ఆమెపట్ల పోలీసులందరూ మర్యాదగా ప్రవర్తించారు. అయితే వాళ్ల అదుపులోకి తీసుకున్న తాగుబోతు ఒకడు వికారంగా ప్రవర్తించాడు. అతడ్ని ఎవరోకాని బతికి ఉండగానే భూమిలో పాతిపెట్టారట. ఆ వాగుడుతో అతడు ఒకటే గోల. 'ఛ ఛ! ఇలాంటి సంగతి మాట్లాడుకోవడానికే ఇబ్బందిగా ఉంది' అంది మన కథానాయిక. 'ఎవడి వూపిరితిత్తులు ఎంత బలంగా వుంటే అంత బలంగా వాగనివ్వండి' అని కూడా ఆమె వ్యాఖ్యానించింది.

"ఇలాంటి సన్నాసులను తలవెనుక ఒక్కపెట్టు పెట్టాలి. మొట్టమొదట చేయవలసిన చికిత్స అదే" అని కూడా అమ్మడు సూచించింది.

తాగుబోతుతోపాటు మరో జీవి వుంది అక్కడే. వీధిలో అతి చవకగా లభించే వ్యభిచారిణి ఆమె. ఆమెను చూడగానే మాచెల్ అర్థం చేసుకుంది. ఆ వ్యభిచారిణి బల్లమీద కాళ్లు లంకివేసి కూర్చుంది. వీధుల్లో మాత్రమే ఆమె కాపురం చేస్తోందని కూడా మాచెల్ ఆమె తీరును బట్టి అతి సులువుగా గ్రహించింది. సంతోషంగా గడిపే ఏ పెళ్ళయిన వాడితోనైనా ఆమె తొందరగా పారిపోగల మనిషి అయివుండాలని కూడా మాచెల్ గ్రహించింది. సినిమాల్లో అలాంటి బరితెగించిన ఆడవాళ్లే ఎక్కువగా కనిపిస్తారు.

అయితే ఆమె అభిమాన నటి మార్తా మేయర్స్ అంత చవకబారుగా ఎన్నడూ ప్రవర్తించదు. చివరికి అలాంటి పాత్రగానూ నటించదు. ఒకతారగా వెలుగొందే వాళ్లు అలాంటి చర్యలకు పాల్పడరు.

పోలీస్ అధికారి మెర్కిన్ బల్లవైపు కాగితాలతో పాటు వెళ్ళింది. కాగితంలో అనేక ఖాళీలు నింపింది మాచెల్. ఆమెకు కుర్చీ చూపించాడు మెర్కిన్. ఆమె కూర్చుంది.

టెలిఫోన్ మోగింది. అతడు రిసీవర్ అందుకున్నాడు "అలాగా! నిజంగానా? " అన్నాడు రిసీవర్‌లో.

అటు పక్కనుండి ఎవరో మాట్లాడుతున్నారు. స్పీకర్‌లోంచి మాటలు బయటకి వినిపిస్తున్నాయి. కానీ అవి మాచెల్‌కి

అ
క్ష
రం

నీతి అనే మొక్కను
మతం అనే నీటితో తడిపినప్పుడు
అది వృద్ధి చెందుతుంది
అంటే.. నీతినే ఒక మతంగా అవలంబించవలసి ఉంటుంది

**– మహాత్మాగాంధీ**



అర్థం కావడంలేదు.

"నేను ఎంత మాత్రం నమ్మనని ఘంటా పథంగా చెప్పగలను!" అన్నాడు మెర్కిన్.

శబ్దాలే శబ్దాలు!

"మంచిది. మీకు ఎప్పటికీ తెలియదు లే!" అంటూ రిసీవర్‌ను క్రెడిల్ చేశాడు మెర్కిన్. తరువాత మాచెల్ ని చూసి తల పంకించాడు. అతడి హావభావాలు గంభీరంగా మారాయి. తన బెల్ట్‌కి ఉండే సంకెళ్లు తియ్యడానికి సిద్ధపడిన వాడి మాదిరిగా అతడి ఒకచెయ్యి కదిలింది. ఒక భయంకర నేరస్తుడిని నిర్బంధిస్తాడా? అన్నంత వూపు ప్రదర్శించాడు.

"హెన్రీ దొరికాడు!" అన్నాడతను.

"ఏ.. ఏమిటండీ..!? "

"అవునమ్మా! కొంతమంది అబ్బాయిలు మీ నివాసానికి వెళ్లారు. మనం మాత్రం ఇక్కడున్నాం కదా! పూలమొక్కల అడుగున అతగాడు లభించాడు!"

"లేదండీ..! అది.. అసాధ్యం! అసంభవం! వాళ్ళకు ఎవ్వరూ కనిపించరు. వీధుల్లో తిరిగే ఆడదానితో హెన్రీ జతకట్టి, ఆమెతో కలిసి పారిపోయాడు. ఆ పొట్టివెధవ కట్టుకున్న పెళ్ళాన్నీ, ఆమె బాధ్యతలనూ గాలికి వదిలిపెట్టి లేచిపోయాడు"

"అతడెక్కడికీ పారిపోలేదండి. తన తోటలోనే అతడ్ని పాతిపెట్టారు"

మాచెల్ ఒక్క గెంతు గెంతింది. ఇలాంటి పరిస్థితిలో తన అభిమాన నటి మార్తా మేయర్స్ ఏం చేస్తుంది?

"ఎందుకు? ఎందుకు? తోటలోనే మీరు హెన్రీ కోసం ఎందుకు వెతికారు? అతడికి తన యింట్లోనే ఇలాంటిదేదో జరుగుతుందని ఎలా వూహించారు! ఎందుకు? ఎందుకలా? అతడి గురించి తోటలో ఎలా వెతికారు? ఆ యిల్లు ఎలాంటిదో మీకేం తెలుసు? ఆ యింట్లో అతడిని ప్రేమించే భార్య వుంది తెలుసా? " ఆమె ఏదేదో మాట్లాడుతోంది. అలా మాట్లాడుతూనే స్పృహ తప్పిపోవడానికి సిద్ధంగా ఉందామె.

"వేరే స్త్రీతో అతడు కలిసి లేచిపోవడానికి ఎందుకు సిద్ధపడి వుండకూడదు? " అని కూడా అందామె.

బల్లమీద కూర్చున్న వన్నెలాడి వాళ్ళ దగ్గరకి వచ్చింది. వాళ్ల కంట్లో పడేటంత దగ్గరకొచ్చింది. మాచెల్ పక్కనే నిల్చుంది. విలాసంగా శరీర భంగిమలు ప్రదర్శించింది. మాచెల్‌ను డొక్కలో పొడిచింది.

"నేనే చెప్పాను, అతడు ఎవరితోనూ లేచిపోలేదని. ఎందుకో తెలుసా? అతడితో కలిసి లేచిపోవలసిన ఆడదాన్ని నేనే కాబట్టి" అంటూ ఆమె మాచెల్ చుట్టూ ఒకసారి తిరిగింది.

"..ప్రతి గురువారం రాత్రి అతడు నాతోనే గడుపుతాడు. నేనూ అతడూ కలిసి ఆనందలోకాల్లో విహరిస్తాం. నేను అతడి వెంటలేకుండా అతడు ఎక్కడికీ పారిపోలేడు"

మాచెల్ నిస్త్రాణమై నేలమీద చాపచుట్టలాగా పడుకుండిపోయింది. తన అభిమాన తార మార్తా మేయర్స్ ఇలాంటి స్థితిలో ఇలాగే స్పృహ తప్పిపోతుందేమో! ఏమో..! అలా కాకపోనూవచ్చు!

C



# పదునైన వ్యంగ్యం మెత్తనైన హృదయం!

చలసాని ప్రసాదరావు

**ఆయనొక మౌన సముద్రం!**
**ఆవేశం ఉంది. చైతన్యమూ ఉంది.**
**లోతైన ఆలోచన ఉంది.**
**అవగాహనా ఉంది.**
**స్థితప్రజ్ఞత ఉంది.**
**అవసరమైనప్పుడు రెచ్చిపోగల**
**సత్తానూ ఉంది.**
**పైకి ప్రశాంతంగా కనబడినా లోపల**
**బడబానలం రగులుతూ ఉంటుంది.**

ఇవన్నీ కలిస్తే - చలసాని ప్రసాదరావు. ఎవరితోనయినా నిష్కర్షగా, నిర్మొహమాటంగా మాట్లాడగలిగిన తెగువ, ధైర్యం నిండుగా ఉన్న మనిషి

కాబట్టే.. తనతో ఎంతో పరిచయం ఉన్న కమ్యూనిస్టు నాయకులను విమర్శిస్తూ 'ఇలా మిగిలేం..' లాంటి పుస్తకాన్ని రాయగలిగారు. ప్రశ్నించే గుణం ఆయనకు చిన్నప్పుడే మార్క్సిజం నేర్పింది. దాన్ని చివరంటా అలాగే కొనసాగించారు.

ఆయనకు రచనలు వేరు, వ్యక్తిత్వం వేరు, జీవన విధానం వేరు కాదు అంతా ఒక్కటే! నమ్మింది రాశారు. రాసింది ఆచరించారు. ఆచరించింది నలుగురికీ చెప్పారు. అందుకే అంత నిర్మొహమాటంగా ఉండగలిగారు. నిక్కచ్చిగా ఉంటూ అందరికీ కావాల్సిన వాడు అనిపించుకోవడం అంత తేలిక కాదు. అది ఆయనకే చెల్లింది.

ఇరవై ఏళ్లకు పైగా 'ఈనాడు'లో 'కబుర్లు' కాలమ్ నిర్వహించారు. బహుశా తెలుగు పత్రికా రంగంలో ఇదొక రికార్డు. అయితే ఆయన రికార్డు కోసం రాయలేదు. ఎప్పటికప్పుడు సమకాలీన సమస్యలపై సంధించిన వ్యంగ్యాస్త్రాలు ఆ 'కబుర్లు'. పాఠకులు వాటిని అలాగే ఆదరించారు.

కొన్ని సందర్భాల్లో కొందరు ఆయన రాసిన వాటి పట్ల ఆక్రోశం వెళ్లగక్కుతూ బెదిరింపు లేఖలు రాసేవారు. అవి కొన్ని మరీ తీవ్రంగా ఉండేవి. వాటిని మాబోటి వాళ్లకు చూపించి జోకులు వేశారు తప్ప సీరియస్‌గా తీసుకోలేదు, బాధపడలేదు, భయపడలేదు.

తెలుగునాట చిత్ర, శిల్ప కళపై మక్కువని, అవగాహనని అందించిన విమర్శకులలో ప్రథముడు చలసాని ప్రసాదరావు.

1961లో 'కళ' సంచికను తేవడం సాహసమే. చిత్ర, శిల్ప కళల గురించి తెలుసుకోవాల్సిన అనేక అంశాలను మొదటిసారిగా చర్చకు పెట్టారు. మధ్యలో కొంత విరామంతోనైనా 'కళ' అయిదు సంచికలు పది సంవత్సరాల్లో వెలువడ్డాయి.

'కళ' అయిదు సంచికలను కలిపి ఒక్కటిగా తేవాలనే సంకల్పంతో సంవత్సరం పాటు శ్రమించి, బొమ్మలు సేకరించి, పుస్తకాన్ని డిజైను చేసి, ప్రెస్ కాపీని సిద్ధం చేసి తెలుగు విశ్వవిద్యాలయానికి ప్రచురణ కోసం అప్పగించారు. అనంతర కాలంలో అనారోగ్యం పాలై అలానే వెళ్లిపోయారు. అరవైల నాటి సంగతేమో గానీ 2004లో ఆ సమగ్ర సంపుటి వెలువడినాక కానీ దాని విశిష్టత ఈనాటి తరానికి తెలియరాలేదు. చిత్ర, శిల్ప కళా రంగాల్లో సమగ్రతను సంతరించుకున్న అపురూప గ్రంథమిది. కాకతీయుల శిల్పకళా సంపద విశేషాలను తెలుగు వారికి వివరంగా తెలియజెప్పింది బహుశా ఆయనే కావచ్చు. ఆయనతో కలిసి రామప్ప దేవాలయ సందర్శనం గొప్ప అనుభవం.

చిత్తప్రసాద్ బొమ్మల సేకరణ కోసం చలసాని ప్రసాదరావుతో కలిసి నేను, చిత్రకారుడు మోహన్, కళా విమర్శకుడు వెనిగళ్ల వెంకటరత్నం ప్రొఫెసర్ వెంకటేశ్వర్లు గారిని కలవడానికి వరంగల్ వెళ్లి, అట్నుంచి అటే రామప్పకు వెళ్లాం. అంత స్పష్టంగా మాట్లాడలేని ఆయనకు కాకతీయ శిల్పకళ పట్ల ఉన్న మమకారపు విశ్వరూపాన్ని ఆనాడు అందరం చూడగలిగాం. బెంగాల్ చిత్రకారుడు చిత్తప్రసాద్‌ను బెంగాలీలు మర్చిపోయినా, తెలుగువారు మర్చిపోకుండా చేసింది చలసాని ప్రసాదరావే! ఎనభైలలో ఆంధ్రప్రదేశ్ అన్ని ముఖ్య పట్టణాల్లో చిత్తప్రసాద్ బొమ్మల ఎగ్జిబిషన్ నిర్వహించడంలో నేను, మోహన్, జనసాహితి సంస్థలతో పాటూ చలసానిదీ ముఖ్య భూమిక.

రచనలలో ఆయన వ్యంగ్య శైలి ప్రత్యేకమైనది. కథలు రాసినా, 'కబుర్లు' రాసినా, వ్యాసాలు రాసినా, ఆఖరికి రాజకీయాలతో నిండిన 'ఇలా మిగిలేం..' లాంటి గ్రంథం రాసినా శైలి మాత్రం వ్యంగ్యమే. ఎంచుకున్న వస్తువు పట్ల సాధికారత, నమ్మిన సిద్ధాంతాల ఆచరణ పట్ల అచంచల ఆత్మవిశ్వాసం ఉంటే తప్ప ఆ రచనలు రావు. ఆత్మవిశ్వాసంతో పాటూ అదిచ్చిన కించిత్తు పెంకితనం ఆయన సొత్తే! స్వాతి మాసపత్రిక 'నాకు నచ్చిన కథ' శీర్షికన కథలు ఎంపిక చేసి చిన్న వివరణ రాయమంటే చలసాని తన 'శత్రువు' కథనే ఎం పిక చేసి ఆ సంపాదకుల్ని ఆశ్చర్యపరిచారు.



చెదరని చిరునవ్వు

దాదాపు అన్ని సందర్భాల్లోనూ సామాజిక ఉద్యమాలతో తన గొంతును కలిపారు. ప్రత్యక్షంగానో, పరోక్షంగానో తన ఉనికిని చాటుకున్నారు. బూటకపు ఎన్‌కౌంటర్‌కు వ్యతిరేకంగా రచయితల యాత్రలో పాల్గొన్నారు. మతోన్మాదానికి వ్యతిరేకంగా ఉత్తర తెలంగాణా ప్రాంతాల్లో అనేక పట్టణాల్లో రచయితలతో కలిసి తిరిగారు.

రామోజీరావుగారి మానస పుత్రికలైన విపుల, చతుర పత్రికలను రెండు దశాబ్దా

లకు పైగా ఎంతో సమర్థంగా నిర్వహించారు చలసాని ప్రసాదరావు. అసలు ఆ పత్రికల స్వరూప, స్వభావాలే అద్భుతమైన ప్రయోగం. ఇన్ని సంవత్సరాలుగా ఇతర భాషల్లోని వేల కథలు తెలుగువారికి పరిచయం కావటం వాటి వల్లే సాధ్యమైంది. ఒకసారి వారి ఆఫీసుకు వెళ్లాను. (ఒకసారేం.. దాదాపు ప్రతి శనివారం మా అడ్రసు 'ఈనాడు' చలసాని ప్రసాదరావు గారి డెస్కే) ఓ బైండు పీసు ఇచ్చారు, చూడమని. చూస్తే ఆశ్చర్యం, ఉద్వేగం ముప్పిరిగొన్నాయి. ప్రపంచ, భారతీయ భాషా రచయితల అనుమతి పత్రాలన్నీ

## మీరు మూగా..!

ఒకసారి ద్వారకా హోటల్‌లో కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నాం. చలసానితో కబుర్లంటే మనం రాస్తూ ఉంటాం, ఆయన మాట్లాడుతూ ఉంటారు. అంతా అయిపోయాక హోటల్లోంచి వెళ్లిపోయేటప్పుడు సర్వర్ నాదగ్గరకి వచ్చి 'మీరు మూగా? మాటలు రావా సార్?' అని అడిగాడు.

నీట్‌గా బైండు చేసిన పుస్తకం అది. ఇంటర్నెట్, మొబైల్ ఫోను లాంటి సౌకర్యాలు లేని రోజుల్లో అంతమంది రచయితల అనుమతులు సంపాదించడం అంత తేలిక కాదు. అలా ప్రముఖుల ఉత్తరాలు, సంతకాలు చూస్తుంటే గొప్ప ఆనందం కలిగింది. అదీ వారి నిర్వహణా సామర్థ్యం. అలాంటి బైండులు చాలా ఉండేవి ఆఫీసులో.

'కథ' సిరీస్‌ని తొంభైల్లో ప్రారంభించినపుడు రచయితల అనుమతులు తప్పనిసరిగా తీసుకోమని సలహా ఇచ్చారు. అలా తీసుకోవడం వారిని, వారి రచనలను గౌరవించడంలో భాగమనేది ఆయన ఉద్దేశ్యం.

తొలి చతుర నవలల పోటీలతో నాకు ప్రత్యక్ష అనుభవం లేదు. కానీ రెండోసారి విపుల-చతుర పత్రికల తరఫున కథ, నవలా పోటీలు పెట్టినప్పుడు చలసాని ప్రసాదరావు సహకారంతో కొన్ని వందల కథలు చదివిన అనుభవం నాది. ఎక్కడా లోపాలకు తావు లేకుండా పకడ్బందీగా నిర్వహించిన పోటీ అది. నాతోపాటూ కాళీపట్నం, అబ్బూరి ఛాయాదేవి, అక్కినేని కుటుంబరావు, కేతు విశ్వనాథరెడ్డి వంటి ప్రముఖ రచయితలు ఆనాటి పోటీలకు న్యాయనిర్ణేతలు. మాలో ఎవరికీ చివరిక్షణం వరకూ రచయితల పేర్లు తెలియకుండా గోప్యతను గొప్పగా పాటించారు. ఈ పోటీల నిర్వహణతో న్యాయనిర్ణేతగా నాకు గొప్ప అనుభవం వచ్చింది.

రెండుసార్లు గుండెకు ఆపరేషన్ జరిగినా చెక్కు చెదరని గుండె నిబ్బరం చలసానిది. రెండవసారి ఆపరేషన్‌కు మద్రాసు రైలు ఎక్కించి వీడ్కోలు పలికి, నాంపల్లి స్టేషన్ నుంచి బయటకొస్తుంటే ప్రముఖ కథా రచయిత వి. రాజారామమోహనరావు కలిసి, 'ఇప్పుడే చలసాని ప్రసాదరావు కలిశారు, మద్రాసు వెళుతున్నారు, ఏదో సినిమా ఛాన్సు తగిలిందట' అన్నారు. నాకు మతి పోయింది. ఆయన వెళ్లింది గుండె ఆపరేషన్ కోసం. ఆ సమయంలోనూ చలసాని హాస్య చతురతకి, గుండె నిబ్బరానికి నాలో నేనే జోహార్లు చెప్పుకున్నాను.

1980లలో పరిచయం అయిన నాటి నుండి ఆయన చివరిక్షణాల వరకూ అతిసన్నిహితంగా మెలగడం వల్ల, ఆయన నుండి ఎంతో నేర్చుకోవాలనుకుని, కొంతైనా నేర్చుకోగలిగాను. ఆమాటకొస్తే ఆయనతో పరిచయం ఉన్న ప్రతివారికీ ఆయనను ఆదర్శంగా తీసుకోవాలనే అనిపిస్తుంది.

అదే ఆయన ప్రత్యేకత. అందుకే తెలుగు సాహితీ ప్రపంచంలో, పత్రికా రంగంలో ఆయన స్థానం ప్రత్యేకం, పదిలం.

*(ఈనెల 27న జయంతి)*

– వాసిరెడ్డి నవీన్

విశ్వభారతీయం

## ఆత్మ చరిత్రాత్మక నవల

# హోమ్ టు ఇండియా

భారతదేశంలో పుట్టి, ప్రపంచమంతా చుట్టి ఇంగ్లండ్‌లో స్థిరపడిన వ్యక్తి శాంతా రామారావు. సుమారు వందేళ్ళ క్రితం అంటే 1923లో మద్రాసులో జన్మించిన శాంత కలం నుంచి జాలువారిన నవల 'హోమ్ టు ఇండియా'.

చదువు, అధ్యయనాల్లో స్త్రీలెంతో వెనకబడిన ఆ కాలంలో శాంత విదేశాల్లో చదివారు. గాంధీజీ, చాచాజీ, రవీంద్రనాథ్ ఠాగూర్, సరోజినీ నాయుడు వంటి నాటి మహనీయులెందర్నో దగ్గరగా చూశారు. సన్నిహితంగా మెలిగారు. ఆ అనుభవాలు, జ్ఞాపకాలన్నీ ఈ రచనలో ప్రతిబింబిస్తాయి. తనకు తెలిసిన అంశాలను సమర్థంగా అక్షరబద్ధం చేయగలిగారు రచయిత్రి. ఇది ఒక రకంగా ఆత్మకథ, యాత్రా రచన. ఇంకోరకంగా చెప్పాలంటే చరిత్రాత్మకమైన నవల అనొచ్చు. కథనం ఆసాంతం ఉత్తమ పురుషలో సాగుతుంది.

'హోమ్ టు ఇండియా' ఓ విశిష్ట నవల. ఇంగ్లండులో చదువుకున్న రచయిత్రి, తన తల్లిగారు, సోదరి ప్రమీలతో కలిసి బొంబాయిలోని తాతయ్యగారింటికి వచ్చి, తిరిగి అమెరికా బయల్దేరడంతో ముగుస్తుందీ నవల. దేశంలో వున్నన్నాళ్ళూ ఈ బృందం వివిధ ప్రాంతాలు దర్శిస్తుంది. ఈ ఇతివృత్తాన్ని ఆధారంగా చేసుకుని ఆయా ప్రదేశాల్నీ, పరిస్థితుల్నీ, వ్యక్తుల్నీ ఆచారవ్యవహారాల్నీ చిత్రీకరించారు శాంతా రామారావు. విదేశాల్లో పెరిగినందున సహజంగానే ప్రతిదాన్నీ ఆమె ఇంగ్లీష్ కళ్ళతో చూసినవైనం మనకర్థమౌతుంది.




స్వాతంత్ర్య సమరంనాటి రాజకీయాలూ, కాంగ్రెస్ పార్టీ, ఖాదీ ఉద్యమం, మహిళా చైతన్యం మొదలైన అంశాలెన్నో ఈ నవలలో చర్చించారు. వివిధ పార్టీ నాయకులు పాల్గొనే సభలూ సమావేశాలకు హాజరై వారితో సన్నిహితంగా మెలిగే సన్నివేశాలుంటాయి. పేదరికం, దళితుల సమస్యలు, వ్యవసాయక సమాజంలోని లోతుపాతులు ఆ చర్చల్లో భాగంగా వుంటాయి. సంపన్న సనాతన బ్రాహ్మణ కుటుంబాల్లోని ఆచారాలు, ఆహారపు అలవాట్లని చక్కగా వర్ణించారు. ఉదాహరణకి ఒక ఇంగ్లీష్ మిత్రుడ్ని టీ తాగేందుకు ఇంటికి ఆహ్వానించిన అతి చిన్న విషయాన్ని క్కూడా ఇంట్లో రాద్ధాంతమౌతుంది. ఆనాటి పరిస్థితులవి.

అప్పటి రాజకీయాల్నీ, సాంఘిక పరిస్థితుల్నీ తనింకా లోతుగా అధ్యయనం చేయవలసి వున్నదని రచయిత్రి గ్రహిస్తారు. బొంబాయి నుండి తల్లీ కూతుళ్ళు ఢిల్లీ వెళ్తారు. అక్కడ శివన్, కుట్టీ అనే బంధువుల ఇంట్లో గడుపుతారు. శివన్ పత్రికా ప్రతినిధి, కుట్టి సంఘసేవకురాలు. ఓఖ్లా అనే మారుమూల గ్రామాన్ని, అక్కడి పాఠశాలని సందర్శిస్తారు. ఇంగ్లీష్ పరిపాలనలో పల్లె బడుల దుస్థితి వారిని కదిలిస్తుంది.

ఢిల్లీలోని దుర్భరమైన పేవ్‌మెంట్ జీవితాల్ని తిలకిస్తారు. కళాశాల విద్యార్థులతో గడుపుతారు.

రచయిత్రి ఇర్విన్ కళాశాలలో కొద్దికాలం ఇంగ్లిష్ పాఠాలు బోధిస్తారు. కళాశాల మేగజైన్ సంపాదకత్వంలో సహకరిస్తారు. పర్దా పార్టీల సంస్కృతిని చవిచూస్తారు. రాడికల్ విద్యార్థుల్ని బ్రిటిష్ ప్రభుత్వం వెంబడించిన వైనాన్ని తెలుసుకుంటారు. ఢిల్లీ నుండి కాశ్మీర్ వెళ్ళి శరదృతువంతా అక్కడ గడుపుతారు. దాల్ లేక్, నిషాత్ బాగ్, షాలీమార్ గార్డెన్లను సందర్శించి వాటి చారిత్రక ప్రాధాన్యత గురించి తెలుసుకుంటారు. అక్కడి మురికివాడల జీవితాల్ని దగ్గరగా చూసి చలించిపోతారు. శ్రీనగర్ నుండి వెళ్ళి జీలంనది మీద ఒక పడవ ఇంటిలో గడుపుతారు. టిబెట్‌లోని సోనే మార్గ్ చూస్తారు. శ్రీనగర్‌లో నెహ్రూగారిని కలుసుకుంటారు.

కాశ్మీర్‌నుండి ఢిల్లీమీదుగా తిరిగి బొంబాయి ప్రయాణమౌతారు. దేశానికి ఏం చేయగలమనే అంశంమీద అక్కాచెల్లెళ్ళ మధ్య చర్చలు జరుగుతాయి. రచయిత్రి పత్రికా రచన వైపు మొగ్గు చూపుతారు. ఆగ్రా వెళ్ళి వెన్నెల్లో తాజ్‌మహల్ చూస్తారు. ఫతేపూర్ సిక్రీ దర్శిస్తారు. ఇంగ్లండు నుండి బోంబే వచ్చిన వాళ్ళకి, భారత్‌లోని స్తబ్ధమైన జీవితాలు, వివాహ వ్యవస్థ గురించీ ఆసక్తికరమైన అంశాలెన్నో తెలుస్తాయి. ఓ సినిమాలో పల్లె జీవితాలెంత దుర్భరంగా వున్నాయో చూసి బాధపడతారు.

శివన్, కుట్టీ బొంబాయి వస్తారు. శివన్ వార్ధాలో గాంధీగార్ని కలవడానికి బయల్దేరుతున్నాడని తెలిసి ఆయనతోపాటు వెళ్ళాలనుకుంటుంది రచయిత్రి. అయితే, సనాతన బ్రాహ్మణ కన్యలకు రాజకీయాలు సరికావని ఆమె నానమ్మ వారిస్తుంది. ఆ భావాలపట్ల నిరసన వున్నా ఆవిణ్ణి వ్యతిరేకించే పరిస్థితి వుండదు. అక్కాచెల్లెళ్ళ నిర్ణయాలు నానమ్మగారికి రుచించవు.

బొంబాయిలోనే సొంతింటికి మారిపోతారు. ప్రమీల ఒక స్థానిక పత్రికలో సహాయ సంపాదకురాలిగా చేరుతుంది. ఇది తల్లిగారికి పెద్దగా నచ్చదు. ఇంటికి కావలసిన ఫర్నీచర్, ఖాదీ దుస్తులూ కొనుక్కుంటారు. ఒక పార్టీలో పీటర్ పెండిల్ అనే బ్రిటిష్ విలేకరిని కలుస్తారు. దేశం గురించి అనేక అంశాలు చర్చకు వస్తాయి. బూలాబాయి దేశాయి ఇంట్లో బస చేసిన సరోజినీనాయుడును కలుస్తారు. అప్పటికే ఆమె జాతీయ కాంగ్రెస్ అధ్యక్షురాలిగా పనిచేశారు. ఒక సమావేశంలో పాల్గొనేందుకు వచ్చిన నెహ్రూజీ వీరింట్లో డిన్నర్ చేస్తారు. అక్కడ వంట చేసిన వ్యక్తి కూడా నెహ్రూ, రాజగోపాలాచారి వంటి ప్రముఖుల ప్రసంగాల్ని ఆసక్తిగా విన్న తీరు రచయిత్రి దృష్టి దాటిపోదు.

1940లో సత్యాగ్రహం చేసేందుకు సభలో వున్నవారంతా అంగీకరిస్తారు. ఫలితంగా అనేక మంది జైలుకెళ్తారు. రచయిత్రి శాంతా రామారావు, కమలాబేరితో కలిసి తల్లీపిల్లల సంరక్షణా కేంద్రాన్ని సందర్శిస్తారు. అక్కడ మిల్లు కార్మికుల పిల్లల్ని సాకడమేగాక వయోజన విద్య నేర్పిస్తుంటారు. కమలాబేరి ద్వారా రచయిత్రి అమెరికా ప్రజాస్వామ్యం గురించి తెలుసుకుంటారు. దేశానికి యువతుల సేవెంత ముఖ్యమో, వాళ్ళు నిర్వహిస్తున్న కార్యక్రమాల ప్రాముఖ్యతేంటో సరోజినీ నాయుడు వివరిస్తారు. ఆమెతో జరిగిన సంభాషణ రచయిత్రిలో కొత్త ఆలోచనలను రేకెత్తిస్తుంది. ఈ దశలోనే వీరి దూరపు బంధువు నారాయణి ప్రవేశిస్తుంది.

ఆమెకు, పీటర్‌కూ మధ్య ప్రేమాయణం నడుస్తుంది. కథ అనేక మలుపులు తిరిగి సంప్రదాయాల్ని అతిక్రమించలేక చివరికి నారాయణి పుట్టింటికి చేరుకున్నట్లు, పీటర్ సైన్యంలో చేరినట్లు కథ ముగుస్తుంది.

బొంబాయిలో స్వాతంత్ర్య సమరం ఊపందుకొంది. బంద్‌లు, హర్తాళ్‌లూ జరుగుతుంటాయి. అనేకమంది నాయకులు జైలుకెళ్తారు. రచయిత్రి విద్యార్థుల్ని ఉద్దేశించి ప్రసంగిస్తారు. ప్రజాజీవితంలో చురుగ్గా పాల్గొంటారు. తల్లిద్వారా శాంతా రామారావుకు బెంగళూరు రచయిత్రి నళిని, డా. సర్వేపల్లి రాధాకృష్ణన్ పరిచయమౌతారు. పిన తల్లి బిషన్ గారు అలహాబాదు నుండి వస్తారు. ఇంగ్లీష్ చదువుల నేపథ్యంలో సనాతన కుటుంబాలు ఎలా ఛిన్నాభిన్నమౌతున్నాయో వివరిస్తారు. రచయిత్రి అలహాబాద్ అమ్మమ్మ గారింట్లో గడిపిన బాల్యాన్ని గుర్తుచేసుకుంటారు. బిషన్‌గారి అబ్బాయి మోహన్ తపాలాశాఖలో పనిచేస్తుంటాడు. బ్రిటిష్‌విద్య లేని భారతీయులకు మంచి ఉద్యోగాలు ఎందుకు దొరకవో వివరిస్తాడతను. అతనో పంజాబీ అమ్మాయిని కుటుంబసభ్యుల అనుమతితో పెళ్ళి చేసుకోబోతున్నట్టు ప్రకటిస్తాడు.

రచయిత్రి తల్లిగారితో కలిసి కలకత్తా, అక్కడి నుండి శాంతినికేతన్ వెళ్ళి రవీంద్రనాథ్ ఠాగూర్‌తో మాట్లాడతారు. ఆయన వేసిన చిత్రాలను

# అలనాటి యాత్రా రచయిత్రి



శాంతా రామారావు చదువంతా ఇంగ్లండులో సాగింది. ఆమె తండ్రి బెనెగెల్ రామారావు బ్రిటిష్ ఇండియాలో సివిల్ సర్వెంట్. స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత రిజర్వు బ్యాంక్ గవర్నరుగా, వివిధ దేశాల రాయబారిగా పని చేసి బొంబాయిలో స్థిరపడ్డారు. తండ్రి జపాన్‌లో రాయబారిగా వుండగా, శాంత 1947లో అక్కడికెళ్ళి టీచర్‌గా పనిచేసింది. అక్కడ బవేర్స్ అనే అమెరికన్‌ను వివాహం చేసుకుంది. కానీ ఆ బంధం విఫలమైంది. 1977లో వాటిల్స్ అనే అమెరికన్‌ని రెండో వివాహం చేసుకుంది. ప్రపంచమంతా తిరిగి, చివరికి న్యూయార్కులో స్థిరపడ్డారా దంపతులు. శాంత పత్రికా విలేకరిగా, యాత్రా రచయిత్రిగా ప్రఖ్యాతి పొందారు. ఆమె నవలలు కూడా ఆత్మ కథల్లాగే సాగుతాయి.

ఇ.ఎమ్. ఫాస్టర్ అంగీకారంతో ఆయన రాసిన 'ప్యాసేజ్ టు ఇండియా' నవలని నాటకీకరణ చేయగా, అది వందకు పైబిలుకు ప్రదర్శనలు పొందింది. చలనచిత్రంగానూ విజయవంతమైంది. 2009లో తుది శ్వాస విడిచేవరకూ తాను చూసిన ప్రపంచాన్ని లోకానికి చూపే ప్రయత్నం చేశారు శాంతా రామారావు.

**ఆమె ఇతర రచనలు:**

*'దీసీజ్ ఇండియా' (1954), 'రిమెంబర్ ది హోమ్' (1956), 'మై రష్యన్ జర్నీ' (1959), 'గిఫ్ట్ ఆఫ్ ప్యాసేజ్' (1961), 'ది కుకింగ్ ఆఫ్ ఇండియా' (1970)*

చూస్తారు. 'గురూజీ' కుమారుడు, కోడలి గురించిన విశేషాలు తెలుస్తాయి. శివార్లలో సంతాలీ గ్రామంలోని పాఠశాల చూసి అక్కడి విద్యావిధానాన్ని గమనిస్తుంది రచయిత్రి. శుద్ధ భారతీయ భోజనం తిని గొప్ప అనుభూతిపొందుతారు.

1941లో ఇంగ్లండు నుండి అలెగ్జాండర్ షా, భారత్‌లో డాక్యుమెంటరీ తీసేందుకొస్తాడు. ప్రమీల, ఆ బృందంతో కలిసి పని చేయడానికి నిశ్చయించుకుంటుంది.

తండ్రి ఆఫ్రికాలో రాయబారి ఉద్యోగం పూర్తయి బొంబాయి తిరిగొస్తారు. రచయిత్రికి ఇండియాలోని నకిలీ ఇంగ్లీష్ విద్య నచ్చదు. అమెరికా వెళ్ళి అక్కడి ప్రజాస్వామ్యాన్ని అధ్యయనం చేయాలని నిర్ణయించుకుంటుంది. అందుకు తండ్రి అంగీకరిస్తాడు. ప్రయాణానికి సంబంధించిన అనుమతులు పొందే మధ్యకాలంలో మరోసారి సరోజినీనాయుడును కలుస్తుంది రచయిత్రి. 'అమెరికాలోనే వుండిపోవద్దనీ, తిరిగి ఇండియా వచ్చి ప్రజాజీవితంలో పాల్గొనమని రచయిత్రికి సలహా ఇస్తారామె. అనుమతులన్నీ వచ్చేస్తాయి. తండ్రి సింగపూర్ వరకూ తోడుగా వస్తానంటాడు. దేశం విడిచేముందు కొలంబియా వెళ్ళి నానమ్మనీ తాతయ్యనీ చూస్తారు. వాళ్ళు మరింత వృద్ధులైనట్లుగా తోస్తుంది. నానమ్మ అమెరికాలోని రౌడీ మూకల గురించి హెచ్చరిస్తుంది. చివరికి విషాద వదనంతో వృద్ధుల్ని విడిచి అమెరికా బయల్దేరుతుంది రచయిత్రి. రచన అనేక వివరాలందిస్తూనే సరళంగా, సాఫీగా సాగుతుంది.

– కల్పనా కిరణ్




తులసీ కృష్ణ

# నత్తగుల్లలు

నిర్వహణ :
వి. రాజారామమోహనరావు

**నలభై ఏళ్ళకిత్రం.. అంటే డెబ్బయ్యో దశకంలో మధ్యతరగతి, దిగువ మధ్యతరగతి జీవితాల మీద తెలుగులో విరివిగా నవలలు వచ్చాయి. వాటన్నింటిలో సాధారణంగా ఆ తరగతి జీవితం మీద సానుభూతి, జాలి ఉండేవి. 'నత్తగుల్లలు' నవల ఆ తరగతికి చెందిందే అయినా, రచయిత తులసీ కృష్ణ మధ్యతరగతి వారి మీద సానుభూతి, జాలి చూపలేదు. 'నత్తగుల్లలు'లో ప్రధానపాత్ర ఆదిశేషయ్య. కానీ ఆయన కథానాయకుడు కాదు. ఆయనకి దాదాపు అరవయ్యేళ్ళ వయసు. ఈ కథలో నాయికానాయకులు లేరు. ఓ కుటుంబ కథ ఇది. ఆ కుటుంబం కొన్ని పరిస్థితుల్లో ఓ పరిమిత ఆర్థిక చట్రంలో ఎలా పరిభ్రమించిందో వివరించిన నవల ఇది. ఆ పరిభ్రమణంలో వాళ్ళ నైజాలు చిన్న తాకిడికే మారిపోయే ఉద్దేశ్యాలు, నిర్ణయాలు.. ముఖ్యంగా చాపకింద నీరులా కుటుంబ బంధాలను తెంచేసే పరిణామాలు.. ఈ నవల ఓ వర్గానికి, ఓ తరహా జీవితానికి ప్రతీక!**

ఆదిశేషయ్య, అనసూయమ్మ భార్యాభర్తలు. వాళ్ళకి ముగ్గురు కొడుకులు, ముగ్గురు కూతుళ్ళు. ఆదిశేషయ్య మధ్యతరగతి ఆఫీసు గుమస్తా. పెద్ద సంసారం, చాలని సంపాదన. ఆయన జీవితంలో ఏ పనీ సవ్యంగా సాగదు.

ఆదిశేషయ్య తండ్రి అచ్చమైన రైతు. వ్యవసాయం చేస్తుండటమే కాదు, ప్రపంచంలో దాని కంటే మరేదీ గొప్పది కాదని ఆయన నమ్మకం. బీడును సాగుచెయ్యటమంటే ఆయనకు ప్రత్యేకమైన ఇష్టం. ఊరికి ఎంతదూరమైనా సరే, అక్కడ గుడిసె వేసుకుని ఉండేవాడు. అందుకు ఆదిశేషయ్య తల్లి పోట్లాడేది కూడా.

తండ్రి తత్త్వమేమిటో చిన్నవయసులో ఆదిశేషయ్యకి అర్థమవలేదు. తర్వాత ఆ మహాకృషీవలుని తీరు, శ్రమ ఆయన విలువని తెలియజేశాయి. నాలుగు ఎకరాల పొలాన్ని తన రెక్కల కష్టంతో నలభై ఎకరాలు చేశాడు తండ్రి. తన లాగే తన కొడుకు భూమిని నమ్ముకుని బతకాలనేది ఆయన ఆకాంక్ష. కానీ ఆదిశేషయ్య తల్లికి అది ఇష్టంలేదు. కొడుకు చదువుకుని, ఉద్యోగస్థుడై దర్జాగా బతకాలని ఆవిడ కోరిక. భర్త మాట కాదని, పట్నంలో ఉంటూ కొడుకును చదివించింది. ఆయన వ్యవసాయం ఆవిడకి పట్టలేదు. ఆవిడ పట్నవాసం, పిల్లాడి చదువు ఆయన పట్టించుకోలేదు. అలా కాలం గడిచింది. ఆదిశేషయ్య తండ్రీ, తల్లి కాలంలో కలిసిపోయారు.

బిఏ చదివిన ఆదిశేషయ్య మధ్యతరగతి ఉద్యోగం చేస్తూ, నలభై ఎకరాల ఆస్తిని నాలుగెకరాలు చేశాడు. మొదట భూమి అనవసరమని, కొంత, తప్పనిసరి అవసరాలకు కొంత.. అలా కాస్త కాస్త భూమిని అమ్మేశాడు. తండ్రికి జీవితాన్ని గురించి భూమి యిచ్చిన నమ్మకం, కొడుక్కి తన చదువు ఇవ్వలేదు. ఎమ్.ఏ. చదివిన ఆదిశేషయ్య పెద్ద కొడుకు హరీంద్రకి ఉద్యోగం లేదు. రెండోవాడికి చదువు అబ్బక జులాయి అయ్యాడు. మూడోవాడు చిన్నవాడే. వాడూ అల్లరి చిల్లరిగానే ఉన్నాడు.

ఆదిశేషయ్య తండ్రి తనలాగే కొడుకును వ్యవసాయదారుణ్ణి చెయ్యగలిగేవాడు. అది ఆయనకి ఇష్టం కూడా. ఆదిశేషయ్యకి తన కొడుకులు తనలా గుమాస్తాల్లా బతకటం అయిష్టం. వాళ్ళు అందలాలు ఎక్కాలి. గొప్పగా బతకాలి. అవన్నీ అందమైన కలలు. మధ్యతరగతి జీవితాల్లో తరాలు మారుతుంటే దారితీసిన పరిణామాల దుష్ఫలితాలకి ఇదో ఉదాహరణ. ఇలాంటి సంఘటనల ద్వారా తులసీకృష్ణ పలుకోణాలలో అనేక

రకాలుగా చిత్రమైన మధ్యతరగతి జీవనచిత్రాన్ని ఎంతో ప్రతిభావంతంగా చూపించారు.

ఆదిశేషయ్యా అనసూయమ్మల కూతుళ్లు భారతి, శోభ, జ్యోతి. మధ్యతరగతి కుటుంబాలలో వయసొచ్చి పెళ్లికాని ఆడపిల్లల్ని గుండెల మీద కుంపటిగా భావిస్తుంటారు. కానీ పెళ్లయిన భారతి గురించే ఆ దంపతులకు దిగులు.

భారతి అందమైన పిల్ల. ఆ ఊళ్లో కాలేజీ లేక పోవడంతో ఆమె చదువు హైస్కూలుతో ఆగిపోయింది. మిషన్ కుట్టుకునే మజీద్ మీద భారతి మనసుపడింది. కులం, మతం, జాతిభేదాలకి అతీతమైందే నిజమైన ప్రేమ అనుకుంది. తన ప్రేమ అతనితో ఎలా చెప్పాలో తెలియక ప్రేమ లేఖలు రాసింది. కానీ సిగ్గు, భయంవల్ల అతనికివ్వలేకపోయింది. చివరికి ఓ రోజు ఓ ఉద్విగ్న క్షణంలో.. 'నన్ను పెళ్లి చేసుకుంటావా?' అని అడిగిందతన్ని. 'మిమ్మల్నా? నాకూ, మీకూ ఎక్కడా?' అన్నాడతను.




ఈలోగా ఆదిశేషయ్యా దంపతులకి అనుకోని అవకాశం వచ్చింది. ఆ అవకాశం శాల్తీ పేరు శంకర్రావు. వీళ్ళకి దూరపు బంధువు. బాగా ధనవంతుడు. అతనికి నలభైఏళ్ళు. పదేళ్ల వెర్రి కూతురు. భార్య అగ్ని ప్రమాదంలో చనిపోయింది. అది ప్రమాదం కాదని చాలామంది అభిప్రాయం. ఏమైతేనేం ఆవిడ చావువల్ల యాభైవేల ఇన్సూరెన్స్ సొమ్ము సంపాదించాడు. ఆ డబ్బును రకరకాలుగా వినియోగించి లక్షలు సంపాదించాడు. ఇప్పుడతని కన్ను భారతి మీద పడింది. అతని రాయబారానికి ఆదిశేషయ్యా దంపతులు ఎగిరి గంతేశారు. భారతి ముందు కాదన్నా, శంకర్రావు ఇంట్లో రాణీవాస భోగాలకు ఆకర్షితురాలై అతన్ని పెళ్లి చేసుకుంది. అప్పటికామె వయసు ఇరవై కూడా లేదు.

మధ్యతరగతి కుటుంబాలలో పెద్దల్నే కాదు, యువమనసుల్ని కూడా డబ్బు ఎలా కలుషితం చేస్తుందో తులసీకృష్ణ అద్భుతంగా తెలిపారు. కొద్దికాలం భారతికి బాగానే వుంది. ఏడాది గడిచేలోపే భారతి మజీద్‌కి రాసిన ప్రేమలేఖలు శంకర్రావు చేతికి చిక్కి ఆమె సంసారం నాశనమైపోయింది. భారతిని పుట్టింటికి పంపించేశాడు శంకర్రావు. ఆరునెలలు తిరక్కుండానే మరో పెళ్లి చేసుకున్నాడు. ఆదిశేషయ్యా దంపతులు శంకర్రావు మీద కోర్టుకు వెళ్ళొచ్చు. స్తోమత లేదని కొంత, పరువుపోతుందన్న ఆత్మాభిమానంతో కొంత భారతిని భరించటానికే నిర్ణయించుకున్నారు. పెళ్ళికాని ఆడపిల్లల గురించి కన్నా పెళ్ళయి కొంతకాలం కాపురం చేసిన భారతి ఎక్కడ తప్పుదారి పడుతుందోనని ఆదిశేషయ్య బెంగ.

ఆదిశేషయ్యగారి మథన ఆడపిల్లల పెళ్ళిళ్ళు, పెద్దకొడుకు నిరుద్యోగం, మిగిలిన పిల్లల చదువు. ఆయనంతగా ఆయన ఈ సమస్యల్ని పరిష్కరించుకునే అవకాశం లేదు. ఏదో కలిసి రావాలి. ఏ దేవుడో కనికరించాలి.. చాలామంది మధ్యతరగతి ఇంటిపెద్దల్లాగే ఆయనా ఎదురు చూస్తున్నాడు. ఈ మధ్యతరగతి వర్గంలోనే ఓ రకం ప్రత్యేక వ్యక్తులున్నారు. రకరకాల ఎత్తులు, జిత్తులు వీళ్ళకి అలవాటు. వీళ్ళని మంచి లౌక్యులని, వ్యవహర్తలని అంటుంటారు. అలాంటివాడే సీతారాముడు, అనసూయమ్మకి అన్నగారు. ఓ రకంగా అతని వల్లే హరీంద్ర, శోభలకి పెళ్ళిళ్ళు అయ్యాయి.

బాగా పేరు, ప్రాపకమున్న పాపయ్య కూతురు ఇందిరతో హరీంద్ర పెళ్ళి, టీచర్ రాజారావుతో శోభ పెళ్ళి కుదిరాయి. పెళ్ళి కార్డులకని నాలుగెకరాల పొలం అమ్మేశాడు ఆదిశేషయ్య. అయినా హరీంద్రకు పాతికవేలు కట్నం వస్తున్నందుకు గాలిలో తేలుతున్నంత ఆనందం. రకరకాల మతలబులతోటి, సీతారాముడి మంత్రాంగంతోటి రెండు పెళ్ళిళ్ళూ అయిపోయాయి.

హరీంద్ర కాపురం పెట్టాడు. శోభ అత్తగారింటికి వెళ్ళింది. ఆదిశేషయ్య పొలం అమ్మిన డబ్బు హరీంద్ర లెక్చరర్ ఉద్యోగం లంచానికి కట్టాడు. పాత అప్పులు మిగిలాయి.

హరీంద్ర కాలేజీలో జీతాలు సరిగా రాక మామగారి పిలుపుతో అత్తగారింట్లో కాపురం పెట్టాడు. కట్నం అయిదువేలు చేతికి రాలేదన్న కారణంతో రాజారావు తల్లి శోభని పుట్టింటికి పంపించేసింది. రాజారావు అత్తగారింటికే వచ్చి భార్యతో గడిపి వెళ్ళిపోతున్నాడు. అత్తగారి పెద్ద దేవిడీలాంటి ఇంట్లో హరీంద్రకి బావుంది. భర్త వచ్చిపోతున్నందుకు శోభకి బాగానే వుంది. బావులేనిది, ఇబ్బంది పెరిగింది ఆదిశేషయ్యకే.

ఈ పరిణామాలతో ఆదిశేషయ్య మరింతగా

# మధ్యతరగతి మిథ్యాస్వరూపం!



'నత్తగుల్లలు' నవల 1975లో కేవలం ఇరవై ఆరు రోజుల్లో రాశాను. ఆనాటికి సాహిత్య పరంగా నాకు పెద్ద ఆశయాలేమీ లేవు. ఒక వారపత్రిక నిర్వహించిన పోటీకి పంపాలనే ధ్యేయంతో రాశాను. 1973లో నా 'రుతుపవనాలు' నవలకు బహుమతి ఇచ్చారు కదా! ఇప్పుడు మళ్లీ ఇవ్వరనుకుంటూనే పోటీకి పంపాను. కానీ ఆశ్చర్యంగా ఈ నవల కూడా ద్వితీయ బహుమతికి ఎంపికయింది. రచనా స్వభావం రీత్యా, రచనా విధానం రీత్యా ఆ రెండు నవలలకు సంబంధం లేకపోవడమే కాదు, పరస్పర విరుద్ధం కూడా! రెండూ ఎంపిక కావడం ఆనందాన్నిచ్చింది. మధ్యతరగతి మిథ్యా విలువల్ని కీర్తిస్తూ నవలలు వస్తున్నప్పుడు, పాఠకులు అందులో పడి కొట్టుకుపోతున్నప్పుడు 'నత్తగుల్లలు' వచ్చింది. ఈ నవల ధారావాహికంగా ప్రచురిస్తున్నప్పుడు పాఠకుల నుంచి అపారమైన ఆదరణ, ఊహించని స్పందన వచ్చింది. తరువాత విజయవాడలోని ప్రచురణ సంస్థ ఒకటి ఈ నవలను పుస్తకంగా ముద్రించింది. సుప్రసిద్ధ సాహితీ విమర్శకులు వల్లంపాటి వెంకటసుబ్బయ్య 'ప్రసిద్ధ కథా రచయిత, విమర్శకులు పి. రామకృష్ణ 'తులసీకృష్ణ' అన్న కలం పేరుతో రాసిన 'నత్తగుల్లలు' నవల సంచలనం సృష్టించింది. దృక్పథంలో, రచనా విధానంలో, పాత్ర పోషణలో అపూర్వమైన ప్రయత్నం' అని ప్రశంసించారు. ఇప్పటి పాఠకులకు ఈ నవలను పరిచయం చేస్తున్న 'చతుర'కు, సమీక్షించిన రాజారామమోహనరావుగారికీ కృతజ్ఞతలు!

**– పి. రామకృష్ణ**

చితికిపోయాడు. అతని కలలేవీ ఫలించలేదు కదా, పూర్తిగా చిందరవందరయ్యాయి. అతనిలో సవ్యమైన ఆలోచనేదీ మిగల్లేదు. అన్నీ వక్ర ఆలోచనలే. రిటైరయ్యాక జీవితం బావుంటుందని ఊహామాత్రంగానైనా అతనిలో మెదలటం లేదు.

రాజారావు అందంగా వుంటాడు. రాత్రిళ్ళు ఇక్కడే పడుకుంటాడు. భారతి ఇంకా ముసల్దికాలేదు. జ్యోతికి వయసొచ్చింది. మొన్న మల్లెపూలు తెచ్చి దానికే ఇచ్చాడు రాజారావు. వాళ్ళిద్దర్నీ కూడా లోబరుచుకుని రాజారావు కడుపులు చేస్తే? ముగ్గురికీ మొగుడవుతాడు! ముగ్గుర్నీ ఏలుకుంటే తన బరువు తగ్గుతుంది. ఎందుకు ఏలుకుంటాడు? ఇక్కడేవుంచి వచ్చిపోతుంటాడు!

కూతుళ్ళ గురించే కాదు, పెళ్ళాం గురించీ ఆదిశేషయ్యలో సరైన ఊహలు రావడం లేదు. ఆయాసమంటుంది. ఆ పక్కలో నెప్పంటుంది. ఈ డొక్కలో పోటంటుంది. అన్ని చెప్పేబదులు ఆ కాస్త గుటుక్కుమనకూడదూ? అసలు వీళ్ళందరికీ ఒకేసారి చావు రాకూడదూ? వాళ్ళంతా ఎందుకు, తనొక్కడే చచ్చిపోతే? అప్పుడు అందరూ సానుభూతితో వీళ్ళని బాగా చూస్తారు. రాజారావు కట్నం వదిలేస్తాడు. జాలిపడి పాపయ్య పాతికవేలు ఇస్తాడు. దాంతో హరీంద్ర దగ్గరుండి జ్యోతి పెళ్ళి చేస్తాడు. తమ్ముళ్ళని చదివిస్తాడు.. ఆదిశేషయ్య తలనిండా ఇలాంటి ఆలోచనలే. అలా అని అతను చచ్చిపోడు. అన్నిరకాలుగా దిగజారిపోయి, హీనమైన ఉద్దేశ్యాలతో, ఊహల్తో జీవచ్ఛవంలా బతుకుతాడు. అది ఒక మొద్దు స్థితి, స్తబ్ధ జీవితం! అదీ మధ్యతరగతి తత్వం! దాన్ని నిశితంగా, వివరంగా ఆదిశేషయ్యలో చూపించారు తులసీకృష్ణ. నత్తగుల్లకు చలనం ఉంది. కానీ ఎక్కడికీ ప్రయాణించని, అక్కడికక్కడే తిరిగే చలనం. ఎంత మాత్రం ప్రగతిలేని తనం!

అంతాసరే. దీనంతటికీ మధ్యతరగతి వ్యక్తుల్ని, వారి మనస్తత్వాల్నీ నిరసించటం న్యాయం కాదు. అనేక పరిస్థితులకు వ్యవస్థ విధానమే కారణం. 'నత్తగుల్లలు' నవలాకాలానికి ఇప్పటికీ చాలా మార్పులు జరిగాయి.

కానీ కష్టం, సుఖం, బాధ-సంతోషాల విషయంలో ఇప్పటికీ మధ్యతరగతి అంతే. తేడా అల్లా సుఖదుఃఖాల కారణాలతోనే కిందతరగతి వారితో పోల్చుకుని, తాము మెరుగనుకుని సుఖించలేరు. పై తరగతి ప్రలోభాలనుంచి తప్పించుకోనూ లేరు. ఎన్నో విలువైన వాక్యాలు, మనోవిశ్లేషణలు వున్న నవల ఇది. C

# చతుర ప్ర.జ.



**పాఠకుల ప్రశ్నలకు**
**ఉపన్యాసశిరోమణి, అభినవ వ్యాస**
**డా. కె. రామానుజాచార్య**
**సమాధానాలు**

*ప్ర. గతించిన పితృదేవతలు, ఇతర పెద్దల అస్థికల్ని ఎంతకాలంలోగా పుణ్యనదుల్లో నిమజ్జనం చేయాలి? సూర్య, చంద్ర గ్రహణాలతో ఏమైనా సంబంధం ఉందా?*

**– బి. తిరుపాలు,** నెల్లూరు

**జ.** పదకొండు రోజుల లోపు, ఇరవై తొమ్మిది రోజులలోపు, నూరు రోజులలోపు నిమజ్జనం చేయాలి. అలా వీలు కానపుడు సంవత్సరంలోపు చేయవచ్చు. అస్థి నిమజ్జనానికి, గ్రహణానికి ఎలాంటి సంబంధం ఉండదు. ఒకవేళ ఆ సమయంలో గ్రహణాలు సంభవిస్తే విశేష ఫలితం అనే తప్ప, గ్రహణం కోసం అస్థికల నిమజ్జనం ఆపాలి అని కాదు.

*ప్ర. రాముడు, కృష్ణుడు, భారతంలోని ప్రముఖులు అంతా ఉత్తర భారతదేశానికి చెందిన వారు. వారి ఆచారవ్యవహారాలు, భోజనాదులు అన్నీ దక్షిణ భారతంవారికి విరుద్ధం. పినతల్లి మోసం వల్ల రాముడు అడవిపాలయ్యాడు. పాండవులు పాండురాజుకు జన్మించనే లేదు. వ్యాసుడు, భీష్ముడు, కురువంశం.. ఇవన్నీ అసహజాలే! ఇలాంటి వారిని భగవత్స్వరూపాలుగా ఎలా భావించాలి? రామాయణ, భారతాలను కథలుగా మాత్రమే చూడాలా?*

**– కొటికలపూడి మధుసూదనరావు,**
నాగారం, నిజామాబాద్

**జ.** రాముడు, కృష్ణుడు భారతదేశంలో మాత్రమే కాదు, అఖిల భూమండలానికీ ప్రముఖులు. ఇప్పటి ఉత్తరభారతదేశ ఆచారాలే రాముడు, కృష్ణుడు కాలంలో ఉన్నాయనుకోవడం పొరబాటు. ఒకనాడు భర్త దేశాంతరం వెళ్లినా, అనుకూలంగా లేకున్నా, లోకాంతరం వెళ్లినా భార్య జుట్టు విరబోసుకునేది. ఆ కాలంలో జుట్టు విరబోసుకున్న స్త్రీని చూస్తే కట్టుబట్టలతో స్నానం చేయాలనేది ఆచారం. ఈనాడు జుట్టు విరబోసుకోవడం నాగరికత. ప్రాంతీయ, దేశీయ ఆచారాలు కాలానుగుణంగా మారుతుంటాయి. సంధ్యావందనాది కృత్యాలు, స్నాన యాగాదులు అంతటా ఒకేతీరుగా ఉంటాయి. మనకు విరుద్ధంగా ఉన్నా వారి ఆచారాలు తప్పు కావు. వారికి విరుద్ధంగా ఉన్న మన ఆచారాలూ తప్పు కావు.

ఇక పినతల్లి మోసం అసహజమా? ఈనాడు మోసమే నిత్యజీవన విధానం కాదా? అది పినతల్లి మోసం కాదు. రామాయణంలోని ఆంతర్యాన్ని తెలియక అలా భావిస్తారు. కైక, మందర, శూర్పణఖ మనకు దుష్టపాత్రలు. కానీ ఆ మూడు పాత్రలు శ్రీరామచంద్రునికి అత్యంత భక్తిపరిపూర్ణులు. దుష్ట సంహరణ, శిష్ట సంరక్షణ చేయడానికి శ్రీమన్నారాయణుని అవతారమైన శ్రీరాముడు అడవికి వెళ్లడానికి ఈ పాత్రలను ఒక సాకుగా చూపారు. ఋషులందరూ అడవులలోనే ఉంటారు కదా! నిజానికి ఈ ముగ్గురూ రామునికి ఉత్తమ సేవికలు.

ఇక వంశం, వారసత్వం, సంతానం అనేవి మన జీవితాలను, ఇప్పటి విధానాలను చూసి ఆనాటివి అసహజాలు అనుకోవడం తప్పు. సృష్టిలో మొదటి బిడ్డ బ్రహ్మ.. కమలంలో పుట్టాడు. ఇంతటి సృష్టి విస్తారానికి కారకుడైన దక్షుడు.. బ్రహ్మ అంగుష్ఠం నుండి పుట్టాడు. ఆడమగ కలయికతో పుట్టుక కర్మబంధంతో వస్తుంది. సంకల్పానుసారం కోరుకున్న వారి నుండి పుట్టడం దైవత్వం. అది భగవత్తత్త్వం. అసహజం కాదు. దాన్ని అవతారం అంటారు. లోకాన్ని రక్షించడానికి, తత్త్వోపదేశం చేయడానికి వ్యాసుడు, భీష్ముడు, పాండవులు అవతరించారు.




# చతుర ప్ర.జ.5



ఆచార వ్యవహారాలు.. పురాణాలు, ఇతిహాసాలు.. శ్రుతులు.. స్మృతుల పరంగా కలిగే మీ సందేహాలను క్లుప్తంగా రాసి పంపండి. మీ పేరు, చిరునామా, ఫోన్ నంబరు కూడా ప్రశ్నతో రాసి పంపండి. ఉప న్యాసశిరోమణి, అభినవవ్యాస **డా. కె. రామానుజాచార్య** ఈ ప్రశ్నలకు సమాధానాలు ఇస్తారు. ప్రతి ప్రశ్నకు ఈ కూపన్ తప్పనిసరిగా జతపరచాలి. కూపన్ జతపరచని ప్రశ్నలు పరిగణన లోకి తీసుకోబోమని గ్రహించ మనవి.

చిరునామా : **చతుర ప్ర.జ.** చతుర, ఈనాడు కాంపౌండ్,
సోమాజిగూడ, హైదరాబాద్ - 082

రామాయణ, భారతాలను కథలుగా కాక, లోకానికి పరమోపదేశంగా, పరమార్థోపదేశంగా భావించాలి. పెద్దల ద్వారా రహస్యాలను తెలుసుకోవాలి. అపార్థం చేసుకోకూడదు.

*ప్ర. 'ధనలక్ష్మీ యంత్రం' ధరిస్తే ధనప్రవాహం లభిస్తుందని ప్రసారమాధ్యమాల్లో ఊదరగొడుతున్నారు. అధర్వణవేదంలో ఈ విషయం ఉన్నట్లు కూడా చెబుతున్నారు. ఇదెంతవరకు సత్యం?*

**– పక్కి సుందరీకృష్ణ,** విజయనగరం

**జ.** భగవంతుని మీద నమ్మకం కలగటానికి, భక్తి కుదరడానికి భగవానుడే ధర్మ, అర్థ, కామ మనే పురుషార్థాలను ఏర్పరచాడు. ధర్మ కాంక్షులకు ధర్మస్వరూపుడైన భగవానుని ఆరాధన అలవడుతుంది. అర్థ కాంక్షులకే ఈ యంత్రాలు, మంత్రాలు, తంత్రాలు, వ్రతాలు, నియమాలు, ఉపవాసాలు అన్నీ. ఇవన్నీ కర్మవశాన తనకు సంపదలు రాకుంటే వాటిని రప్పించుకునే ప్రయత్నం.. మన బ్యాంకు అకౌంటులో అవసరమైనంత డబ్బు లేకుంటే 'లోను' తీసుకుంటాం కదా! అలాగే మన రాతతో మన కోరికలు తీరకుంటే భగవంతుని దగ్గర 'లోను' తీసుకోవటమే ఈ యంత్ర, మంత్ర, పూజలు. ఇది చేసినా మనకు ఎంత రావడానికి యోగ్యత ఉందో అంతే ఇస్తాడు. మళ్లీ మనం అప్పు తీర్చాలి కదా! బ్యాంకులో కూడా అర్హత చూసే అప్పిస్తారు. ఎన్ని యంత్రాలు పెట్టుకున్నా మన యోగ్యతను పరిశీలించే భగవానుడు ఇస్తాడు. ఇవన్నీ కామనలను పెంచి, సంసారంలో ఆశలను.. అనుబంధాన్ని పెంచి పూర్తిగా ప్రకృతి దాసులను చేస్తాయి. భగవంతుని భగవంతునిగా ఆరాధించాలి. ఫలాన్ని కోరకూడదు. తల్లిదండ్రులకు చేసిన సేవకు ఫలితాన్ని కోరడం ద్రోహం కాదా? ఫలితం కోరి ఆరాధించడం కూడా అంతే!

*ప్ర. భీష్ముడు ఉత్తరాయణం వచ్చాక మరణించినట్లు భారతం చెబుతోంది. ఉత్తరాయణం ప్రాశస్త్యం ఏమిటి?*

**– తిప్పావఝుల కామేశ్వరమ్మ,**
దగదర్తి, నెల్లూరు జిల్లా

**జ.** అగ్ని, జ్యోతి, పవలు, శుక్లపక్షం, ఉత్తరాయణం.. ఇవి కాలంలో సత్త్వగుణ వర్ధకాలు. పొగ, చీకటి, రాత్రి, కృష్ణపక్షం, దక్షిణాయనం.. ఇవి రజస్తమోగుణ వర్ధకాలుగా చెప్పారు. వెలుగు జ్ఞానానికి, చీకటి అజ్ఞానానికి సూచన. అందుకే పవిత్రమైన కాలంలో, పవిత్రమైన ఊర్ధ్వలోకాలకు వెళ్లాలని భీష్ముడు అలా కోరుకున్నాడు.

*ప్ర. సంక్రాంతిలో భోగి, కనుమ, పెద్దపండుగలను దేనిని సూచిస్తూ జరుపుకుంటారు?*

**– ఎం.డి. అఫ్సర్‌వలీషా,**
ద్వారపూడి, తూ.గో. జిల్లా

**జ.** సూర్యభగవానుడు ఒక్కొక్క నెలలో ఒక్కొక్క రాశిలో సంచరిస్తుంటాడు. ఒక రాశిలో నుంచి ఇంకొక రాశిలోనికి ప్రవేశించడాన్ని, ఈ రెండు రాశుల స్పర్శను సంక్రాంతి అంటారు. సూర్యభగవానుడు కర్కాటక రాశిలో ప్రవేశించడం దక్షిణాయన పుణ్యకాలం, మకర రాశిలో ప్రవేశించడాన్ని ఉత్తరాయణ పుణ్యకాలం అంటారు. మేష, తులా రాశుల్లో ప్రవేశించడాన్ని విషువత్కాలమంటారు. ఉత్తరాయణం దేవతలకు పగలని, దక్షిణాయనం రాత్రి అని వ్యవహరిస్తారు. భోగి అంటే బ్రాహ్మీముహూర్తం, సంక్రాంతి సూర్యోదయం, కనుమ ప్రథమ యామం. దేవతలు దేవదేవుని పూజించే

## రూ.116/- బహుమతి పొందిన ఉత్తమ ప్రశ్న

ప్ర. లంకలో హనుమంతుడు సీతమ్మ వద్ద తన బృహత్‌రూపాన్ని ప్రదర్శించినపుడు కావలివారు కానీ, ఇతరులెవరు కానీ చూడకపోవడం ఎలా సాధ్యమైంది? లంక నిరంతర పర్యవేక్షణలో ఉంటుంది కదా! సీతాదేవి వద్ద పెద్ద ఎత్తున రాక్షసులను కాపలా ఉంచారు కదా?

**– కన్నెపల్లి నారాయణమూర్తి,**
జీడిమెట్ల, సికింద్రాబాద్

**జ.** కథా విధానం, ఆనాటి సామాజిక ఆచారాలు, కట్టుబాట్లు తెలిస్తే ఈ సందేహం రాదు. హనుమంతుడు వచ్చాక, సీతను చూసిన తరువాత తెల్లవారుజామైంది. రావణాసురుడు వచ్చి మాట్లాడి వెళ్లాడు. ఆ తరువాత రాక్షస స్త్రీలు సీతను బెదిరించారు. అపుడే త్రిజట తన కల గురించి చెబుతుంది. దాని తరువాత సీత ఆత్మహత్యా ప్రయత్నం, హనుమంతుడు పలకరించటం, పరస్పర విశ్వాసం.. ఆ తరువాత హనుమంతుడు నా వీపుపై కూర్చోమనటం, సీత కాదనటం, విశ్వరూప ప్రదర్శన.. ఇదీ సన్నివేశ పరంపర. మరి సీతా హనుమంతులు అంతసేపు మాట్లాడుకున్నారు కదా! రాక్షస స్త్రీలు చూడలేదా? వినలేదా? ఆ సందేహం ఎందుకు రాలేదు? వారంతా వింటున్నారు. చూస్తున్నారు.

కానీ అంతా నిద్రలో ఉన్నారు. కలలోని భాగమనుకున్నారు. అందుకే అశోక వనం ధ్వంసమైతే సీతను అడిగారు. రావణాసురునికి చెప్పారు. హనుమంతుని తోకకు నిప్పు పెడితే ఆ వార్తను సీతమ్మకు చెబుతూ నీతో ఇంతసేపు మాట్లాడిన కోతి తోక కాల్చారు అని చెప్పారు. వారు చూస్తున్నారు.. వింటున్నారు. కానీ అదొక మంచు కప్పిన రీతిలో నిశ్చేష్టులుగా ఉన్నారు. అది సీతా హనుమంతుల ప్రభావంగా తెలియాలి.

సమయం అయినందున ప్రధానం. ప్రతి నెలకూ ఒక సంక్రాంతి ఉంటుంది. మకర సంక్రాంతి ప్రాధాన్యాన్ని బట్టి ముందురోజు భోగి అంటారు. ఆ రోజు గోదాదేవి శ్రీరంగనాథుని వివాహమాడి ఆయనతో భోగాన్ని అనుభవించినందున భోగి అంటారు. ఇక కనుమ అనేది పండుగకు మరునాడు జరుపుకునేది. కనుమ అనగా సంధి అని అర్థం. ఈ పండుగకు, రాబోవు పండుగకు సంధి అని అర్థం.

ప్ర. 'భవబంధాలు' అంటారు కదా! అంటే ఏమిటి? అవి ఎన్ని? వాటి తీరుతెన్నులు వివరించగలరు?

**– యు. చిట్టిబాబు,**
న్యూ పాల్వంచ, ఖమ్మం జిల్లా

**జ.** భవము అంటే సంసారం. సంసారంలో బంధించే వానిని భవబంధాలు అంటారు. వివాహం, భార్య, భర్త, సంతానం, బంధువులు, మిత్రులు.. ఇలా నేను ఇక్కడే ఉండాలి.. ఇలాగే ఉంటాను.. మరెక్కడికీ వెళ్లను అని ఈ సంసారంలోనే కదలకుండా ఉంచేవి అన్నీ భవబంధాలు. సంసారమే జైలు, భార్య, భర్త, పుత్రులు, పుత్రికలు, ఆస్తులు.. ఇవన్నీ సంకెలలు. కొందరికి స్త్రీ వ్యామోహం. ఇంకొందరికి పురుష వ్యామోహం. ఇలాగే ఆస్తి, మద్యం, వేట, ఆట, పాట ఇలా ఎన్నింటి మీదనో వ్యామోహాలు. ప్రకృతి మీద మోహం పెంచేవన్నీ భవబంధాలే. అవి అనంతాలు.

ప్ర. దేవతలలో ఎక్కువ శాతం రెండు పెళ్లిళ్లు చేసుకున్నవారే ఉన్నారు ఎందుకు?

**– వాడపల్లి రమాదేవి,**
ఆరుగొలను, కృష్ణా జిల్లా

**జ.** దేవతలే కాదు, ప్రాచీన కాలంలో మానవులు కూడా రెండు, నాలుగు పెండిండ్లు చేసుకున్నారు. ఆనాడు వివాహ వ్యవస్థలో కామవ్యవస్థ తక్కువ. ధర్మ వ్యవస్థ ఎక్కువ. అంతమంది భార్యలున్నా సవతుల తగాదాలు లేవు. ఎక్కడో ఒకచోట తటస్థిస్తాయి.

ధర్మరక్షణలో భాగం వివాహ వ్యవస్థ. సాంఘిక సంయమనానికి మూలస్తంభం. సమాజ సామరస్యానికి మూలం వివాహ వ్యవస్థ. ఏకత్వంలో బహుత్వం.. బహుత్వంలో ఏకత్వం వివాహ వ్యవస్థలో ఆంతర్యం. భేదంలో సహజీవనం, సహజీవనంలో సంయమనం, సంయమనంలో సఖ్యం, సఖ్యంలో సానురాగం. నీతి నియమాలను పెంచేది, పోషించేది. ఆనాటి సాంఘికాచారపు కట్టుబాట్లు సమాజాన్ని చక్కని దారిలో నడిపించాయి. అలాగే నడిపించాలి. అదే నిజమైన సాంఘిక వ్యవస్థ. ©

# భామనే.. సత్యభామనే..!

32

'వాహ్! లైఫ్ హో తో ఐసీ!' బాలీవుడ్ సినిమాతో తెరంగేట్రం చేసిన ఆమె హీరోయిన్‌గానే కాదు, అనేక వైవిధ్య పాత్రల్లో నటించి విలక్షణమైన నటిగా పేరు తెచ్చుకుంది. 'అహల్య' పొట్టి సినిమాతో దేశవ్యాప్తంగా సంచలనం సృష్టించింది. ప్రస్తుతం రెండు హాలీవుడ్ సినిమాల్లో నటిస్తోంది. తెలుగు, తమిళం, మరాఠి, బెంగాలీ వంటి భాషల్లోనూ నటించి విమర్శకుల ప్రశంసలు అందుకున్న ఆ అందాల భామ రాధికా ఆప్టే! ఆమె సౌందర్య రహస్యం ఆమె మాటల్లోనే.

## సొగసు చూడతరమా...

అందం అనేది కేవలం బాహ్యరూపంలో కనిపించేది కాదు. మనసులోని భావాలకు, చేస్తున్న పనికి సారూప్యం ఉన్నప్పుడే అందంగా కనిపిస్తామని నమ్ముతాను.

జంక్‌ఫుడ్‌కు ఆమడ దూరంలో ఉంటా. కార్బోహైడ్రేట్లు ఎక్కువగా ఉండే పదార్థాల జోలికి వెళ్లను. విటమిన్లు, ప్రోటీన్లు పుష్కలంగా లభించే పదార్థాలకు ప్రాధాన్యమిస్తాను. అల్పాహారంలో తృణధాన్యాలు, గోధుమ రొట్టెలు, పాలు లేదా పండ్ల రసం తీసుకుంటా. మధ్యాహ్నం సలాడ్‌తో రెండు లేదా మూడు రొట్టెలు తీసుకుంటా. రాత్రి భోజనంలో చేపలు లేదా చికెన్ తప్పసరి. ప్రతి రోజూ పడుకోవడానికి ముందు తప్పకుండా గ్రీన్ టీ తాగుతా.

రకరకాల వర్కవుట్స్ చేస్తాను. అందుకు దాదాపు రెండుగంటలు వెచ్చిస్తాను. మొదట్లో వారానికి రెండుసార్లు మాత్రమే జిమ్‌కు వెళ్లేదాన్ని. ప్రస్తుతం నాలుగుసార్లు వెళ్తున్నాను. గుండె సంబంధిత వ్యాయామం చేస్తాను. దాంతో పాటు పరిగెత్తడం, సైక్లింగ్ చేస్తుంటా. చిన్న చిన్న బరువులు కూడా ఎత్తుతుంటా. షూటింగులతో బిజీగా ఉన్నపుడు పరిగెత్తడం, ఉదయపునడక, ఈత వంటి వాటిని వ్యాయామంగా ఎంచుకుంటా.

సేకరణ : సంధ్యారాణి

# ఆరోగ్యవనంలో ఆనంద సుమాలు



పెద్దవాళ్ళకేమైనా శారీరక మానసిక సమస్య లెదురైతే ఎదుర్కోవడం తెలుసు. ఒకవేళ తెలీకపోయినా ఇతరుల సాయం తీసుకోగలరు. కానీ ఆలోచనాశక్తి, అనుభవజ్ఞానం లేని పిల్లలకేమైనా సమస్య వస్తే నివారణా మార్గం కాదుగదా కనీసం బాధను విడమర్చి చెప్పడం కూడా చేతకాదు. ఒక్కోరోజు స్కూలుకెళ్ళలేనంత నిద్ర ముంచుకొస్తుంది. ఒక్కోసారి తిండి సహించక కడుపులో తెములుతుంది. అలా చెప్తే అమ్మానాన్నలు తిడతారే తప్ప అర్థంచేసుకోరు. ఇక కడుపునొప్పి, కాళ్ళనొప్పి, ఆకల్లేకపోడం, అతిగా ఆకలేయడం లాంటివెన్నో. తొండ ముదిరి ఊసరవెల్లయినట్లు జలుబును నిర్లక్ష్యంచేస్తే న్యుమోనియాకి దారితీస్తుంది. శ్వాసకోశ ఇబ్బందులకు నిద్రపట్టకపోగా ఊపిరాడదు.

ఇంకా విటమిన్ల లేమి, నిద్రలేమి, ఊబకాయం, దుమ్ముధూళితో వచ్చే ఎలర్జీలు, అరగకపోవడం, లాంటి బోల్డన్ని సమస్యలు వుండనే వున్నాయి. అలాగే వాతావరణ మార్పిడి, వేడి, చలవ వంటి రకరకాల కారణాలకు లోటులేదు. ఒక్కమాటలో చెప్పాలంటే తలనుంచి కాలి వరకూ ఎన్నెన్నో నొప్పులు. శారీరక జబ్బులే కాదు, మానసిక రుగ్మతలూ బోల్డన్ని వున్నాయి. ఒకప్పుడు మామూలు జ్వరాలూ జలుబులే వుండేవి. ఇప్పుడు డెంగీ, స్వైన్‌ఫ్లూ లాంటి వ్యాధులొచ్చి హడలగొడ్తున్నాయి. కొన్ని సమస్యలు మాత్రమే పిల్లలు స్పష్టంగా చెప్పగలరు. ఇంకొన్ని అరాకొరా చెప్తారు. మరికొన్ని అసలే చెప్పలేరు. ఫలితాన్నిబట్టి పెద్దలే ఇబ్బందేంటో, మూల సమస్యేంటో గ్రహించాలి. అశ్రద్ధ చేస్తే ఆనక భారీ మూల్యం చెల్లించుకోక తప్పదు.

అసలిన్నిన్ని జబ్బులు.. అందునా పసిమొగ్గల్లాంటి పిల్లలకెందుకొస్తున్నాయంటే ఒత్తిడి, ఆందోళన, కాలుష్యం, జీవనశైలి లాంటి బోల్డన్ని కారణాలున్నాయి. పిల్లలకు హానిచేసే ఎన్నెన్నో నోరూరించే పదార్థాల ప్రకటనలపై అదుపాజ్ఞల్లేవు. దాంతో చాక్లెట్లు, చిప్సు, శీతల పానీయాలెక్కువయ్యాయి. అందులో పోషకాహారం శూన్యం, ఊబకాయం ఘనం. ఫలితం చిన్నతనంలోనే నానా జబ్బులతో గందరగోళం. ఆహారం సంగతలా వుంటే టీవీవల్ల అర్ధరాత్రిదాకా నిద్ర లేకపోవడం. మనిషన్నాక పౌష్టికాహారం, స్వచ్ఛమైన గాలి,



## టెక్ గురూ!

### ఇన్‌షాట్స్







inshorts
stay informed

సమయాభావం వల్ల నేడు వార్తలు పూర్తిగా చదవడం కష్టమే. అయితే మన చుట్టూ ఏం జరుగుతోందో, వింతలు విశేషాలు, వ్యాపారం, మార్కెట్‌లోకి కొత్తగా వస్తున్న వస్తువులు ఏంటో తెలుసుకోవాలన్న తపన సర్వసాధారణం. అందుకే అంతర్జాతీయ, జాతీయ తాజా వార్తలను సంక్షిప్తం చేసి 60 పదాలకు కుదించి ఎప్పటికపుడు అందిస్తోంది ఇన్‌షాట్స్ యాప్! ప్రభుత్వ పాలసీలు, బాలీవుడ్ విశేషాలు, టెక్నాలజీ, స్పోర్ట్స్ వంటి విషయాలు క్షణాల్లో వచ్చేస్తాయి. ఎక్కువ వివరాల్లోకి వెళ్ల కుండా ముఖ్యమైన సమాచారాన్ని అందరికీ అందించడమే ఈ యాప్ ఉద్దేశ్యం. అలా ఎప్పటికపుడు తాజా సమాచారం తెలుసుకోవచ్చు. సమయమూ ఆదా.. సమాచారమూ సొంతం! ఈ సమాచారాన్ని ఫొటోలు, వీడియోలతో సహా మిత్రులకు షేర్ చేయవచ్చు కూడా. గూగుల్ ప్లే నుంచి ఈ యాప్‌ను ఉచితంగా డౌన్‌లోడ్ చేసుకోవచ్చు.

### బ్యూటీప్లస్

ఫొటోలో అందంగా కనపడాలని ప్రతిఒక్కరూ కోరుకుంటారు. అయితే కొంతమందికి మొటిమల మచ్చలు, చిన్న చిన్న గాయాల మచ్చలు ఉండి ఫొటోల్లో అనుకున్నంత అందంగా కనపడరు. అపుడు చిన్నబుచ్చుకుంటుంటారు. వయసు పైబడిన వారికి ముడుతలూ కనిపిస్తుంటాయి. అటువంటి సమస్యలు లేకుండా మన ఫొటో మరింత అందంగా కనపడేలా చేస్తుంది బ్యూటీప్లస్ యాప్! గూగుల్ ప్లే నుంచి ఈ యాప్‌ను నేరుగా డౌన్‌లోడ్ చేసుకోవచ్చు.

---

నీళ్ళు, కంటినిండా నిద్ర, వ్యాయామాలు అవసరమనే నిపుణుల హెచ్చరికల్ని పట్టించుకోకుండా ఆరోగ్యం పాడైందని బాధపడితే ఏం లాభం? ఇంట్లో చేసే ఇడ్లీ మంచిదని తెలిసినా బయటి పిజ్జాబర్గర్లకే పిల్లలు పడిపోతారు. అంతెందుకు బ్రెడ్డు శ్రేష్ఠమని నిన్నటిదాకా అనుకున్నాం. అందులోనూ కల్తీ వుందని తాజా అధ్యయనాలు చెప్తున్నాయి. దీన్నిబట్టి తిండి విషయంలో ఎంత అప్రమత్తంగా వుండాలో మనమే ఆలోచించుకోవాలి. రంగూరుచీ చూసి పెద్దవాళ్ళకే నోరూరుతుంది. పిల్లలనగా ఎంత? వాళ్ళకి నచ్చజెప్పాల్సింది పెద్దలే. అసలు హానికరమైన పదార్థాలపై ఆంక్షలు విధించాల్సిన, మితిమీరితే పూర్తిగా నిషేధించాల్సిన బాధ్యత ప్రభుత్వానిది.

ఇంకొన్ని మనసును మెలిపెట్టే సమస్యలున్నాయి. వారిలో చూపు తగ్గడం, వినికిడిశక్తి లోపించడం లాంటి సమస్యల్ని గుర్తించకుండా 'చెవుడా, కళ్ళు కనిపించవా?' తరహాలో నిందించడంవల్ల చిన్నారులెంత నొచ్చుకుంటారో కదూ! కొందరు పిల్లలు నీరసంగా, నిరుత్సాహంగా వుంటే ఇంకొందరు పాఠాలమీద మనసు లగ్నం చేయలేని ఇబ్బందితో బాధపడ్తున్నారు. మరికొందరికి హైపరాక్టివ్ డిజార్డర్. ఇలాంటి సమస్యలు ఎందుకు ఉత్పన్నమౌతాయో మూలాలేంటో కనిపెట్టి వైద్యునిసాయంతో పరిష్కరించుకోవాలి. పూర్వం వృద్ధాప్యంలో వచ్చే మధుమేహం, కిడ్నీ, రక్తపోటు, గుండెజబ్బులు ఇప్పుడు బాల్యంలోనే వస్తూ హడలగొడ్తున్నాయి. ఇదెంత దారుణమని బాధపడి ప్రయోజనంలేదు. నాలుగంటే నాలుగు సూత్రాలు పాటిస్తే చాలు

1. వేళకు పోషకాహారం
2. తగినంత నిద్ర
3. రోజుకు రెండు లీటర్ల నీళ్ళు
4. గంటసేపు ఆటపాటలు, వ్యాయామం

ఈమాత్రం చేయగల్గితే మన ఆరోగ్యం మన చేతుల్లో వుంటుంది. అప్పుడిక ఆరోగ్యవనంలో ఆనంద సుమాల్లా వుంటుంది జీవితం.

– నాగరత్న

అన్నీ సరైన సమాధానాలు రాసిన వారిలో డ్రా ద్వారా ఎంపికైన ఈ విజేతకు రూ.150/- త్వరలోనే అందుతాయి.

**కావూరి కనకదుర్గ**
ఆంధ్రాబ్యాంక్ పక్కవీధి,
గుణదల, విజయవాడ
పిన్ : 520 004

## చతురంగం - 66 జవాబులు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 పు | న్న | 2 మి | | 3 అ | ఆ | | 4 జా | త | 5 ర |
| రా | | 6 త | ల | పు | | 7 వే | గు | | మ |
| 8 వ | 9 స్త్ర | ము | | 10 రూ | 11 ప | ము | | 12 ప్రా | ణి |
| 13 స్తు | అ | | 14 త | పం | చా | | 15 ఢం | కా | |
| | 16 ము | 17 దు | రు | | 18 రీ | 19 తి | | 20 రం | 21 జీ |
| 22 సు | | 23 కా | గు | 24 లు | | 25 వా | న | | వు |
| 26 ప్ర | 27 మా | ణం | | 28 క | 29 రా | చీ | | 30 కా | డు |
| 31 భా | వి | | 32 న | లు | గు | | 33 పా | శీ | |
| త | | 34 పా | | 35 క | లు | 36 పు | | 37 మా | 38 చే |
| 39 ము | ని | ప | త్ను | లు | | 40 త్రి | మా | త | లు |

## సరైన సమాధానాలు రాసిన వారు

1. విన్నకోట పద్మావతి, హైదరాబాద్, 2. యు. విజయశేఖర రెడ్డి, కూకట్‌పల్లి, 3. కె. చంద్రశేఖర శర్మ, నంద్యాల, 4. చిలుముల ప్రమీల నసీరుద్దీన్, కరీంనగర్, 5. పి. దేవసేనమ్మ, జూబ్లీహిల్స్, 6. పప్పు కామేశ్వరరావు, అమలాపురం, 7. సముద్రాల సంతోష్ కుమారాచార్య, కొడిమ్యాల, కరీంనగర్ జిల్లా, 8. ఆర్. గురుప్రసాదు, ఎమ్మిగనూరు, 9. కె. సుబ్రహ్మణ్య కుమార్, కర్నూలు, 10. గోగాడ సోమశంకర సుహాస్, హొస్పేట, కర్ణాటక, 11. వి.ఆర్.కె. అల్లమరాజు, కాట్రేనికోన, 12. సంజీవిగారి నాగశ్వేత, బెంగళూరు, 13. పి. శుభ, బంజారాహిల్స్, 14. తటవర్తి రామకృష్ణ, హైదరాబాద్, 15. వి.వి. సత్యనారాయణ శెట్టి, తిరుపతి, 16. జి. శోభ, తిరుపతి, 17. చిల్లర సీతారామారావు, వనస్థలిపురం, 18. నోరి శివప్రకాశం, నెల్లూరు, 19. ఎస్.టి.పి. కృష్ణమాచార్యులు, నాగోల్, 20. పాలకుర్తి సుధీర్ కుమార్, మాదాపూర్, 21. నియాజ్ అలి, ఉప్పరపల్లి, హైదరాబాద్, 22. యు. చిట్టిబాబు, న్యూ పాల్వంచ, 23. జి. విశాలి, తిరుపతి, 24. పుల్లాపంతుల వెంకట సుబ్బారావు, భీమవరం, 25. ధరణి పద్మాసన, నల్లకుంట, 26. ఆమంచర్ల వరలక్ష్మి, మణికొండ, 27. యు.యు.యు. ఎమ్మిగనూరు, 28. కస్నేపల్లి నారాయణరావు, జీడిమెట్ల, 29. చింతలపాటి శివశంకర శాస్త్రి, లింగంపల్లి, 30. పేర్వేల రాంబాబు, మణికొండ, 31. సి. భారతి, హైదరాబాద్, 32. అడపా ధనలక్ష్మి, పర్లాకిమిడి, ఒడిశా, 33. నేమాన సుభాష్ చంద్రబోస్, విశాఖ, 34. అడపా సత్యనారాయణ బాబ్జీ, హైదరాబాద్, 35. వాసపల్లి వెంకట సత్య గంగరాజు, విశాఖ, 36. ఆర్. ప్రసన్న, అనంతపురం, 37. అక్షింతల సంజీవశర్మ, అనంతపురం, 38. కొల్లూరి నాయుడమ్మ, ఇంకొల్లు, 39. ఎన్. చంద్రబాబునాయుడు, ఇంకొల్లు, 40. ఏకా సావిత్రి, బాపట్ల, 41. బి.వి. నరసింహారావు, పేరాల, 42. జె. జయశ్రీ, ట్రూప్‌బజార్, 43. గరికిపాటి కృష్ణమూర్తి, కడప, 44. గోశికే లింగయ్యగారి వేంకటేశం, చిక్కడపల్లి, 45. ఎస్. శివసుబ్రమణ్యం పిళ్లై, తిరుపతి, 46. జె. రాజగోపాలరావు, ఎ.ఎస్. రావు నగర్, 47. యిర్రి భక్తవత్సలరావు,చిలకలూరిపేట, 48. వి. రమాదేవి, బెంగళూరు, 49. కిడాంబి రఘుపతి, అల్వాల, 50. టి. ఉషశ్రీ, దగదర్తి, నెల్లూరు జిల్లా, 51. దేవళ్రాజు వెంకట నరసింహారావు, చైతన్యపురి, 52. తూములూరు సత్యనారాయణమూర్తి, ఖమ్మం, 53. కె.వి. దుర్గామోహన్‌రావు, వనస్థలిపురం, 54. చివుకుల నాగమణి, రాజమహేంద్రవరం, 55. ఎ.వి. శివారెడ్డి, యర్రగుంట్ల, కడప జిల్లా, 56. జి. పార్వతీదేవి, వెంగళ్రావు నగర్, 57. బిళ్లపాటి స్రవంతి, అనకాపల్లి, 58. ఎం. లక్ష్మీరాజ్యం, హైదరాబాద్, 59. తోటపల్లి శశికళ, గుంతకల్లు, 60. ఎం.వి. జోగేశ్వరశర్మ, అరసవల్లి, 61. గొట్టుముక్కల బ్రహ్మానందము, శేరిలింగంపల్లి, 62. కొత్తపల్లి సుధాదేవి, చీరాల, 63. పి.వి. రవికుమార్, తిరుపతి, 64. తోకల నారాయణరావు, మచిలీపట్నం, 65. గురజాల వరలక్ష్మి, ఉప్పిలి, తూ.గో. జిల్లా, 66. పసుమర్తి జయశ్రీ, హైదరాబాద్, 67. ఎన్. ప్రేమలత, ప్రగతినగర్, 68. యర్రమిల్లి విజయలక్ష్మి, బెంగళూరు, 69. ఎం. వాణీగిరిజాదేవి, రాజమహేంద్రవరం, 70. విస్సాప్రగడ వెంకటసుబ్బారావు, రాజమహేంద్రవరం, 71. పి. శివప్రసాద్, పాలకొండ, శ్రీకాకుళం జిల్లా, 72. సాలగ్రామ నారాయణరావు, నరసన్నపేట, 73. పెమ్మరాజు శ్రీవెంకట సుబ్బారావు, భీమవరం, 74. అన్నంరాజు పూర్ణచంద్రరావు, మద్రిపాలెం, విశాఖ, 75. వాసిరెడ్డి సుభాషిణి, శేరూరు, గుంటూరు జిల్లా, 76. పక్కి శ్రీదేవి, గంట్యాడ, విజయనగరం జిల్లా, 77. సి. అల్వాల్ రెడ్డి, సరూర్‌నగర్, 78. టి. లక్ష్మీకుమారి, మచిలీపట్నం, 79. డి. బాలామణి, అనకాపల్లి, 80. ఎస్.ఆర్.కె. మూర్తి, విజయవాడ, 81. నందూరి కార్తికేయాచార్య, కూకట్‌పల్లి, 82. టి.ఆర్. బాలకృష్ణారావు, రాజమహేంద్రవరం, 83. యు.ఎస్.ఎమ్., లాలాపేట, 84. బి. రామమోహనరావు, శీరామకృష్ణాపురం, 85. ఈ. కృష్ణకుమారి, విజయవాడ, 86. మంథెన వీర రాఘవరాజు, దివాన్‌చెరువు, తూ.గో. జిల్లా, 87. రామచంద్రుని ఇందిరాదేవి, వనస్థలిపురం, 88. పి.వి. సుబ్బలక్ష్మి, వైజాగ్, 89. పరుచూరి భవానీదేవి, గుంటూరు, 90. వి.వి. సీత, ఎస్.ఆర్. నగర్, 91. సరిపల్లి నాగభూషణరావు, విజయనగరం, 92. భోగరాజు అంజలీ మైత్రేయి, విజయనగరం, 93. ఎ. రామకృష్ణ, జీడిమెట్ల, 94. చింతపల్లి నాగేశ్వరరావు, విజయవాడ, 95. వడ్డీ సుశీల, టెంపుల్ అల్వాల్, 96. కాకర్లమూడి కృష్ణప్రసాదు, తణుకు, 97. ఆర్. చంద్రశేఖర్, మలక్‌పేట, 98. చాడ మైథిలి, నూజివీడు, 99. ఎన్. లీలాప్రసూనాదేవి, సికింద్రాబాద్, 100. డా. సి.కె. శాస్త్రి, గుంటూరు, 101. ఆర్. సత్యకృష్ణకుమార్, నొయిడా, ఉత్తరప్రదేశ్., 102. కస్తూరి వెంకుబాబు, గుంటూరు, 103. హెచ్.జె. సువర్ణ, కర్నూలు, 104. కె. వేణుగోపాల్, కర్నూలు, 105. యస్. రాజు, కర్నూలు, 106. జి. శ్రీధాత్రి, పుంగనూరు, 107. గరికిపాటి శ్రీసూర్యచైతన్యకృష్ణ, కాకినాడ, 108. సి.వి.ఎస్.ఎస్. శాస్త్రి, వైజాగ్, 109. పిశిపాటి శైలజాజానకి, నవులూరు, 110. పి. శేషారావు, విశాఖపట్నం, 111. ఎన్. పద్మావతి, ఒంగోలు, 112. గండ్లూరు బలరామశాస్త్రి, నాచారం, 113. వాసా ఉమాదేవి, తగరపువలస, విశాఖ జిల్లా, *(..128లో)*




# పెసరపప్పు హల్వా

## కావలసిన పదార్థాలు

★ పెసరపప్పు - 1 కప్పు
★ నెయ్యి - 10 టేబుల్ స్పూన్లు
★ యాలకుల పొడి - 1/3 టీస్పూను
★ బాదం - 10
★ కిస్మిస్ - 1 టేబుల్ స్పూను
★ చిక్కటి పాలు - 1 కప్పు
★ పంచదార - 1 కప్పు

## తయారుచేయు విధానం

పెసరపప్పును ఐదు గంటలు నానబెట్టాలి. నీళ్లు పూర్తిగా వంపి మిక్సీ పట్టాలి. బాణలిలో నెయ్యి వేసి వేడి చేయాలి. దానిలో మిక్సీ పట్టిన పెసర పిండిని వేసి కలుపుతూ ఉండాలి. పచ్చివాసన పోయి బాగా ఉడికే వరకు సన్నని మంట మీద కలుపుతూ ఉండాలి. ఆ సమయంలోనే మరో స్టవ్ మీద గిన్నెలో పాలు, పంచదార, రెండు కప్పుల నీళ్లు పోసి సన్నని మంట మీద పెట్టాలి. పంచదార కరిగి పాలు మరిగే వరకు కలుపుతూ ఉండాలి. పెసర పిండి బాగా ఫ్రై అయి బంగారురంగులోకి వచ్చాక పాల మిశ్రమాన్ని అందులో పోసి కలపాలి. నీరు ఇంకిన తరువాత యాలకుల పొడి, బాదం పలుకులు, కిస్మిస్‌లు వేసి కలిపాక మంట తీసేయాలి.. పెసరపప్పు హల్వా రెడీ! వేడి మీద చాలా రుచిగా ఉంటుంది!

# రవ్వలడ్డు

## కావలసిన పదార్థాలు

* బొంబాయి రవ్వ - 1 కప్పు
* కొబ్బరి పొడి - 1/3 కప్పు
* నెయ్యి - 1/4 కప్పు
* పంచదార - 3/4 కప్పు
* జీడిపప్పు పలుకులు - 2 టేబుల్ స్పూన్లు
* కిస్‌మిస్ - 1 టేబుల్ స్పూను
* యాలకుల పొడి - 1/4 టీస్పూను
* వేడిచేసిన పాలు - 1/4 కప్పు

## తయారుచేయు విధానం

బాణలిలో ఒక టేబుల్ స్పూను నెయ్యి వేసి కాగాక జీడిపలుకులు గోధుమ రంగుకు వచ్చేవరకు వేయించాలి. తర్వాత కిస్‌మిస్‌లు కూడా అందులో వేసి ఒక నిమిషం సేపు వేయించాక ఒక గిన్నెలోకి వాటిని తీసుకోవాలి. మిగిలిన నెయ్యి కూడా బాణలిలో వేసి కాగాక రవ్వ పోసి ఐదు నిమిషాల పాటు రవ్వ వేయించాలి. అందులోనే కొబ్బరి పొడి కూడా వేసి మరో రెండు నిమిషాలు వేయించాలి. అడుగంటకుండా, రవ్వ అంతా వేగే విధంగా కలుపుతూ ఉండాలి. ఇపుడు యాలకుల పొడి, పంచదార, వేయించి పెట్టిన జీడిపలుకులు, కిస్‌మిస్ కూడా అందులో వేసి కలపాలి. తర్వాత స్టవ్ కట్టేసి ఆ మిశ్రమంలో పాలు కలిపి లడ్డూలు చేసుకోవాలి. గాలి చొరబడని డబ్బాలో పెడితే పది రోజుల వరకు నిల్వ ఉంటాయి.

## చిట్కాలక్ష్మి



★ రెండు మిరియాలు, రెండు లవంగాలను మెత్తగా పొడిచేసి కప్పు నీళ్లలో వేసి మరగబెట్టిన కషాయంలో బెల్లం కలిపి తాగినట్లయితే జలుబు వల్ల వచ్చే దగ్గు, జ్వరం ఇట్టే పోతుంది.

★ మైక్రోవేవ్ ఓవెన్‌లో గుండ్రటి గిన్నెలు వాడడం వల్ల వేడి అంతటా వ్యాపించి వంట త్వరగా పూర్తవుతుంది. విద్యుత్తు ఆదా అవుతుంది.

# చతురంగం - 67 ఆధారాలు

## అడ్డం

1. అర్జునుడి ధనుస్సు (3)
3. ఉత్తరభారతీయుల ఆహారం ఇది అంటారు (3)
5. ఇవి కావు - - (2)
7. 'దేవాలయం' కి వికృతి రూపం (3)
9. అలనాటి హాస్యనటి (4)
10. చీకటి రోజు (3)
11. పందేనికి పెట్టింది (2)
12. నడుమ కోల్పోయిన స్త్రీ (2)
13. 'ఇడియట్' నాయిక (3)
14. తెలుగు రూమ్ (2)
15. గెలలో వరుసగా అతుక్కుని ఉన్న అరటి పళ్ల గుత్తి (2)
16. జీవితమే ఒక నాటక - - (2)
18. మంచానికి అల్లేది తడబడింది (3)
20. తపస్సు చేసేవాడు (2)
22. డబ్బు (3)
23. బోన్సాయ్ వృక్షాలంటే - - - వృక్షాలు (3)
25. చూడలేము (3)
27. వాద్యాన్ని పలికించడం (3)
28. ఏనుగు (3)
29. డాంబరు (2)
31. గోపాలుడి చేతిలో ఉండేది (3)
33. కథలు రాసేవారిని, చెప్పేవారిని ఇలా అంటారు (4)
34. శివుని వాహనం పేరుతో కృష్ణా జిల్లాలో ఓ నియోజకవర్గం (4)
35. మాంగల్యానికి మూడు - - - వేస్తారు (3)

## నిలువు

1. జాతిపిత (2)
2. స్వాతంత్ర్య పోరాటంలో ఉగ్రూతలూగించిన నినాదం (5)
3. గుండ్రంగా ఉండే భూమ్యాది వలయం (2)
4. పుట్టినవారెవరూ తప్పించుకోలేనిది (3)
5. జాగ్రత్తగా మసలడం (4)
6. తెలుగు సంవత్సరాల్లో రెండోది (3)
8. మాటలు రావడానికి పిల్లలకు పోసేది (2)
10. కన్ను (2)
11. భద్రము (4)
13. నెత్తురు (3)
15. 'విపుల' లో ఎక్కువగా వేసేవి (7)
17. చందనము, సువాసన (3)
19. వర్షం (2)
21. కచ్చితంగా మిగులు, సమూహం (3)
24. అక్కినేని నాగేశ్వరరావు చివరి సినిమా (2)
26. 'మునిగిపోగా' గజిబిజి (4)
28. పరికరం (3)
29. వివాహంలో స్త్రీకి మెడలో కట్టేది (2)
30. పక్షి (3)
32. లక్ష్మీదేవి (2)
33. ఎక్కువ (2)

(125వ పేజీ తరువాయి...)

114. డి. లక్ష్మీప్రసన్న, మల్లాపూర్, 115. బిక్కునూరి రాజేశ్వర్, నిర్మల్, 116. ఎస్. జయరామ్‌మోహన్, నిజాంపేట, 117. గౌరి పెద్ది రాజ్యలక్ష్మి, సోమాజిగూడ, 118. గుఱ్ఱాల పద్మావతి, కూర్మన్నపాలెం, 119. ధప్పూరి సుధాదేవి, సీతారాంబాగ్, 120. సత్ర సాల రామకృష్ణ, అనంతపురం, 121. ఎన్. విజయ, కాకినాడ, 122. కె. సావిత్రి బాలాజీ ప్రసాద్, కర్నూలు, 123. కె. శిభూ షణం, కర్నూలు, 124. కె. వరుణ్ ప్రమోద్, నంద్యాల, 125. పి.బి. సీతాదేవి, నరసాపురం, 126. లోకే పుష్పలత, మంథని, 127. సయ్యద్ జమీలాబేగం, కర్నూలు, 128. కూనపరెడ్డి సత్యనారాయణ, పెనుగొండ, 129. డా. కె. రాఘవవాచార్య, కాకినాడ, 130. వారణాసి విజయలక్ష్మి, పొడగట్లపల్లి, 131. కనకల కుమారి, విజయవాడ, 132. మల్లవరపు శ్రీనివాసరావు, నెల్లూరు, 133. కె. నాగభూషణం, మౌలాలి, 134. ఎం.వి. సుబ్రహ్మణ్యం, రాజమహేంద్రవరం, 135. వి. పరశురాం, మహబూబ్‌నగర్, 136. శ్రీదాస్యం లక్ష్మయ్య, హుస్నాబాద్, 137. జయశ్రీ ప్రభాకర్, జలుమూరు, 138. కొల్లూరు వేంకట రమణమూర్తి, పర్లాకిమిడి, ఒడిశా, 139. బి. సుధ, కామారెడ్డి, 140. టి.వి.వి. విజయసుబ్బలక్ష్మి, రాజమహేంద్రవరం, 141. గుఱ్రపు పురుషోత్తము, హనుమకొండ, 142. పి. గీత, హనుమకొండ, 143. వరయోగి రామ్‌మోహన్, బొల్లారం, 144. తిప్పావఝుల తులశమ్మ, ఈస్ట్ ఆనందబాగ్, 145. ఆర్.వి. సిహెచ్. నాగేశ్వరరావు, శ్రీకాకుళం, 146. భారతం సీత, కాకినాడ, 147. కె.వి.ఎస్.ఎస్ మూర్తి, హైదరాబాద్

# చతురంగం - 67

**రూ.150/- బహుమతి** | **గడువు తేదీ : అక్టోబరు 17**

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | ■ | 3 | | 4 | ■ | 5 | 6 |
| | ■ | 7 | 8 | ళం | ■ | 9 | | | |
| ■ | 10 | | | ■ | 11 | | ■ | 12 | |
| 13 | | | ■ | 14 | | ■ | 15 | త్రం | ■ |
| | ■ | 16 | 17 | ■ | 18 | | | ■ | 19 |
| 20 | 21 | ■ | 22 | | | ■ | 23 | 24 | |
| ■ | 25 | 26 | | ■ | ■ | 27 | | | ■ |
| 28 సా | | | ■ | 29 | | ■ | | ■ | 30 పు |
| | ■ | 31 | 32 | | ■ | 33 | | | |
| 34 | | | ■ | 35 | | | | ■ | |

పంపినవారి పేరు: ----------------------------------------

వయసు (      ) చిరునామా : --------------------------------

--------------------------------------------------------

---------------- పిన్ : ---------- ఫోన్ : ----------------

**నిబంధనలు**

✦ చతురంగాన్ని ఇదే పేజీలో పూర్తిచేసి పంపాలి. ✦ తుడుపులు, కొట్టివేతలు ఉండరాదు. ✦ మా 'కీ'తో సరిపోలిన పూరణలనే పరిగణనలోకి తీసుకుంటాం. ✦ గడువు తర్వాత అందిన పూరణలు పరిశీలించం. ✦ ఎక్కువ మంది సరైన జవాబులు రాస్తే డ్రా తీసి విజేతను ఎంపిక చేస్తాం. ✦ ఒక్కొక్కరు ఎన్ని కూపన్‌లైనా పంపవచ్చు. ✦ ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు. ✦ చతురంగంతోపాటు చతుర, విపుల కూపన్లు అన్నీ ఒకే కవరులో పంపవచ్చు.

చిరునామా : చతురంగం **చతుర**, ఈనాడు కాంప్లెక్స్, సోమాజీగూడ, హైదరాబాద్- 82
ఫోన్ : 040 - 23318181, Ext : 6658, 6532

Printed, Published, Edited & Owned, by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Colorama Printers Private Limited., 15/A/1, S.V. Co.Op Industrial Estate, Jeedimetla, Ranga Reddy District, 500 055 Telengana. Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 9959021802; Rajahmundry: 2468992; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 241101; Kurnool: 252813; Kadapa: 270011; Tadepalligudem: 228881; Warangal: 9959021804; Khammam: 9959021806; Nizamabad: 245661; Mahabubnagar: 8008706125; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982498; Chennai: 28242036; Bangalore: 25599686. Toll Free Help line No. 18004258888 (Hyd.), www.eenadu.net.






# ఇంటింటి రామాయణం!

'వేరే కులంవాణ్ణి చేసుకున్న ఆ పిల్ల ఇకపై మనింటికి రావడానికి వీల్లేదు. మీరెవరైనా ఆ ఇంటి గడప తొక్కితే కాళ్ళిరగ్గొడతాను' అంటూ హుకుం జారీచేశాడు రామారావు.

సంప్రదాయం పేరుతో మహా ఛాందసంగా వుండే ఆయన భావాలేవీ కూతుళ్ళకు నచ్చలేదు.

అలాని ఎదురుచెప్పే శక్తీయుక్తీ వాళ్ళలో లేవు.

నోరు విప్పాలంటే భయం.

గడప దాటాలంటే అనుమతి కావాలి.

అతి చిన్నదానిక్కూడా పెద్ద పోరాటమే చేయాలి

ఆ అణచివేత పిల్లలపై ఎలాంటి ప్రభావం చూపింది?

ఎదుగుదలను ఆపేసిందా? తిరుగుబాటు ధోరణి రగిలించిందా?

ఇంటింటి రామాయణాన్ని రమణీయంగా కళ్ళముందుంచిన

**శీలా సుభద్రాదేవి నీడలచెట్టు** చతుర నవంబరు కానుక!

## బోనస్‌గా...

- లైలామజ్ను, సలీమ్ అనార్కలిలను తలపించే ప్రేమకథాంశంతో పంజాబీ అపురూప నవలిక **మీర్జా సాహిబా**
- **నవలావలోకనం**లో ఆరుగురు యువతీ యువకుల మనస్తత్వాలు, ఆలోచనలు, ఆవేదనలు, ఆవేగాలతో మమేకమైపోయి పాఠకులచే వదలకుండా చదివించే **డా. పి. శ్రీదేవి కాలాతీత వ్యక్తులు** నవలపై సమీక్ష

**CHATURA** Telugu Monthly, Dt. of publication : October 1, 2016.
Postal Regd No. HD/ 965/2015-2017 RNI No. 32186/1978